# చైనా సంక్షిప్తచరిత్ర

రచన: ఎల్. కారింగ్‌టన్ గుడ్‌రిచ్

అనువాదం: ఎస్. వి. రంగాచార్యులు




ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

First Edition : 5,000 Copies.
September, 1959.

# CHAINAA SAMKSHIPTA CHARITRA

*Telugu translation of*

A SHORT HISTORY OF THE CHINESE PEOPLE (ABIRIDGED)

*by*

L. Carrington Goodrich

*Translated by*

N. V. Rangacharyulu

---

*Published under the auspices of*

The Southern Languages Book Trust

(Telugu Book : 37)

---



**Price : Rs 1-60**

*Published by :*

ADARSA GRANDHA MANDALI,

VIJAYAWADA

*Printed at :*

Victory Press,

VIJAYAWADA

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదంచెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదంచేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారతమహానాయకుల జీవితచరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తా మెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వా రెన్నెన్ని పాట్లుపడినది ముందు తరాలవారంతా తెలుసుకుని ఉండటం అవసరం.

తత్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం — ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు, కథానికలు, ప్రాచీనకళాసంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలనుగురించిన ఈగ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షి

జాత్యభాషలలోనికి అనువదింపచేయటం ఈ ద్వితీయగ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడి నప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది. ఈ దక్షిణ భాషాపుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలంకాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు, ఏ. ఎల్. ముదలియార్, వైస్ ఛాన్సెలర్,

7-10-58. మద్రాసు విశ్వవిద్యాలయం.

# చైనా సంక్షిప్త చరిత్ర

## ఒకటవ అధ్యాయము

చైనాదేశములోని మహానదీపరిసరములు, మైదానములు క్రమముగ జనసమ్మర్దములైన పద్ధతి; వారికిజెందిన ఆసియాఖండభూభాగములోనూ, సముద్రతీరపు ద్వీపములలోనూ, వారివ్యాప్తిని అభివృద్ధినిగురించి తెలియ జేయుగాథయే చైనాదేశపుచరిత్ర. ఈ చరిత్ర క్రీ. పూ. వేలకొలదియేండ్ల క్రిందట అనగా సుమారు అయిదువేలసంవత్సరములకుపూర్వము ప్రారంభమై యుండవచ్చునని "హెబ్రెయిల్"వంటి చైనా ఇతిహాసములు నిర్ణయించెను. కాని ఇటీవలలభ్యమైన పరిశోధనలవలన ఈచరిత్ర ప్రారంభకాలము యింకా పురాతనమైనదని తెలియుచున్నది. దీనినిపట్టి. చేపలుపట్టుట, వేట; భూమిపైన జీవితావసరములగు పంటలనుపండించుట మొదలగుపనులు మానవుడు నేర్వకుండినాటిస్థితిలోనే చైనానుకూడ మనము చిత్రించుకొనుటకు అవకాశ మొసగుచున్నది.

పదిలక్షల సంవత్సరములకుపూర్వము ఉత్తరచైనాదేశములో "హొమి నిడ్సు" (Hominids) అనే మానవపూర్వజాతి నివసించుచుండెను. నిక్క బొడుచుకొనిన శరీరములుగలిగి రెండుకాళ్లపై వారు నడచుచుండిరి. తమ కవసరమగు పనిముట్లను తయారుచేసుకొనుటలో వారు నిపుణులు. అగ్నిని ఉపయోగించువిధము వారికి తెలియును. వారిమేదస్సు ధారణశక్తి 850-1220 c. c. లు, అంటే గొరిల్లా, చింపాంజి మొదలగుజంతువుల ధారణశక్తికి రెండింతలు, కాని వారిధారణశక్తి సామాన్యమానవునిధారణశక్తికి(1350c.c.) తగ్గియేయుండెను. వారు స్వచ్ఛముగా మాటలాడగలిగియుండిరి. వీరిజాతి నుంచిగాని, వీరికిసంబంధించిన మానవపూర్వజాతినుంచిగాని ఆసియాలోని

హోమొ శాపియన్సు (Homo sapiens) క్రమక్రమముగా "మంగొలాయిడ్" (Mangoloid) జాతిగా పరిణామముజెందినట్లు కనబడుచున్నది.

ఉత్తరచైనాదేశములోను, దానికి ఉత్తరపు, పడమటిదిశలలోనుండిన విశాలభూభాగములోనునిరంతరాయముగాకలుగుచున్నమానవపరిణామమునకు గొప్ప హిమానీవ్యాప్తముచే భంగముకలిగెను దానిఫలితముగా భయంకరమైన మంచుపొరలు యెన్నడునూ సంభవించని అత్యంత ఉద్ధృతములగు ప్రచండ వాయువును పుట్టించెను. ఆ వాయువులు "టారిమ్" "గోబీ" మైదానములలోని మట్టిని లేవదీసి పసుపునది (Yellow River) గర్భమునంతటిని మేట వేసెను. ఈ దుస్థితి మానవునిజీవితమును దుర్భరముగావించి కొంతకాలము వరకు అచటనుండి వారు వెడలిపోవునట్లుచేసినది. ఈ మంచుప్రాబల్యము అంతమైనపిదప యీ మానవ పూర్వజాతికి విస్పష్టమగు మానవస్వరూపము యేర్పడినది. ఈకాలమునాడే అనగా పన్నెండువేల సంవత్సరములపూర్వము యీ మానవులు ఉత్తరఅమెరికాకును, జపానుదేశమునకు వలసపోవప్రారంభించిరి, తమకు వలయుపనిముట్లను తయారుచేసుకొను శక్తిసామర్థ్యములు మునుపటికంటె అభివృద్ధిగాంచెను వారు చిన్నచిన్నగుంపులుగా నివసించుచుండిరి, దుంపలు, సస్యములను పండించుటలోను, చేపలు, మృగములను పట్టుటలోను విశేషజ్ఞానమును సంపాదించిరి. యినుముఖనిజముపైనుండు మట్టిని ఎర్రచూర్ణముగా తయారుజేయుచుండిరి. ఆరు, యేడువేలసంవత్సరములకుపూర్వము వారు పెద్దగుంపులుగాజేరి భూమిలోత్రవ్వబడిన గోతులలో నివసించుచుండిరి. వారు పందులను మచ్చికచేయుచుండిరి. మోటురకపు మట్టి పాత్రలను తయారుచేయుచుండిరి. రాతివాయిగల పారలు వారికి ప్రధానమైన సేద్యపుపనిముట్లుగా నుండెను. విల్లు, అంబులు వారి రక్షణాయుధములు.

శతాబ్దములు గడచిపోగా వారు తమపరివారములో కుక్కలనుకూడ జేర్చిరి. జొన్నలు వారిప్రధానమైనపంట. దానితోపాటు గోధుమలు, మెట్టవరి పండించుచుండిరి. చేపలను పట్టుట, మృగములను వేటాడుట వారు అనుసరించుచునేయుండిరి. తమరక్షణార్థము వెదురుబల్లెమును తయారుచేసుకొనిరి. చర్మములు, చెట్టుబెరడు, జనపనారలతో తయారుచేయబడిన దుస్తులను ధరించుచుండిరి. నారదుస్తులు వారికి వెచ్చదనమును గలుగజేయుచుండెను.

కొన్నిప్రాంతములలో మట్టిపాత్రపరిశ్రమ అభివృద్ధిగాంచుచుండెను. కుమ్మరసారెపై వారుపాత్రలను తయారుచేయుచుండెడి. వాటిలో కొన్నిటికి రంగులు వేయుచుండిరి. వీరుతయారుచేసినవస్తువులలో బోలుకాళ్లుగలిగిన ముక్కాలిపొయ్యి ఒకటి. నిప్పుపై దీనినివుంచి ఆహారపదార్థములను వచనముచేయుచుండిరి. వీరు శిలాయుగమునకు జెందినవారు. మానకపు అవసరములకు ఆభరణములకు, అలంకారములకు వీరు గవ్వలను వాడుచుండిరి.

తరువాతవచ్చిన శతాబ్దములలో "షాంటంగ్" అగ్రమునుండి "హాంగ్‌చౌ" అఖాతమువరకు సముద్రతీరమునకు దూరముగానున్న "హోనాన్" రాష్ట్రమువరకును వలసలు (colonies) బయలుదేరెను. ఇట్టి వలసలు 70 యుండి 750,000 చదరపుటడుగుల విస్తీర్ణమునుగలిగియుండెను. ఈ ప్రదేశములకు మట్టితో ప్రాకారపుగోడలు కట్టబడెను భూగర్భములో కట్టబడిన నివాసములు వలయాకారముగా చదునైననేలమీద నుండెను. ఈ గృహములమధ్య నిప్పునుచేయుకొని, వచనముచేసుకొనుటకు పొయ్యి అమర్చబడియుండెను. వ్యవసాయము వీరిప్రధానవృత్తి. దానితోపాటు వారు వేటాడుట, చేపలనుపట్టుట, పశువులను మచ్చికచేయుట మొదలగువృత్తులను అవలంబించుచుండిరి. పందులు, కుక్కలతోపాటు వారు గుర్రములను, గొఱ్ఱెలను, పశువులనుకూడ పెంచుచుండిరి. మృతులైనవారిని వారినివాసముల మధ్యదీర్ఘచతురస్రమైన గోతులనుత్రవ్వి, బోరగిలపరుండబెట్టి పూడ్చుచుండిరి.

నత్తగుల్లలు, ఆలిచిప్పలతో రకరకములగు పనిముట్లను తయారుచేయుచుండిరి. పలుచగానుండి నిగనిగలాడు నల్లనిమట్టిపాత్రలను తయారుచేయుటలో వారు నిపుణులు.

పరంపరాగతమైన చైనాచరిత్ర వ్రాసినరచయితలు యీకాలమునకు పిదప 5 వందలసంవత్సరములకాలమును చైనాదేశమునుపాలించిన ప్రథమ రాజవంశీయుని పేరిట "షియా" యుగముగా పేర్కొనిరి. ఆయుగము క్రీ.పూ. 1914 సం. మొదలు క్రీ. పూ. 1523 వరకు వ్యాపించియుండెనని ఒక ముఖ్యమగు మూలపత్రముద్వారా తెలియుచున్నది. ఈ అయిదుశతాబ్దముల లోను ఒకరితరువాతనొకరుగా వచ్చిన రాజులు నగరరాజ్యములనుపాలించినట్లు యితిహాసములు తెలుపుచున్నవి. కంచుతోచేయబడిన ఆయుధములను

ఉపయోగించువిధానము ఆకాలపుప్రజలకు తెలియును. వారు యుద్ధములకు రథములలో పోవుచుండిరి. వ్యవసాయము, పట్టుపరిశ్రమ వారివృత్తులు. వారి భావములను పుస్తకములలో నమోదుచేయుచుండిరి. పైవిషయములనునిర్ధారణ జేయుటకు ఎట్టిఆధారములను లేవు. దీనికిపిదపవచ్చిన చరిత్రనుండి పునసకందు జేయబడినశిల్పములు, శాసనములు, ప్రాచీనములైనవి కాకపోయినను కొన్ని వందలసంవత్సరములకాలపు చైనాచరిత్రను మనకు రుజువుపరచుచున్నవి. "షియా" యుగము అసలే లేకుండినను పసుపునది (Yellow River) ప్రాంతపు చేరువప్రదేశములలో కంచుపోతపోయుట. పట్టుపురుగుల ఉపయోగమును కనుగొనుట వా రెరుంగుదురు. వారు వ్యవసాయమునందును, యుద్ధములందును చక్రములను వాడుచుండిరి, వ్రాతగుర్తులు (అక్షరములు) వ్రాయుట వాడుకలోనికితెచ్చిరి. నాగరికతాభివృద్ధికి ఈవిధముగా ప్రథమ సోపాన మేర్పడెను.

చరిత్రయుగము: షాంగ్ (C.A. 1523–1028 B. C)

చైనాచరిత్రప్రారంభకాలము సుమారు క్రీ. పూ. రెండవవేయి తుది కాలమని చెప్పవచ్చును. ఇటీవలనే అనగా 1924 సం.లో ప్రొఫెసర్ థామస్ ఫ్రాన్సిస్‌కార్టల్ అను చరిత్రకారుడు చైనాచరిత్రప్రారంభకాలమును చైనీయ పూర్వచరిత్రయుగమునకుచెందినదిగా వ్రాసియుండెను. చైనా ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు నవీన హోనాన్ ప్రదేశపు యుత్తరభాగమునందున్న నదిపొడుగున తిరిగి భూగర్భములోనుండిన అనేక ప్రముఖవస్తువులను బయటకుతీసి వాటి ఆధారములతో పై నిర్ణయమును తిరిగి 1928 సం॥లో మార్పుచేసిరి. ఏదెట్లున్నను "చారిత్రక" అనుపదమున కొక ప్రత్యేకత కనబడుచున్నది. కాని యీ అయిదువందలసంవత్సరములలో సంభవించిన సంఘటనలు తయారైనవస్తువుల ఆధారముతో యిదమిత్థమని ధైర్యముగా చెప్పజాలము. క్రీ. పూ. 9, 8 శతాబ్దములవరకు చైనాచరిత్రలో వ్రాయబడిన అంశములకు తేదీల నిర్ణయము లేదు. ఒక్కొకచోట నుండినను, వాటిని కడుమెలకువతో గమనించవలసియుండును.

(క్రీ. పూ. 1523-1028) మధ్యకాలమును రాజధానికి సమీపమున నున్నప్రదేశమును పాలించిన "షాంగ్" (దీనినే తరువాత "యిన్" అని

పేర్కొనిరి) రాజవంశము పేరిట, "షాంగ్" యుగముగా పేర్కొనిరి. ఈ "షాంగ్" వంశపు మూలోత్పత్తి ఊహామాత్రముగానే యున్నది.

పరంపరానుగతమైన యీ వంశచరిత్ర ఆధారముతో ప్రథమ షాంగ్ రాజులు 1800 నగరరాజ్యములను లోబరచుకొనిరని, యీ నగరరాజ్యముల నన్నిటిని యేకముచేయు తలంపుతో వీరినందరిని కూడదీయుటకు వారు అప్పుడప్పుడు గురుతరకష్టములను యెదుర్కొనవలసియుండుట నిశ్చయము. రాజధానినగరమును వారు విశేషముగా మార్చుచుండిరి. రాజనివాసస్థలములు కడు రహస్యముగా నుంచబడెను. ఈ రాజధానినగరములో నెచటనుండెనో యెవరికి తెలియకుండెను. "షాన్సీ" ఆగ్నేయదిశవైపు "షియా" ప్రాంతమున నొక నగరముండెనని యూహింపబడెను. ఏదెట్లున్నను క్రీ. పూ. సుమారు 1300 సంవత్సరముల ప్రాంతమున ఒకప్రభువు తన పరిజనముతో నవీన ఎన్యాంగ్ ప్రదేశమునకు పోయి అచట ప్రభుత్వభవనములు, అంతఃపురములు, దేవాలయములు, సమాధులు మొదలగువాటితో ఒకనగరమును నిర్మించెను.

ఈ రాజధానినగరపరిచయముద్వారా లోగడ మరుగుపడియుండిన అనేకవిషయములు వెలువడెను. శిథిలభవనములు, వాటిలోని వస్తుసామగ్రి తేమ, మానవుని విధ్వంసకచర్యలు మొదలగు వైపరీత్యములనుతట్టుకొని నిలిచి యున్నవి. శిల్పశాస్త్రపరిజ్ఞానముతోపాటు రక్షణాయుధములు, కార్యకలాపముల కుసంబంధించినపాత్రలు మొదలగువానిద్వారా ఎన్నియోవిషయములుగుర్తింప బడినవి ఆనాడు వ్రాయబడినపత్రములలో కొలదిభాగమునుమాత్రమే నిస్సం దేహముగ ఋజువుపరచుచుండిన లెఖ్కకుమిక్కుటముగా లభించిన శాసన ములు, విశేషముగా శాసనశిథిలములు మనకు ఎన్నియోవిషయములను తెలియ జేసినవి. ప్రత్యేకమతగురుబృందముచే తుచ్ఛపుమాంత్రికవిద్యలు ప్రయోగింప బడుచుండెను. ప్రభుత్వపురికార్డులను భద్రపరచుటకు ప్రభుత్వములో ఒక ప్రత్యేకశాఖ యుండినట్లు కొన్నిశాసనములద్వారా తెలియుచున్నది. లోహము, గుల్లలు, ఎముకలమీదనేగాకుండా షాంగ్ చైనీయులు కొయ్య, వెదురు, పట్టుమీదకూడ వ్రాయుచుండిరని యీ శాసనములద్వారా తెలియుచున్నది. వ్రాతఫలకములకనుగుణముగా కత్తి లేక గంటము, కుంచెలు, పొగమసితో తయారుచేయబడిన సిరా వ్రాత పరికరములుగా వాడబడుచుండెను.

లిపియొక్క ప్రాచీనతమలక్షణమువలనను, రెండువేల మాటలకు పైగా వ్రాయబడియుండుటవలననూ, క్రీ.పూ. 18 వ శతాబ్దికిపూర్వమే కొంత చరిత్ర యుండినట్లు సూచించుచుండెను. కాని వ్రాత ఎచటఎపుడు ప్రారంభింపబడినదో ఎవరికితెలియదు. సూర్యుడు,వానఅనుమాటలకు గుర్తులను చైనావారు తమకు తామే కల్పించుకొనియుండవచ్చును. వారు కనిపెట్టిన చిహ్నములలో చాలమటుకు పసుపునదీలోయలోనే అభివృద్ధిగాంచియుండెను. కనుగొనబడిన వాటిలో యెక్కువచిహ్నములలో చైనావారిభావములు విస్పష్టమగుచున్నవి. ఈచిహ్నములు వేరొకపద్ధతిలోనుండెను. వారిచిహ్నములు శరీరవిభాగములు, జంతువులు, పక్షులు, వృక్షములు, వాగులు, కొండలు, తెప్పలు, ఆయుధములు, గ్రహములు మొదలగు సామాన్యవస్తువులను సూచించుచుండెను. ఆ లిపి వారిభావములను, బొమ్మలరూపముగా దెలియజేయుచుండెను. "సింటు"లో లభించిన విషయములనుగురించి ఆకాలపు సార్థకవిజ్ఞానమును గురించి, యీ లిపి, గుర్తులు అమూల్యమైన సంగతులను మనకందజేసెను. అత్యంతత్వరితముగా వర్ధిల్లుచున్న శాస్త్రముతో పరిచయములేనివారిచే వ్రాయబడిన వ్యాఖ్యానములను అత్యంతశ్రద్ధతో స్వీకరింపవలసియున్నది. లిఖిత భాషనుగురించి కనుగొనబడిన విశేషసమాచారము మనకు లభ్యమైనను, మాటలాడుభాషనుగురించినసంగతి చాలతక్కువ. మాటలక్రమము,మనసర్వనామములు, అవ్యయములు మనభాషను పోలియుండినను, వచనములుగాని, లింగములనుగాని చూపుమార్పులు నామవాచకములో లేకుండెననియు, క్రియలకు రూపాంతరభేదములు లేకుండెనని అప్పటిశాసనములు తెలుపుచున్నవి. తరువాత కొంతకాలమునాటి మాటలసముదాయమును తెలుసుకొని, ఉచ్చారణ యూహింపవచ్చును. ఎముకలమీదను, గుల్లలమీదను భద్రపరచబడినవే కాకుండా యింకా యెక్కువమాటలు వాడబడియుండెను. చాలా భాషలుకూడ యుండియుండవచ్చును. పది శతాబ్దములపిదప ఒక అధికార ప్రాబల్యము గలశాఖ ఒకరకపువ్రాతను ప్రవేశపెట్టినప్పుడు శాసనపూర్వకముగా వ్రాత సమస్య తీరెనుగాని, యింతవరకు వివిధభాషలు సవరణలతో అమలునందుండెను. రాజ్యసభలలోనూ, తదితరచోట్లను నుండులేఖకులు ప్రభుత్వ రాజ్యాంగకృత్యములను నిర్వహించుటకు నియమింపబడినవర్గములలో నొక

వర్గమునకు జెందియుండిరి. ప్రభుత్వాధికారి రాజు. ఆయనకు ఒకరుగాని ఇంకా ఎక్కువమందిగాని రాణులుండిరి. రాజే యుద్ధములు వేటలు నడుపు నాయకుడు. ప్రకృతిశక్తుల ప్రీతికి ప్రజలొసగు బలిదానమునకు ఆయన మతాచార విధులను నిర్వర్తించు మధ్యవర్తిగానుండెను. తనకు సందేహాస్పదముగానుండు సమస్యలను ఎదుర్కొనవలసివచ్చినప్పుడు రాజు తనపితృదేవతల సలహా నపేక్షించుచుండెను. పితృదేవతలపూజకు ఇదియే ప్రథమసోపానమై యుండవచ్చును. వారసత్వపుటధికారము అగ్రజునుండి తమ్మునికి ప్రాప్తించి పిదప మరల అగ్రజునిపుత్రులకు చెందుచుండెను.

నగరప్రభుత్వము బాగుగా వృద్ధినొందెను. రాజధానినగరములోని వివిధప్రభుత్వోద్యోగులకు బిరుదులుండెడివి. మతగురువులు ప్రభుత్వసహకారులుగా నుండిరి. ఆచారసంస్కారములకు సంబంధించిన యుత్సవములకు ఆధ్వర్యమువహించుచుండిరి. వారు దేవాలయములలోని రాజవంశపు పితృదేవతలకు, షేన్ కో దేవతలకు బలులనిచ్చుచుండిరి. పంచాంగనిర్ణయము వారి హస్తగతమైయుండెను షాంగ్ పంచాంగము, కొంత అస్తవ్యస్తముగానుండినను, సుస్థిరముగనుండెను. ఋతువులకనుగుణ్యముగానుండునట్లు పంచాంగము తరచు సవరింపబడుచుండెను. కనిష్ఠ నిర్ణీతకాలప్రమాణము 10 దినములు. అట్టి మూడుకలిసి ఒకమాసము. ఆరు పదిదినములకాలము అనగా అరువది దినములకాలము ప్రధాననిర్ణీతకాలము. అట్టి 6 కాలచక్రములు ఒకసంవత్సరము అవసరమైనప్పుడు పంచాంగ నిర్ణయాధికారులు ఆరుఋతువులసంవత్సరమునకు ఒకటి, రెండు, సామాన్యముగా మూడుపదిదినములకాలమును చేర్చుచుండిరి. ఒకప్పుడు రెండుమాసములను కలిపిరి. ఆ సంవత్సరమునకు 14 మాసములుండెను. అధికమాసములనుచేర్చు ఈపద్ధతి యిప్పటికిని అమలులో మున్నది.

ఈ పంచాంగమును గుణించువారు సూక్ష్మబుద్ధిగలవారుగను, బాధ్యతగలవారుగను నుండిరి. రాజుపై ప్రజలఆదరణ ఈ పంచాంగకర్తలమీదనే విశేషముగా నాధారపడియుండెను. మూఢవిశ్వాసముగల ప్రజలు తమప్రభువు భూతములతో ప్రసంగించగలడను విశ్వాసమును గలిగియుండిరి. భూతములసంజ్ఞలఅర్థమును గ్రహింపజాలనిచో, తమరాజు వాటి ఆదరణాభిమాన

ములకు దూరుడయ్యేనని వారినమ్మకము. ఈ 30 శతాబ్దములనుండి యీ భూతశాస్త్రముపట్ల చూపబడిన ఆదరణమున కిదియే మూలకారణము. ఈ షాంగ్ కాలమునాటి దైవజ్ఞులకు బాబిలోనియనులకు నక్షత్రశాస్త్రమునం దుండినంత ప్రవీణత లేకుండినను వారికార్యములు సంతృప్తికరములుగా నుండుటచే యితర రికార్డులను భద్రపరచుపనికూడ వారికి అప్పగింపబడెను. క్రీ॥ పూ॥ 200 సంవత్సరములకాలమువరకు చైనీయప్రాచీనచరిత్రపత్రములలో గ్రహణనిర్ణయసిద్ధాంతములు, గ్రహశాస్త్రదృక్‌సిద్ధాంతములు చేరియుండుట యీ పదవీసమ్మేళనమువలననే,

షాంగ్ కాలములో యుద్ధము లెక్కువగానుండెను. పన్నులను వసూలు చేసి రాచనగరుఅక్కరలకు, భోగవిలాసములకు వలయు ధనమును సమకూర్చుటకు రాచకీయతంత్రము అవసరముగా నుండెను. ఇతరతెగలకుకూడ అట్టివి అవసరమే ! సామాన్యసైనికుడు (సేవకుడు) నిలువబడి యుద్ధము చేయుచుండెను. రెండుగుర్రములచే లాగబడు రథముమీదనుండి సామంతులు యుద్ధముచేయుచుండిరి. ఒకఉరగతికిచెందిన సైనికులకు వారి దేహరక్షణార్థము, కంచుకుళాయిలు, చర్మము కర్ర లేక యెముకలతో చేయబడిన కవచములను, డాలులను వాడుచుండిరి.

శిలాయుగమున, కంచుయుగమున పల్లెటూరుప్రజల జీవితములలో చెప్పతగినంత మార్పేమియు కనపడదు. పారలకు, గొడ్డళ్ళకు రాతివాయిలే వాడుచుండిరి. కొందరు ప్రజలు పశువులనుపెంచుచుండిరి. తదితరులు మోటురకపు మట్టిపాత్రలను తయారుచేయుచుండిరి. చలికాలములో అందరు భూగర్భాంతరగృహములలో నివసించుచుండిరి.

రాజధానినగరములోను, తక్కినపట్టణములలోను జీవనవిధానము సంకీర్ణము (మిశ్రితము)గా నుండెను. నగరవాసులు కొందరు వస్తుసామగ్రిని అమ్మకము, పంపకము చేయుచుండిరి. మరికొందరు నార పట్టువస్త్రములు, దారము, చెక్కెములనుతయారుచేయుచుండిరి. బుట్టలనునేయువారు, ఎముక, కొయ్యవస్తువులపై శిల్పములను చెక్కువారు, నగిషీచేయబడిన తెల్లనికుండలను తయారుచేయు కుమ్మరులు, కంచుపోతపోయువాండ్రు, దేవాలయములను సమాధులను కట్టు పనివాండ్రు ఆకాలములో పనిచేయుచుం

డిరి. ఆకాలములో తయారుచేయబడి యిప్పటివరకు నిలచియున్న ఆ చేతి పనులనుచూచి ఆశ్చర్యపడనివాడుండడు. ఈచేతిపనులే వారి అద్వితీయ నైపుణ్యమును వెల్లడిచేయుచున్నవి.

క్రీ॥ పూ॥ 11వ శతాబ్దములో షాంగ్ వంశపాలన మంతమందెను. చైనాపశ్చిమప్రదేశములలో అభివృద్ధిగాంచి వర్ధిల్లుచుండిన "చౌ" వంశో ద్ధతియే యీవంశపతనమునకు కారణము. "చౌ" వంశీయులు వారిరాజధాని నగరముపై దండెత్తి దానిని విధ్వంసము గావించిరి. బ్రతికియుండినవారు ప్రాణరక్షణకై పారిపోయిరి షాంగ్ప్రభువులయోటమి చైనీయుల నాగరకత వ్యాప్తమగుటకు దోహదమయ్యెను. తూర్పుఆశియా నాగరకతచరిత్రలో యీ కాలము చాల ముఖ్యమైనది. మంచూరియాదేశములోని "పు- యు" ప్రజలు షాంగ్ పంచాంగమునమసరించియే వారికార్యకలాపములను జరుపుకొనుచుం డిరి. ప్రాణములు దక్కించుకొని పారిపోయిన షాంగ్పక్షప్రజలు కొందరు "చూ-యు" లోని "యాంగిట్జి" రాష్ట్రమునకు పారిపోయియుండవచ్చును.

"చౌ" (క్రీ. పూ. (1027-256)

"చౌ" వంశీయులపాలన ప్రారంభము

షాంగ్వంశీయుల యుత్పత్తివిషయ మెంత సందిగ్ధముగానుండెనో, "చౌ" వంశీయులయుత్పత్తి వ్యాప్తులును అంత సందిగ్ధముగా యుండెను. హిందూదేశమును జయించిన ఆర్యులలోను "చౌ" వంశీయులప్రజలలోను అనేకసామాన్యలక్షణములుండెనని కొందరు పాశ్చాత్యవిద్వాంసుల నమ్మకము. వీరి జన్మస్థానము దూరపశ్చిమప్రదేశమనుటకు చైనాయితిహాసములలో తగు నాధారమేమియు గనిపించలేదు అందువలన "చౌ" వంశీయులు, "షాంగ్" వంశీయులంతగను చైనీయులేయని నిర్ణయింపవలసియున్నది. వారికి పశ్చిమ మున, ఉత్తరదిశను నివసించు దేశద్రిమ్మర్లు, ఎడారినడిమిసారవంతప్రదేశ ముల (Oases) లో నుండువారి నాగరకతకంటె తక్కువ నాగరకతగలిగి యుండిరి. వారు వ్యవసాయకులుగాగాక పశువులమేపర్లుగానేయుండిరి. వారు తూర్పు చైనాదేశములోనికి వచ్చునపుడు వారినైజ యుద్ధవిధ్వంసక చర్య లతోపాటు, మతసాంఘికభావములు, ఆచారములుకూడ తీసుకొనివచ్చిరి. వీరి ఆచారవ్యవహారములకును షాంగ్ఆచారవ్యవహారములకును చాలవ్యత్యాస

ముండెను. వారిని యీ దండయాత్రలకు ప్రోత్సహించిన కారణము లేవి? అధికారతృష్ణ ధనమునుకొల్లగొట్టుటను నాశ మాత్రమే కారణములై యుండ వచ్చును. పశ్చిమఆసియాలో కొన్నిదశాబ్దములకుపూర్వము ప్రారంభమైన జాతివైషమ్యయుద్యమము, మధ్యఆసియాలోని సారవంతములైన ప్రదేశము లలో వ్యాప్తిజెందిి, తమ దౌర్జన్యధాటికి ఆగజాలని దూరదేశములను ఆక్ర మించుటకు "చౌ" వంశీయులకు గలిగించిన ప్రోత్సాహముకూడ కారణమై యుండవచ్చును.

షాంగ్ దేశమును స్వాధీనపరచుకొనుటకు సుమారు 20 సంవత్సరముల కాలము పట్టెను. ఆ పని ముగియగానే, బ్రదికియుండిన "షాంగ్" ప్రభుత్వో ద్యోగులు, హొనాన్‌లోని ఆధునిక "క్వే-తె" సమీపమునగల చిన్న ప్రదేశ ములో నివసించుటకు అనుమతింపబడిరి. నేటి "సి యాన్"కు చేరువనున్న "షెన్సిలో" చౌ రాజులు పట్టముకట్టుకొనిరి తమబంధువులకు, యుద్ధములో సహాయపడినవారికి మాన్యములిచ్చి వాటికి పాలనాధికారులుగా నియమించిరి. అత్యంత ఉన్నతదశలో "చౌ" రాజ్యము ఉత్తరమున దక్షిణమంచూరియా నుండి, దక్షిణమున "యుయాంగ్ట్జి"లోయ ప్రదేశములవరకును పడమట తూర్పు "కాన్సు"నుండి తూర్పుసముద్రతీరమువరకును వ్యాప్తిచెంది యుండెను

మొదటి రెండున్నరశతాబ్దములలో విశేషకాలము "చౌ" రాజులు రాజ్యమును తమ ఆధిపత్యములో నుంచుకొనగలిగియుండిరి. కాని తొమ్మిదవ శతాబ్దము అనగా దాదాపు క్రీ. పూ. 800 సంవత్సరములనాటికి, వీరి అధికా రము క్షీణించుట ప్రారంభమాయెను. తమసామంతులే ప్రత్యక్షముగా ఎదురు తిరుగుచుండిరి. క్రీ. పూ. 1771 సం. లో "షేన్" రాజ్యాధిపతి చైనేతర దుండగులసహాయమును పొందగలిగెను. *ఈ యోధులు రాజునుచంపి రాజ ధానిపై దాడిజేసి, రాజ్యాధికారులనుతరిమివేసిరి. వారందరు పశ్చిమ"హొనాన్" లోని "లో" నదిలోయలోకి పారిపోయి ప్రాణరక్షణచేసుకొనిరి.

అయిదుశతాబ్దముల పర్యంతము "చైనా" అనేక స్వతంత్రరాష్ట్రి

---

* సిథియనులు యీ శతాబ్దిలోనే దక్షిణ రష్యాదేశముపై దాడిజేసిరి. దీనికికారణము యీ యోధులను పశ్చిమదిశనుండి తరుమబడుటయే.

ములుగా విడిపోయి, వేర్వేరునాగరకతలకు లోనై యుండి, యుగములనుండి వచ్చుచున్న "సహజీవన" సమస్యను పరిష్కరింప యత్నించెను.

మాధ్యమిక కాంతిను "చౌ" రాజ్యములు

ఉత్తరప్రదేశములో కొలదిరాజుల అధికారము అభివృద్ధిగాంచుట, యాంగ్ట్జినదీలోయలోని జనసంఖ్య యెక్కువగుట; ఆగ్నేయదిశను "ఊ" "యూహి" అను పేరులుగల రెండురాష్ట్రములు స్థాపింపబడుట, ఈ మాధ్యమిక "చౌ" రాజ్యమునకు ప్రాముఖ్యముగలిగించెను. యాంగ్ట్జి నదీలోయ దిగువభాగమంతటను విస్తృతమగుచున్న "చౌ" రాజులఅధికారము ఉత్తర పశ్చిమభూభాగములో "చౌ" రాజ్యవ్యాప్తి గతించిన "హా" ప్రభుత్వమునకు వన్నెతెచ్చెను చైనాపై సంపూర్ణ అధిపత్యమునువహించుటకు జరిగిన బ్రహ్మాండమగుయుద్ధములో సమర్థసైన్యనిర్మాణము, తర్ఫీదు, నూతనవ్యూహములు, తంత్రములు, ఆయుధములుగలరాజ్యమే విజయముగాంచెను. (క్రీ. పూ. 223)

ఈ కాలమే చైనీయులకావ్యయుగముగా పరిగణింపబడెను. సుప్రసిద్ధమైనగద్య, పద్యకావ్యములు రచియింపబడెను. ప్రజలందరకువిదితమగునట్లు శాసనములు వ్రాయబడెను. విపణివీథులసంఖ్య అధికమాయెను. మితవ్యయ విధానము సూచింపబడెను. శిల్పాభివృద్ధి, ఎరువులు, నీటిపారుదలవసతులేర్పడెను. నాగలి మొదలగు వ్యవసాయపుపనిముట్లు ఉత్పత్తిచేయబడెను. కంచుపనిముట్లకు, ఆయుధములకు బదులు యినుపపనిముట్లు వాడబడెను. శాస్త్రవిజ్ఞానము, భావచింతన త్వరితగతి వ్యాప్తిజెందెను. అనాడు ఒక నిర్ణీత విధానము, శిష్టాచారనియతమైనమతము నిర్దుష్టమైన రాజనీతి లేకుండెను.

క్రీ॥ పూ॥ ఎనిమిది, యేడవశతాబ్దములలోనున్న సాంఘికస్థితిగతులను ఆనాటికార్యములు మనకు స్పష్టముగా తెలియజేయుచుండెను. శకున (ప్రశ్న) శాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, రాజ్యాధిపతులయొక్కయు, రాష్ట్రాధికారులయొక్కయు చరిత్రలు, రాజ్యాంగసభలో అవలంబింపబడుచుండిన సంప్రదాయములను వివరించు గ్రంథము లనేకములు అంతకుపూర్వమే వ్రాయబడియుండెను. రెండువేల సంవత్సరములపర్యంతము రాజనీతిజ్ఞులకు,

దైవజ్ఞులకు, విద్యార్థులకు యీగ్రంథములు పాఠ్యపుస్తకములుగా నుపయోగ పడుచుండెను. ఉద్యోగములకై ప్రయత్నించు రాజసేవకులు, ఉపాధ్యాయులు యీ గ్రంథములలోని విశేషభాగములు చూడకుండా పఠింపగలిగియుండిరి.

బాలురను ప్రజాసేవకులుగా తయారుచేయుటకు కొందరు ఉపాధ్యాయులు ప్రజాకేంద్రములలో కాపురముండిరి. మరికొందరు యువరాజులకు, సామంతులకు సలహాదారులుగానుండు పదవులకై అన్వేషించుచు రాజ్య సభలవెంట తిరుగాడుచుండిరి. కొందరు కీర్తిమంతులై చాలమంది అనుచరులను గలిగియుండిరి. డాంబికులపితలాటము, మోసములను యేవగించుకొనియో లేక యీ మహా సంరంభములో తమమాట వినువారు లేకపోవుటచేతనో, కొందరు విద్వాంసులు తమ స్వగ్రామములకుపోయి, విశ్వసనీయులగు శిష్యులకు విద్యగఱపుచుండిరి. సోక్రటీసు, జీసస్‌వంటివారల బోధనవాక్యములు వ్రాయబడిన కొన్నిగ్రంథములు ఆనాటి సారస్వతములో పడిరాళ్ళుగా(ప్రాముఖ్యములు)నుండెను. కన్ఫ్యూషియన్, మోటీ, యాంగ్‌చౌల యొక్కయు; అహంభావులు, విరక్తులు, విధివాదులయొక్కయు. "చుఆంగ్‌ట్జి"వంటి మతవాదియొక్కయు. లావ్‌ట్జువంటి అరాజకవాదియొక్కయు అధికారశిక్షాస్మృతులనునిర్ణయించిన షాంగ్‌దేశప్రభువుయొక్కయు సూక్తులు కూడ ఆ గ్రంథములలో లిఖింపబడియుండెను. ఊహాగణితము, నిర్దుష్టశాస్త్రములపై కొన్నివ్యతిరేకభావములు తప్ప "చౌ"పాలన మధ్యతుదికాలములలోని చైనీయులు తమసమకాలికులగు గ్రీకులు కనిపెట్టిరనిచెప్పబడు నూతనాంశములు వీరే కనిపెట్టియుండవచ్చును.

రాజకీయతంత్రమునందే వీరికి ఎక్కువశ్రద్ధ మానవునిశౌర్యబలము, సాంఘికములగుకట్టుబాట్లను సుసాధ్యముచేయుటకు ఆచారవ్యవహారముల ఆవశ్యకత, ప్రతివస్తువును సవ్యముగా పేర్కొనుటలోగల విలువ, భార్యాభర్తలు, తండ్రికుమారులు, అన్నదమ్ములు, పాలకపాలితులు, స్నేహితుల మధ్యనుండదగు పరస్పర సంబంధబాంధవ్యములు ఈ విషయములనుగురించి కన్ఫ్యూషియన్ మతసిద్ధాంతములు స్పష్టముగా తెలియజేసెను. ఈ విషయములే దేశవ్యాప్తినందినచో సక్రమమగురాజకీయపాలనకు దోహదకారులు కాగలవు.

అన్ని అంశములను ప్రజల ప్రయోజనములదృష్ట్యా పరిశీలించుటయే "మో" సిద్ధాంతము. అందుచేతనే వారు యుద్ధనిరోధకులుగా నుండిరి వారు నిష్కాపట్యము (సరళత) మితవ్యయములను సమర్థించుచుండిరి. దేశపాలనాధికారబాధ్యతలను అత్యంతసమర్థులగువారి హస్తగతముచేయుట శ్రేయోదాయకమని వారిఅభిప్రాయము. అట్టిపాలకులు ప్రజలవాంఛానుసారముగ ప్రభుత్వమునునడపవలెనని వారి అభిలాష. ఈకాలపు ప్రభుత్వవిధానమును పోలియుండెడి నాటిపద్ధతి అనేకశతాబ్దములు ప్రాబల్యమువహించియుండెను. కాని క్రీ. పె. మొదటిశతాబ్దములో రూపు మాసిపోయెను. ప్రకృతియే సర్వమును సాధించుననియు, అందుచేత యెవరును యెట్టిప్రయత్నములు చేయ నవసరములేదనియు, ప్రకృతి నిర్వహింపనివాటికే ప్రభుత్వనిర్వహణ మవసరమనియు "లా-చు అంగ్" వాదము.

షాంగ్ ప్రభువువాదమున కనుకూలురగు న్యాయశాస్త్రజ్ఞులు "లావ్-ట్జు" సిద్ధాంతమునకు వ్యతిరేకులు. శాసనబద్ధమైనపాలన యుండవలెననియు, నిశ్చలమనస్కుడగు ప్రభువుఆజ్ఞలకు రాజ్యము లోబడియుండవలెననియు వీరు వాదించుచుండిరి.

గ్రంథములను రచియించుట, వాటిని శతాబ్దములపర్యంతము భద్రపరచుట ఆనాటిప్రజలలోని బుద్ధికుశలతను జాటుచున్నది. క్రమక్రమముగా వర్ధిల్లుచున్న రాజ్యపాలనావ్యవస్థలోపలను, వెలుపలనుగూడ చాల మందిసభ్యులు యీ సిద్ధాంతములవలన ఉత్తేజము, మనశ్శాంతి గలిగి, నిర్ణీతములగు నైతికసిద్ధాంతముల ననుసరించి తమజీవితములను సరిదిద్దుకొనుచుండిరి. శత్రువులదాడులను అరికట్టుటకు వందలకొలదిమైళ్ళనిడివి గల గోడలను కట్టవలసివచ్చెను. వాటిని తరచుగా మరమ్మతుజేయుచుండిరి. గొప్ప ప్రజాసమూహములకు నదీలోయలను వాసయోగ్యములుగా జేయుటకు బురదనేలలను ఎండింపజేయుట, వరదలను అదుపులోనుంచుట, కాలువలను త్రవ్వించుట, రోడ్లనునిర్మించుట, నీటినినిలువజేయుటకు చెరువులు, జలాశయములను కట్టుట మొదలగు ప్రజోపయోగకరములగు కార్యములను నిర్వహించవలసియుండెను. పరిసరప్రాంతప్రజలకు నష్టదాయకముగా కట్టబడిన నిర్మాణములు యుద్ధములకు దారితీయుచుండెను.

విశాల భూభాగముల నుపయోగించుటకు సహకారోద్యమపద్ధతిని కృషి సాగుచుండెను. వాటినిర్వహణకై విశ్వసనీయులు, సమర్థులుగల వుద్యోగవర్గ మవసరమైయుండెను. రాష్ట్రములమధ్య సవ్యమైన సంబంధములు పెంపొందించుటకు విశేషశ్రమతో వ్రాయబడినపత్రములు తయారుజేయబడెను. సభ్య సంఘములచే అంగీకరింపబడిన నిబంధనలను అమలుపరచుటకు ఒకసంఘము ఏర్పాటుచేయబడెను. పన్నులవిధింపు జనాభాలెక్కలసేకరణ; కలవులనివారణ. మొదలగు క్లిష్టసమస్యలను అత్యద్భుత దూరదృష్టితో వారినాయకులు పరిష్కరించినవిధము గమనించిన చైనీయులు యెంత త్వరితగతిని అభివృద్ధిగాంచుచుండిరో వెల్లడియగుచున్నది.

"చౌ" వంశీయులపాలన తుదిశతాబ్దములలో చైనీయులు ఆసియా లోని యితర దేశీయులతో సన్నిహితత్వము గలిగియుండిరనుటలో యెట్టి సంశయమును లేదు. చైనీయులు యెన్నడును విడిపడియుండలేదు. ప్రయాణముజేయుట కష్టతరముగానుండినను పర్వతములలోనుంచి, యెడారులలో నుంచి వర్తకసమూహములు చాల అపాయములకు లోబడిపోవలసియుండినను కొన్నిసరుకులును భావములును ఇతరదేశములకురవాణాయగుచుండెను.

ఇట్లు దిగుమతియైన విదేశ వైజ్ఞానికవస్తువులలో యెద్దులచేలాగబడు నాగలి — ఇది సమీప తూర్పుదేశములలో రూపొందిన బహుశః ఆరవశతాబ్ది నాటికే చైనాలో వాడుకలోనికివచ్చియుండెను. చైనాలో సింహములు లేక పోయినను నాలుగవశతాబ్దములో "సింహము" అను సంస్కృతపదము చైనాభాషలోనికి తీసుకొనబడినది. మృతకళేబరములను గడ్డితోకప్పి పూడ్చుటకుబదులు, ఈజిప్టు, చైనాదేశాచారముల ననుసరించి పెట్టెలోపెట్టి పూడ్చుచుండిరి. మధ్యధరాసముద్రప్రాంతములలో తయారైన పురాతనపు గాజు పూసలు క్రీ॥ పూ॥ 400 సంవత్సరములనాటి సమాధులలో లభించెను.* చైనాలో జగత్సృష్టి, భౌగోళికశాస్త్రములను గురించిన హైందవభావములు నాలుగవశతాబ్దమునాటి చైనాగ్రంథములలో వ్రాయబడియుండెను. ప్రాచీన చైనాదేశీయులచే బృహస్పతియొక్క 12 సంవత్సరముల భ్రమణమునకు

* హోనాన్‌రాష్ట్రములోలభించిన గాజుపూసలలో భారహారిదము (Barium) కొంత యుండెను. కాని గ్రీసుదేశపు పూసలలో అది లేదు.

పెట్టబడిన "సియూవ్ః డి- యి" పదము సంస్కృతభాషలోని "స్వాతి" అను పదమునకు సంబంధించియుండవచ్చును. సైనికపరిభాషను ఆయుధములను చైనీయులే కల్పించియుండినను అందలి కొన్నిపదము లితరదేశములలో కూడ వాడుకలోనుండెను. కళలలో విదేశీయ సిద్ధాంతములు కన్పట్టుచుండెను. చైనా గ్రీసుదేశపు సారస్వతగ్రంథములలో ఒకేరీతిగా గనిపించు రెండుకట్టు కథలు ఉన్నవి. మధ్యఆసియాలోను, ఆదేశములకు వెలుపలను ప్రథమమున మచ్చికచేయబడిన కంచరగాడిదలు, గాడిదలు, ఒంటెలు మూడవశతాబ్ద ములో చైనాలో ప్రప్రథమముగ నుపయోగింపబడెను.

విదేశీవిజ్ఞానమును తాము గ్రహించుటతో.తృప్తిచెందక, యీకాలము లోని చైనీయులు తమ విజ్ఞాన సాహిత్యములను చాలా వృద్ధిచేసుకొనిరి. అద్భుత మేధావుల నెందరినో తయారుచేయగలిగినంతగా వారివిజ్ఞానము వృద్ధిగాంచెను.

షాంగ్ భాష వ్రాయుటకును, మాట్లాడుటకును చాలాకష్టముగా నుం డెను. కన్ఫ్యూషియన్ "సెయింటు పాల్" వలె అమరిన "మెన్సియస్" సహేతుకవాదములు; "చాంగ్ట్జు" యొక్క అలంకారయుతములగు గాథలు "చావ్ యిఅన్" చే వ్రాయబడిన ఆవేశపూరితగేయములు వారిభాషకుగలిగిన విషమస్థితిని తొలగించెను. వీరందరు నాలుగవశతాబ్దిదుదికాలములోని రచ యితలు. నాణ్యమైన కుంచెలు (బ్రషులు); మంచిసిరా; పట్టుబట్టల పట్టీలు; మొదలగు వ్రాతపరికరములు అభివృద్ధిచేయబడెను. చైనీయుల సహజప్రతి భనుబుజువుపరచుసూచనలనేకములుండెను. దక్షిణచైనాలో ప్రప్రథమముగా లక్క కనుగొనపడెను. కంచుతోచేయబడినఅద్దములు; బంగారునగిషీసామా నులు; కంచుపాత్రలపై బంగారు వెండి అలంకరణములు, పింగాణీ ఆభరణ ములు, అల్పసంఖ్యాకులగు ఐశ్వర్యవంతులయొక్కభాగ్యము, వారి నవీన అభిలాషలను నిరూపింపజేయుచున్నవి. ఎక్కువపనిముట్లు యినుముతోనే చేయబడుచుండెను. విల్లు అత్యంత ముఖ్యమైన యుద్ధపరికరముగానుండెను. ఉత్తరోత్తరా పార్థియనులను, హూనులను ఓడించుటకు ఇదే ముఖ్యఆయు ధము వైజ్ఞానికశాస్త్రములలో అభివృద్ధి విస్పష్టమగుచుండెను. క్రీ. పూ. 444 లో.సంవత్సరమునకు 365¼ దినములు గణింపబడెను.

రెండవ అధ్యాయము

# తొలిసామ్రాజ్యములు

## చు-ఆన్ (క్రీ. పూ. 221—207)

చు- ఆన్ సంపూర్ణవిజయమునకుముందు ఒక శతాబ్దిపర్యంతము పైనానాయకులు కొందరు సామ్రాజ్యమునుగాని, అది వీలుగానిచో ప్రభుత్వమునుగాని స్థాపింపవలెనని అపరిమిత ఆశాపరులై యుండిరి. బలహీనులగు రాజులను "చౌ" వంశాధిపతితోసహా లోబరుచుకొనిరి. తమ మోటుతనమును అనాగరికతను యితరరాజ్యములు నిరసించుటచే, చైనీయులు తమ విమర్శకుల సంస్కృతిని అలవరచుకొని, తమసైనికబలమును వృద్ధిచేసుకొనుచుండిరి

వాయవ్యసీమలో అత్యంత బలవంతుడుగా నుండిన "చు - ఆన్" "జు చు ఆన్"పై దాడిజేసి, ఆహారపదార్థములకు ఉత్పత్తిస్థానము గొప్ప మైదానప్రదేశమును స్వాధీనపరచుకొనెను. ఆహారపదార్థముల సరఫరాను అవిధముగా స్థిరపరచుకొని, తమసైన్యావసరములకు ప్రస్తుతము "కెయి ఫెంగ్" అని పిలువబడుచున్న పట్టణసమీపమున ఆహారధాన్యపుగిడ్డంగులను కట్టిరి. యుద్ధమాన్యములను విచ్ఛిన్నముచేయు తలంపుతో క్రీ. పూ. 238 వ సం. నుంచి మాన్యముల నిచ్చుపద్ధతిని రద్దుజేసిరి. తిరుగుబాటులు లేవకుండా జేయుటకు కార్మికులను సిద్ధపరచుటకు క్రీ. పూ. 239-235 సం.రములలో పెద్దయెత్తున జనాభామార్పులను చేయించిరి. క్రీ. పూ. 234 సం.లో "చెంగు" యుద్ధమునకు సైన్యములను సిద్ధపరచుకొని, 222 సం.లో తుది ప్రత్యర్థిరాష్ట్రమును ఓడించెను. వెంటనే ఆయన ప్రథమసామ్రాజ్యమును స్థాపించి, "షి-హుయాంగ్-టి" అను బిరుదుతో ప్రథమచక్రవర్తి ఆయెను. ఆయన పరిపాలనావిధానము యిరుపదవశతాబ్దిపర్యంతము కొనసాగెను. 221 వ సం.లో దేశమునంతటిని 36 సైనికవిభాగములుగ విభజించెను.

కొలదికాలములోనే యీవిభాగములసంఖ్య 41 కి పెరిగెను. ప్రతిభాగమునకు ఒక సేనాధిపతి, పాలకుడు, తనిఖీదారులు నియమింపబడిరి. ప్రజలు నిరాయుధులుగా చేయబడిరి. పన్నులు చెల్లించుషరతుతో ప్రజలకు తమ ఆస్తిపై హక్కులొసంగబడెను. పుట్టుకవలనగాక, తాము యిచ్చు కానుకలు ప్రభుత్వమునకు తాముచేయు అమూల్యసేవలవలననే సామంతులు నిర్ణయింపబడుచుండిరి. ఒకేవిధమగు ఆచారములు, శాసనములు, తూనికలు, కొలతలు నిర్ణయింపబడెను.

క్రీ.పూ. 220 సం॥లో "షి-హుయాంగ్-టి" 50 అంగలవెడల్పుగల రస్తాలను విరివిగా వేయించెను. ఆ రస్తాలకు రెండుప్రక్కలను చెట్లు నాటించెను. ఉత్తరమున అచటచట నిర్మింపబడిన ప్రహరీగోడలను కలిపి ఒక పెద్ద అడ్డుగోడగా నిర్మించిరి. దానినే (Great Wall) గొప్పగోడ అని పిలుచుచుండిరి. దీనివలన చైనా అనాగరికదేశముగాదని వెల్లడియాయెను. కట్టుదిట్టముచేయబడిన నలుబదినాలుగు శిబిరములు నదివెంబడి కట్టబడెను. వాటిలో యుద్ధవైదీల నుంచుచుండిరి. నీటికాలువలు లోతుచేయబడెను. పెద్ద అడ్డుగోడనుండి యీనాటి "హోనాన్"రాష్ట్రములోని దక్షిణసరిహద్దువరకు విస్తరించియున్న తనరాజ్యముతో తృప్తిజెందక దక్షిణదిశ దూరప్రదేశములను లోబరచుకొనుటకు తనసైన్యములను పంపెను. క్రీ. పూ 221-214 సం॥ల మధ్య చేయబడిన మహాదండయాత్రలఫలితముగా వారు ఫుకియన్ "కాంగ్టంగ్" కాంగ్సి, టాంగ్కింగ్ ప్రదేశములను జయించిరి.

"షి-హ్యూయాంగ్-టి" వేర్వేరు శైలులుగల గ్రంథములను ఒకటిగా జేసెను. ప్రాచీన సారస్వతగ్రంథములలో విశేషభాగము, మరియొక జీవనవిధానమును ప్రతిపాదించుచుండుటచే వాటిని తగలబెట్టించెను. ప్రభుత్వసంబంధమగు పాతరికార్డు, వైద్య, జ్యోతిష, వ్యవసాయశాస్త్రములను, ప్రాచీన సారస్వతగ్రంథములను, తన వంశచరిత్రను మాత్రము భద్రపరిచెను. పలు తెగలను ప్రజల నొకటిగాజేసెను. వందలకొలదియున్న భిన్నభిన్నభావనా పద్ధతులను సమన్వయపరచెను. ఒకసందర్భములో 460 మంది శాస్త్రవేత్తలను, వారిలో ముఖ్యముగా మాంత్రికులను డాంబికులనూ చంపించెను. ఆయన విసుగూ విరామము లేకుండా పనిచేసెడివాడు. తనను హత్యజేయు

దురను భయముతో తనలో దైవత్వమును ఆరోపింపజేయు తలంపుతో ఆయన మారువేషధారియై తిరుగుచు స్థితిగతులను శ్రద్ధతో పరిశీలించు చుండెను.

"షి-హ్యాయాంగ్-టి" చర్యలన్నియును తనతరమునాటి నాయకుల మెదడులోనుండియే ఉత్పన్నముకాలేదు. చైనా కరపత్రవిలేఖకులు వాటిలో కొన్నింటిని ఒకటిన్నరశతాబ్దము పూర్వమునుండి ప్రచారముజేయుచుండిరి. వాటిలోకొన్ని పాశ్చాత్యదేశములనుండి వచ్చియుండెననుటకూడ అసంభవము కాదు. ఏదెట్లుండినను, వాటి ఉత్పత్తిస్థాన మేదియైననూ చైనాలోని అట్టి నిర్ణయములు అఖండశక్తి, ప్రాభవముగలిగిన ప్రథమచక్రవర్తివంటి ప్రతి భావంతునికై నిరీక్షించుచుండినవి. ఆయనసామ్రాజ్యము చిరకాలము నిలువ జాలక ఆయనకుమారునిపరిపాలన ప్రారంభమైనతరువాత మూడవసంవత్సర ములో కూలిపోయెను. ఆయనసామ్రాజ్యస్థాపన ప్రపంచచరిత్రలో అత్యంత ముఖ్యమైనవిషయమే, ప్రహరీగోడఅవరణలోనుండిన ప్రజలంద రైకమత్య ముతో యుండవలెననెడి భావము నీ ప్రథమసామ్రాజ్యము నిరూపించెను. దీనికి అనంతరము సామ్రాజ్యవిచ్ఛిన్నకాలమునకూడ యీ భావము మరుప బడలేదు. శాంతిభద్రతలు, నీటిపారుదలకార్యములు, ముఖ్యములగు ఉత్పత్తి వస్తువులపై ప్రభుత్వసర్వాధికారములు, నాణెములు, వ్యాపారస్తులబారిపడ కుండా సామాన్య ప్రజానీకపుహక్కులను సమర్థించుట మొదలగు కార్య ములకు బాధ్యతవహించు కేంద్రప్రభుత్వము స్థాపింపబడెను. జపాను దీవులతో యీనాటినుండియే సంబంధములు ప్రారంభమయ్యెను. 'అమర' దీవుల అన్వేషణకు షాంటంగ్‌నుంచి యొక సంఘము పంపబడెను. *

ఇంత నిరంకుశముగానుండియు యీ సామ్రాజ్యము, ప్రభుత్వమును నిరసించు హేతువాదులను, రాజవంశీయులను, రాజ్యాభిమానములేని

---

* ఈ దీవుల అన్వేషణకై క్రీ. పూ. నాలుగవశతాబ్దములోనే పరిశో ధనయాత్రలు పంపబడెను. దాదాపు అదేకాలములో "ఇన్సులేఫార్చు-నాటె" ప్రాంతమును అన్వేషించుటకు కార్తగినియనుల ప్రయత్నములు పాశ్చాత్య నాగరికత పరిశోధకులగు ర్తుకు రాగలదు.

డబ్ల్యు. పి. ఎట్సు: న్యూచైనా రివ్యూ. 290-297 (1920-జూన్)

మంత్రులనుమాత్రము పూర్తిగా అణచలేకపోయెను. వీటితోపాటు, నిర్బంధ సేవ, సరిహద్దు సంరక్షణసైన్యములు, దుర్భరములగు పన్నులచే అసంఖ్యాక జనసమూహము వర్ణనాతీతమైనబాధలకు గురియైయుండవచ్చును.

రాజధానినగరమునకు చాలా దూరప్రాంతమునకు దాడివెడలి అచట 210 వ సంవత్సరములో షి-హ్వాయాంగ్-టి మరణించెను. ఆయనమృతకళే బరమును మూయబడినబండిలో "షియన్-యాంగ్"కు తీసుకొనిపోయిరి. మరణవార్త తెలిసినచో తిరుగుబాట్లు గలుగునను భయమే దీనికి కారణము. ఆయనబలవత్తరపాలన తొలగి, అనర్హుడగు ఆయనపుత్రుడు రాజ్యమునకు వచ్చుటవలన అసంతృప్తులగు మూకలు యీసామ్రాజ్యమును కూలద్రోసిరి. అనేకసంవత్సరముల పర్యంతము అరాజకము ప్రబలెను.

## హాన్ వంశీయులు

### (పశ్చిమ) ప్రాచీన హాన్ వంశము

### B C 202 to 9 A D

నూతన సామ్రాట్టు లియు-చి (పాంగ్) అనేక గురుతరసమస్యలను యెదుర్కొనవలసివచ్చెను. ఈయనకే "హాన్-కావ్-ట్సు"అను నామాంతర ముండెను. "చు-అన్" సైనికాధికారి అజ్ఞానుసారముగా నూతన దక్షిణదేశ ప్రజలు "లియు"ను త్యజించిపోయిరి. పెద్దగోడకు ఉత్తరముననున్న ప్రజలు యీ సావకాశమునుతీసికొని ఆయనపై దాడిజేసిరి. కొలదిమంది అధికారులు భట్రాజులు మాత్రము చక్రవర్తిపట్ల తమభక్తిని వెల్లడిజేసిరి.

"లియు" సామాన్యుడయినను షి-హ్వాయాంగ్-టి ప్రారంభించిన కార్యములను కొనసాగింపగల సూక్ష్మబుద్ధి గలిగియుండెను. తన ఆప్తబంధువులకు, ప్రేమాస్పదులకు మాన్యములను యిచ్చు జాగీర్దార్ పద్ధతిని తిరుగ ప్రారంభించి, ఆయనచేసిన ప్రముఖకార్యమును త్రోసిపుచ్చెను. అర్థశతాబ్దము గడచునప్పటికి (154) యీ జాగీర్దారులు అధిక బలవంతులైరి. వారిలో యేడుగురు తిరుబాటుజేసిరి. కొలదిమాసములలోనే యీ తిరుగుబాటు నిర్దాక్షిణ్యముగా అణచివేయబడినను, సామ్రాజ్యమునకు అపాయము గోచరించుచునే యుండెను. క్రమముగా అట్లు తిరుగుబాటుజేసిన రాజద్రో

హాలజాగీరులలోనుంచి కొంతభాగమును స్వాధీనపరచుకొనుచుండెను. 127 వ సం॥లో సామంతునిజ్యేష్ఠపుత్రుడు, తనసోదరులకు తండ్రిజాగీరులో సగభాగమును పంచిపెట్టవలెనను సంస్కరణను అమలులోనికి దెచ్చెను. సైనికపరిపాలనావశ్యకత లేనప్పుడు, తన సూక్ష్మబుద్ధి నుపయోగించి కష్టతరమైన ప్రభుత్వనిర్వహణలో సహాయపడుటకు సమర్థులగువారిని ఆహ్వానించెను. కాలయాపనవలనను, ఆచారముల మార్పులవలనను కొంత సమన్వయమైన కన్ఫ్యూషియస్ సిద్ధాంతములు పరిపాలనా విధానములో ప్రాబల్యము గాంచియుండెను.

చైనాయుత్తరసీమనుండి వచ్చు సైనికదండయాత్రలు తీవ్రమైన సమస్యగా పరిణమించెను. పెద్దగోడ ఒకమూలనుండి మరియొకమూలవరకు చైనేతరదాడులను "లియు" ఎదుర్కొనవలసివచ్చెను. "కాన్సు" ప్రాంతములో"యుహే-చి"లు, మంగోలియానుండి"సియాంగ్-ను"లు,మంచురియా నుండి "టంగ్-హూ"లు మొదలగువారిట్టిదాడులు చేయుచుండిరి. చక్రవర్తి పూర్వులు వీరలను బహిష్కరించి పరాభవించుటయే దీనికి కారణము. సియాంగ్-నూప్రజలు హాన్ చైనాకు తీవ్రమగు అపాయమును గలిగించుచుండిరి. వారిలో ప్రథమనాయకుడు అసమర్థుడు. కాని రెండవవాడు చరిత్రలో నుదహరింపబడినట్లు క్రూరుడు, కఠినుడు, శ్రేష్ఠమైనరౌతు. ఈయన "యల్లో"నది మైదానముపైపు తనమూకలను తీసుకొనిపోయెను. కట్టుదిట్టములుచేయబడిన యొకపట్టణములో "ల్యూ"ను నిర్బంధించి, తనతో సంధి చేసుకొనునట్లుచేసెను. ఈ సేనానాయకుడు "సి-యాంగ్-నూ"కు చైనా రాకుమార్తెను వివాహముజేసి పట్టుదుకూలములు, పానీయములు, ధాన్యము, ఆహారపదార్థములను విరివిగా కానుకలిచ్చెను.

రెండవశతాబ్దాంతములోపల "సియాంగ్-నూ"తో సంబంధబాంధవ్యములను స్థిరపరచుప్రయత్నములు జరుగలేదు. సామ్రాజ్యమును బలపరచుకొనినపిదప "లియు"స్థాన మాక్రమించిన "వూ-టి" (140-87) క్రీ. పూ. 200 సంవత్సరములలో పశ్చిమదేశముపైపు పారిపోయిన 'యూ-హి-చిన్' శత్రువులతో సఖ్యముచేసుకొనుటకు యత్నించెను.

క్రీ. పూ. 128 వ సం,లో "ఊ-టి" వారితో సఖ్యముచేయదలచి

నప్పటికిని, "పామీర్సు" వెలుపలనుండి "యూ-చిన్‌లు" సాగ్దియాను, బాక్ట్రియాలను జయించి, మధ్య ఆసియారాజ్యవిషయాలలో యెట్టిశ్రద్ధను జూపకుండిరి. "ఊ-టే" పంపిన రాయబారి, అవిషయములో భంగపడినను రాయబారి తెలియచేసిన మధ్య, పశ్చిమ ఆసియాప్రాంతములలోని స్థితిగతులు చక్రవర్తికి ధైర్యసాహసములను గలుగచేసెను. ఆయన వెంటనే చైనా చరిత్రలో, గొప్ప మేధావంతులును యువకులునగు అశ్వికదళాధిపతులను, "సి-అంగు-నూ" (121-119) పైకి పంపెను. ఒకసేనాని సరిహద్దు ప్రదేశముపై దాడివెడలి 19,000 మంది శత్రువులను చంపి, 10 లక్షల గొఱ్ఱెలను స్వాధీనపరచుకొనెను అశ్వదళాధిపతి సి-యంగ్-నూ రాజ్యము లోనికి జొచ్చుకొనిపోయి, 80 మందికిపైగా నాయకులను నిర్బంధించెను. ఈ దండయాత్రవలన చైనావారి అధికారము సుస్థిరమై వారికి అఖండ గౌరవ మును కలిగించెను. యెవరికిచెందని సరిహద్దుప్రాంతప్రదేశములో నివసించు సంకరజాతి ఉద్యోగులు కొందరు తమ అవసరమునకుతగినట్లు, ఒకప్పుడు చైనాదేశపు పక్షమును, మరియొకప్పుడు "సి-యంగ్-నూ" పక్షమును చేరుచుండుటచే, వారలను అణచుటకు, యిట్టియుద్ధములు చేయవలసియుం డెను. కొంతకాలముపిదప (115) "ఊ-టే" పశ్చిమఆసియాకు, మొదటి మారు యెందరో రాయబారులను పంపెను. తరువాత సైన్యములు పోయి ఫర్‌ఘానాను తదితరదేశములను 101 సం॥ లో లోబరచుకొనెను.

తనసామ్రాజ్యమును విస్తరింపచేయుకోరికతో ఉత్తర దక్షిణదిశ లకు "ఊ-టే" సైన్యములను పంపెను. ఆయన ఉత్తర యీశాన్యములనుండి కొరియాదేశములో భూమార్గమునను, సముద్రమార్గమునను ప్రవేశించి, అచట తన ప్రభుత్వమును స్థాపించెను. ఈ దేశభాగము నాలుగురాష్ట్ర ములుగ విభజింపబడెను. వాటిలో ప్రధానమైన "లో-లాంగు" 63,000 కుటుంబములు, సుమారు 3,15,000 జనాభా కలిగిన చైనాదేశీయులవలన ఆక్రమింపబడియుండెను.* ఇచట విజ్ఞానస్థానము

* క్రీస్తువెనుక 2 వ సంవత్సరమునాటి జనాభాలెక్కలనుండి యీ సంఖ్య ఉదహరింపబడెను. ఆ జనాభాలెక్కలప్రకారము అప్పటి చైనాదేశ ములో 1,22,33,062 కుటుంబములునూ, 5,95,94,978 ప్రజలును

యేర్పడి, కొరియానుదాటి, అంతవరకు మరుగుపడియున్న జపాన్ ద్వీపములకు వ్యాప్తిగాంచెను. 111 సం॥లో "ఊ-తే" యొక్క యుద్ధసైన్యములు దక్షిణరాజ్యము, "నాన్‌యూహా"ను ఆక్రమించుకొని, దాని కేంద్ర ప్రదేశమగు "క్వాన్‌డన్"ను ఆక్రమించెను. ఈ జయముతో తృప్తిపొందక వారియొద్దనుండి కప్పము వసూలుచేయుటకు ఓడమీద తనప్రతినిధులను పంపెను.

ఈ దండయాత్రలవల్ల యెక్కువ ధనము వ్యయముకాగా ఆర్థికసందిగ్ధస్థితి యేర్పడెను. క్రీ. పూ. 150 సం.రంనాటి పన్నులు సగము చేయబడెను. భూమిపన్ను అధికముచేసినచో జనాభాలో అధికసంఖ్యాకులగు వ్యవసాయదారులకు కష్టనష్టములు కలుగునుగాన, ఆదాయమును అభివృద్ధి చేయుటకు వేరుమార్గములు అన్వేషింపవలసివచ్చెను.

129 వ సం.రంలో మొదట బండ్లమీదను, తరువాత ఓడలమీదను పన్నులు విధించిరి. దీనివలన వర్తకులకు, ధనవంతులకు కష్టము కలిగెను. సైనిక బిరుదులను విక్రయింపమొదలుపెట్టిరి. ఉప్పు, యినుపసామానుల అమ్మకముపై సర్వాధికారము 4 సంవత్సరములు ఖచ్చితముగా ప్రభుత్వమే అమలు జరిపెను. ఆ సంవత్సరములోనే (119) నాణెములవిలువ తగ్గించబడి అదికూడ కేంద్రప్రభుత్వ సర్వాధికారములలో చేర్చబడెను. 115 వ సం. రములో యీ యుత్తరువులను ధిక్కరించినవారికి మరణదండనశిక్ష విధింపబడెను. ప్రభుత్వమువద్దనుండి యెక్కువధరకు కొనిన, లేడిచర్మముమీద తమ కనుగ్రహింపబడిన రాజ్యాధికారపట్టాలను గొప్పసామంతులు, చక్రవర్తికి సమర్పింప నియోగింపబడిరి. పితృదేవతల ఆలయములయొద్ద ప్రతి సంవత్సరము వసంతఋతువులో చేయబడు బలిదానమునకు గొప్పహోదా కలిగినవారలందరు కట్నములను యిచ్చు ఆచారముండెను. 112 వ సం. రములో అట్లు యివ్వబడిన కట్నములు, వారిహోదాకు తగినట్లుగా నుండునట్లు ఖజానాధికారులు నిర్ణయించుచుండిరి. చిత్రకారులు, వర్తకులు తమ స్వంత ఆస్తివివరములు ప్రభుత్వమునకు దాఖలుచేయవలెను. అట్లు దాఖలు

---

యుండిరి. (హాన్-షు 28 B/19b) ఈ లెక్కలలో చేర్చబడకుండినవారు కొందరుండుటచే పైన నుదహరింపబడిన సంఖ్యలు వృద్ధిచేయబడవలెను.

చేయబడిన ఆ స్తిలో నూటికి 4.76 చిత్రకారులయొద్దనుంచి, 9.50 వర్తకుల యొద్దనుంచి ప్రభుత్వము వసూలుచేయుచుండెను.

క్రీ. పూ. 110 వ సం.రములో ఉప్పు, యినుము అమ్మకునే అధికారము ప్రభుత్వము సంక్రమింపచేసుకొనెను. 98 వ సం.ములో మత్తు పానీయములుకూడా ప్రభుత్వాధికారములోనికి చేర్చబడెను. ఈ కార్యములు. "హాన్" ప్రభుత్వ ఆర్థికసమస్యలను తాత్కాలికముగా, పరిష్కరించెను. నూతన సమస్యలకు దారితీసెను. ప్రజల అంపోళన అధికమగుటచే యీ వృత్తుర్వులన్ని క్రమక్రమముగా ఉపసంహరింపబడెను.

"సిన్" వంశము: (క్రీ. శ. 9-22)

క్రీ. పూ. 87 వ సంవత్సరముతో ఊ-టే పాలనము అంతము కాగానే చైనా ఆంతరంగిక రాజ్యము, సామ్రాజ్యముకూడ చరిత్రలో అత్యున్నతస్థితిలో నుండెను. దాదాపు ఆ శతాబ్దాంతమువరకు చైనా దేశ గౌరవము మిన్నగా నుండెను.* ఊ-టే అనంతరం. సమర్థులగువారు, లేక పోయిరి. ఈ వంశము బలహీనమై క్రీస్తుశకము మొదటిశతాబ్దములో గతిం చిన చక్రవర్తినికి మేనల్లుడును 1 నుండి 8 వ సంవత్సరమువరకు రాజప్రతి నిధిగా నుండిన అత్యంత సమర్థుడునగు మంత్రికి లొంగిపోయెను.

సిన్‌వంశప్రథమచక్రవర్తి "వ్యాంగు-మ్యాంగు" క్రీ. శ. 9 సం.రము మొదలు 23 వ సం.రము వరకు పరిపాలనచేసెను. ఆయన విదేశాంగ పాలనావిధానము చెప్పుకొనతగినంతగొప్పదికాదు. అసలువిషయ మేమనగా దేశములో యిటీవల కలిగిన గొప్పమార్పుల తరువాత, నిజానికి, వలస రాజ్యాలు చైనారాజ్యమునుండి విడివడి పోయెను.

స్వదేశములోని రాజ్యాంగపుమార్పుల విషయమే ప్రాముఖ్యము వహించినది. వ్యాంగు అనేక సంస్కరణములను ప్రవేశపెట్టెను. భూమిని

---

* మంగోల్, మంచూశకములు చైనేతరములుగా భావింపబడినచో క్రీ. శ. ప్రథమ, ఎనిమిదవశతాబ్దములలో తక్కిన రెండూ అత్యున్నత స్థాయిలు సంభవించియుండవచ్చును.

యావత్తు ప్రభుత్వాధీనములోనికి తీసుకొని, పెద్దపెద్ద జమీనులను పంపిణీ చేయుట ఆయనచేసిన మొదటిమార్పు. మగబానిసలకు స్వేచ్ఛనిచ్చి వారిని నౌకరులుగా చేసెను.*

ఈ రెండు సంస్కరణములు అమలుజరుగుట అసాధ్యమని తెలుసుకొని, మూడుసంవత్సరములపిదప వాటిని రద్దుచేసెను. 17 వ సం.రములో బానిస యజమానులపై బానిసకి 3600 చొప్పున పన్నువిధించెను. ఉప్పు, యినుము, మద్యము, నాణెములపై ఊ-తే నిర్ణయించిన సర్వాధికారమును తాను తిరిగి అమలులోకితెచ్చెను. వ్యాంగు నాణెములను చౌక చేయుటయే గాక, మరికొన్ని క్రొత్తనాణెములను ప్రవేశపెట్టెను. కంచుకుబదులు బంగారము వుపయోగించవలెనని వత్తిడిచేయుటచేత సామ్రాజ్యములోను, వెలుపలను వాడుకలోనున్న బంగారమునంతను ఒకచోటకు చేర్చుటలో సఫలత్వమునందెను. అటవీసంపద, వేట, చేపలనుపట్టువృత్తులను ప్రభుత్వము తన సర్వాధికారములోనికి తీసుకొనెను. అదనపు సామగ్రిని కొని వాటిని గిడ్డంగులలో నిలువచేసి ధరలను నిర్ణయముచేసెను. వృత్తిపనులను చేయువారికి వచ్చు రాబడిలో పదకొండింట నొకభాగమును పన్నుగా విధించెను. ప్రభుత్వపురాబడి తగ్గిన సంవత్సరములలో తమ వేతనములను బుద్ధిపూర్వకముగా తగ్గించుకొనునట్లు చేయుట, వడ్డీలేకుండాను, లేక నూటికి మూడు పాళ్లు వడ్డీతోగాని ఋణములజేయుటకు నిర్ణయించెను. ఈ విధానములలో ప్రజలస్థితిని అభివృద్ధిచేయుటకంటె, ప్రభుత్వ రాజకీయ, ఆర్థికాభివృద్ధిని పెంపొందించుటయందే యెక్కువగా శ్రద్ధచూపబడెను. నిపుణులు, సూక్ష్మబుద్ధిగలవారగు అధికారులు వీటివలన లాభపడిరి. ధనికులు నిరాశాహతులైరి. ప్రజాబాహుళ్యము బాధలకులోనైరి. ఆయన చర్యలవలన గలిగిన వ్యతిరేక శక్తులతో వైరమాయనఅంతమునకు దారితీసెను. తిరుగుబాటు ప్రారంభముకాగానే రాజు నెవరును సమర్థింపలేదు. ఒకవర్తకు డాయనను నరికివేసెను.

---

* మగబానిసలు చైనాసంఖ్యలో నూటికి ఒకరికంటె యెక్కువగా యుండలేదు. ప్రాచీనగ్రీస్‌దేశములో నూటికి యాభైమందికిపైగాయుండిరి.

## హాన్ వంశపు చివరికాలము (క్రీ. వె. 25-220)

వ్యాంగ్-మ్యాంగ్ మరణానంతరము సింహాసనమును ఆక్రమించు కొనుటకు అనేకులు వారసులు సిద్ధముగానుండిరి. వారిమధ్య రెండుసంవత్సరములపర్యంతం పోరాటము జరిగి, గతించిన "హాన్" చక్రవర్తి దూరపు దాయాది గెలిచి, సింహాసనమును ఆక్రమించెను. ఆయన "హాన్" వంశపు రాజుగానే పాలించెను. సింహాసనమునకై జరిగిన యుద్ధములో కొల్లగొట్టబడి, తగులబెట్టబడిన "చాయాంగ్ - యన్" నగరమునుంచి రాజధానిని "చౌ" రాజుల పురాతనరాజధాని "లొయాంగ్" కు మార్చిరి.

ప్రథమశతాబ్దాంతమున ప్రపంచరాజకీయములలో చైనా తన పూర్వపుటౌన్నత్యమును పొందెను. 42-43 సం.లో సైన్యములనుపంపి "హాయినాన్" "టాంగ్‌కింగ్" "అన్నామ్" రాష్ట్రములను స్వాధీనపరచుకొనిరి. ఈ ప్రదేశమంతయు చైనాసామ్రాజ్యములో నొకరాష్ట్రముగా చేర్చబడి, 9 శతాబ్దములపర్యంతము అదేవిధముగా నుండెను. నైఋతిదిక్కుననున్న ప్రస్తుతపు "యునాన్" క్రీ. పూ. 111వ సంవత్సరములో "ఊ-టి" చే చైనారాజ్యములో చేర్చబడి, కొంతకాలమునకుపిదప దానిలోనుంచి విడిపోయిన యిప్పటి "యున్నాన్" క్రీ. వె 69సం.లో తిరిగి స్వాధీనపరచుకొనబడెను. 57వ సం. నుండిచైనాదేశము జపానుదేశముతో పరిచయముగలిగియుండెను కొరియాలోని కొంతభాగము, దక్షిణ మంచూరియా, "హాన్"వంశపరిపాలనకాలమంతయును చైనాఅధికారములో నుండెను. మధ్య పశ్చిమఆసియాదేశములో సమర్థులగు సేనానాయకులు "హెయాంగ్-నూ"కును ఉత్తరప్రదేశములోని తెగలకును స్పర్థలు కల్పించగలిగిరి. టారింప్రదేశమునకు చుట్టుపట్లనున్న చిన్నచిన్నరాజ్యములను స్వాధీనపరచుకొనిరి. నూతనముగా స్థాపింపబడిన "కుషాన్" రాజ్యమునుండికూడ క్రీ. వె. 90 మొదలు కప్పమును వసూలు చేయుచుండిరి. *ప్రథమశతాబ్దిచివర చక్రవర్తినులకుటుంబములు, కొజ్జాలు

* "యూయె-చి" సాగ్డియానా, బ్యాక్ట్రియాదేశములను జయించిన పిమ్మట నేర్పడిన ఈ రాజ్యాధిపతులు కీస్తుశకము ఒకటి రెండు శతాబ్దములలో అఫ్ఘనిస్తానమునుండి పశ్చిమోత్తరయిండియావరకు.నుండు దేశమును.పాలించు

యెక్కువ పలుకుబడిగలిగియుండుటవలన కలిగిన అంతఃపురకుట్రలు ప్రభుత్వోద్యోగులలో ఆందోళన గలుగజేసెను. ఎన్నియోసంవత్సరముల నుండి చక్రవర్తిగారిని ఆటబొమ్మగా నుపయోగించుచుండిన యీ కొజ్జాలను తొలగించుటకు యత్నించగా, అంతఃపురములో తిరుగుబాట్లు బయలుదేరి, వాటిఫలితముగా చక్రవర్తియే సింహాసనభ్రష్టుడాయెను. ఆయన అనంతరము రాజ్యమునకువచ్చిన చక్రవర్తి క్రూరుడైన పశ్చిమచైనాదేశసేనాని, ప్రముఖ నాయకుడైన "టంగ్-చా" చేతిలో కీలుబొమ్మగా నుండెను. "యాంగ్" లో తన అధికారము చెల్లదని గ్రహించి, యీ సేనాని, నగరమును ఖాళీ చేయించి, నిర్మూలనము గావించెను. దీనివలన చైనాసారస్వతమునకు అత్యంత నష్టముకలిగెను. రెండువందలసంవత్సరములపాటు యీ నగరము చైనానాగరికతకు కేంద్రస్థలముగా నుండెను. తక్కినసేనానులు దేశములోని యితరప్రాంతములలో తిరుగుబాటులను లేవదీసిరి. దానివలన అనతికాలము లోనే చైనారాజ్యము అనేక సైనికవిభాగములుగా మారిపోయెను. చక్రవర్తి అధికారము సింహాసనముచుట్టుపట్లగల ప్రదేశమునుదాటి విస్తరింపకుండెను. "ట్యాపే - ట్యాకా" అను మేధావి నాయకత్వముక్రింద అనేకులు పితూరీ దారులు చేరి, 192వ సం.రంలో "టంగ్ - చా" ను హత్యచేసిరి. "ట్యావే-ట్యాకా" సర్వాధికారియాయెను. 220 సం. లో ఆయన చనిపోయినపిదప ఆయనపుత్రుడు చక్రవర్తిని వెడలగొట్టెను. అంతటితో "హాన్" వంశకథ అంతమందెను.

## హాన్ కాలపు సంస్కృతి

"చౌ"నాటికాలము చైనాకు సారస్వతయుగముగా పరిగణింపబడగా "హాన్"వంశీయులకాలము సామ్రాజ్యయుగముగా పన్నెకెక్కెను. "చౌ" "చి-ఆన్"పాలనలో సంస్థలు ప్రారంభింపబడినను, అవి అన్నియు హాన్ కాలములోనే అత్యున్నతస్థితిని పొందెను. ఇతరదేశములనుండి గొనివచ్చిన శాస్త్రజ్ఞానసమన్వయమువలన ప్రకృతిశాస్త్రము, శిల్పము, సారస్వతము,

---

చుండిరి. కుషాన్‌రాజులు వాడుచుండిన "భగవత్పుత్రుడు" చైనాసాంప్రదాయకబిరుదము కాన్సుపరిసరప్రాంతములో వారిపూర్వీకులనివాసమును తెలియజేయుచున్నది.

సంగీతము. పరిశ్రమలు, ఆటలు, వినోదములు ఎక్కువ అభివృద్ధినిగాంచెను. యూరోపియనులకంటె చైనీయులు శాస్త్రవిజ్ఞానములో ఎంత యుచ్ఛస్థితియం దుండిరో క్రీ. శ. 8 వ సంవత్సరములో చైనాలో వాడుకలోనుండిన నీడగడియారములు. 120 విభాగములుగలిగిన నీటిగడియారములు నిరూపించు చున్నవి. క్రీ. పూ. 104 వ సం॥రమున గొప్ప జ్యోతిషశాస్త్రజుడు, ప్రభు త్వపురికార్డురక్షకుడు "సుమాషేన్"ను, మరికొందరు శాస్త్రజ్ఞులను పంచాంగ ములను సంస్కరించుమని ప్రభుత్వము ఆజ్ఞాపించెను. వాంగ్‌మాంగ్ విఖ్యాత సలహాదారు లియు-సిన్ "వాంగ్ లియు-సిన్"సంవత్సరమునకు 365/385 సూర్యదినములుండెనని నిర్ణయించెను. 1613 వ సం॥లో ప్రచురింపబడిన గ్రంథములో ప్రథమ యూరోపియన్ శాస్త్రజ్ఞుడు గెలీలియో సూర్యగ్రహ ములో మచ్చలున్నట్లు గుర్తించెను. కాని క్రీ. పూ. 28 వ సం.లోనే చైనా శాస్త్రజ్ఞులు ఆ విషయమును నిరూపించియుండిరి. క్రీ శ. మొదటిశతాబ్దములో భూభ్రమణమార్గమును పరిశీలించుటకును దానివంపును కొలుచుటకు ప్రత్యేక పరికరములను తయారుచేసిరి. అదేకాలములో చంద్రగ్రహపటముకూడ వం కరగానుండెననియు, చంద్రుడు సంపూర్ణముగా చుట్టివచ్చుటకు 9 సం॥లు పట్టు నని యిరువురు శాస్త్రజ్ఞులు చెప్పిరి. (ఒకమారు చుట్టివచ్చుటకు వాస్తవముగా 8.85 సంవత్సరములు పట్టును) 132వ సం.రములో రాజధానినగరములోని యొకశాస్త్రవేత్త రాజసభలో యెవరును గుర్తింపజాలనంతటి మందమగు భూకంపమును కనుగొను అసాధారణయంత్రమును కనుగొనెను. కాని, ఈ ప్రాచీనయంత్రములు తరువాత యెట్టి మార్పులు చేయబడలేదు.

"వాంగ్ - చు - ఆంగ్" (క్రీ. పూ. 27-100) వ్రాసిన గ్రంథము లలో ప్రకృతిశాస్త్రభావములు గోచరమగుచుండెను. మొదటిశతాబ్దితుదిని రెండవశతాబ్దప్రారంభకాలమునందును, వాస్తవమగు పరిశీలన,విమర్శచేయు ఉత్సాహము వర్ధిల్లుచున్నట్లు కనపడుచుండెను. కాని, రాజకీయ, సాంఘిక దుస్థితి వాటికి అంతరాయము గలిగించుచుండెను.

విగ్రహాదులను మలచు శిల్పవిద్య ఆకాలములో అమలునందుండెను. సమాధులచుట్టు చెక్కబడిన సహజపరిమాణముగల ప్రతిమలే అందులకు సాక్షి. అవి అసిరియన్ శిల్పమును పోలియుండెను. ఈ విగ్రహములు

సమాధిఆవరణలలోనుండెను. శిలలలో చిత్రింపబడినవాయను సందేహమును కలిగించునంత సున్నితముగా మలచబడెను. రంగుచిత్తరువులు చాల తక్కువగా నుండెను. వైజ్ఞానికకేంద్రములలో అవి యెక్కువ వ్యాప్తిగాంచియుండెను. మింగ్‌చక్రవర్తి (58-76) శిల్పవిద్యను ఆదరించెను. పెంకులమీదను లక్కతోను,సమాధులగోడలపైనను చెక్కబడిన శిల్పములలో కొన్ని యీనాటికిని నిలచియున్నవి. కొరియాలో, లోలాంగ్‌చేరువనున్న ఒక సమాధిలో 1931 సం. లో నొక గంప దొరికెను. దానిపై నిలువబడి, కూర్చునియున్న 94 మంది మనుజులచిత్తరువులు లక్కలో చెక్కబడియుండెను. ఆకాలములో లక్క విరివిగా వాడుకలో యుండవచ్చును. చైనీయులు నివసించిన ప్రాంతములన్నిటిలోను లక్కను శిల్పకారులు గనుగొనుటయే దీనికి ఆధారము. మొగమును అలంకరించుకొనుటకు వేర్వేరురూపములుగల ఆరు చిన్నచిన్న పెట్టెలు, అద్దము అమర్చబడియుండిన ఒకపెట్టె "లోలాంగ్"లో దొరికెను. దానినిబట్టి నాటి హాన్‌జాతి ఉత్తమకులజులగు యువతులు నేటిచైనాలోని నవనాగరిక *వనితలకు దీసిపోయినవారు కారని విశదమగుచున్నది. మెరుగు పెట్టబడిన మట్టిపాత్రలు తయారుచేయబడుచుండెను. హాన్ సామ్రాజ్య తుది కాలములో పింగాణీపాత్రలు చేయు ప్రథమయత్నములు ప్రారంభమాయెను.

మహాభవననిర్మాణము, గద్య, పద్య కావ్యములలో సవిస్తరముగ వర్ణింపబడెను. చలువరాళ్లతో తాపడముచేయబడిన స్తంభములు అమూల్యములగు మణులతో శృంగారింపబడినగోడలు, చూరులు, మలచి చిత్రింపబడి మలాముచేయబడిన కర్రసామానులు; తీగెల, పూవుల ఆకృతులతో తయారుచేయబడిన అల్లికలతో అలంకరింపబడిన సరంబీలు, సన్నపోగరుపని చేయబడిన చలువరాళ్ళతో కట్టబడిన మేడమెట్లు మొదలగు అనేక విషయములు ఆ కావ్యములలో వర్ణింపబడెను. ఇప్పటికి నిలిచియుండిన కొలది పునాదులు

---

* క్రీస్తుశక ప్రారంభశతాబ్దములలో మొగమునకు వాడుచుండిన పౌడిసీసపు కర్బనతమని పురాతన వస్తుశాస్త్రజ్ఞులు కనుగొనిరి. "లో-లాంగ్"లో "హారదా"యును, "లో-లాన్"లో "బెర్గమ్యాన్"ను పరిశోధనచేయుచుండిరి. లోలాంగ్ (1930) పే. 33 సినో స్వీడిష్ ఎక్స్పెడిషన్ Viii: 1,126 (1939) చూడుడు.

మినహాయించగా మట్టిమూసలు, యెత్తుపల్లములతో చెక్కబడియుండిన పీఠములు మాత్రమే పై విషయములను నిరూపించు ఆధారములు. మధ్యధరా సముద్రతీర దేశస్థులు చాలకాలమునుండీ యిటుకలు తయారుజేయుచుండిరి. సమాధులనిర్మాణమునకు యిటుకలే ప్రత్యేకముగా వాడబడుచుండుటచే, యిటుకలను తయారుచేయుపద్ధతి యీకాలములో అధికముగా వ్యాప్తిజెంది యుండెను. "ఊ-టే" యొక్క రాజోద్యానవనము ప్రపంచవిఖ్యాతమై యుండెను. పశ్చిమదేశములనుండి తెప్పించిన అనేక నూతన వృక్షములు నాటబడెను. తన ఆహారపానీయములకువలయు పండ్లవృక్షములు, ద్రాక్షతీగెలును, ఆ దేశములనుంచి తెప్పించిన అశ్వముల ఆహారమునకు దగిన పచ్చిక ఆ యుద్యానవనములో నుండెను. క్రీ. పూ. 111 సం.లో తానుచేసిన దండయాత్ర పిదప నారింజ, పోక, లిచి, మొదలగు దక్షిణదేశపు వృక్షములను కూడ నాటించెను.* అయన రాజ్యములలోని అడవులలో వేటకు అడవి మృగములు చేర్చబడెను. రెండు కృత్రిమసరస్సులు నిర్మింపబడి అందు విహారనౌకలు, సేనావిన్యాసపుటోడలు అమర్చబడియుండెను.

దూరదేశములతో సాగు వాణిజ్యము చిన్నచిన్నవృత్తులకు నూతన చైతన్యము గలిగించెను. కోటానురాష్ట్రములోని దూరపు రాతిగనులనుండి రాళ్ళను తెప్పించి, వాటిని అపూర్వ ఆకృతులుగా తయారుచేయించెను. ఆ రాతితోనే రాజ్యాంగపత్రములపై వేయబడు ప్రభుత్వముద్రలుకూడ చెక్కబడెను. ముత్యములు, స్ఫటికములు, వజ్రపుతునకలు మొదలగు అమూల్యమైన మణులను దక్షిణసముద్రము, హిందూమహాసముద్రములలోనుండి తెప్పించుకొనుచుండిరి. "షాంగ్" 'చౌ' చక్రవర్తులకాలములలో రెండుపర్యాయములు యున్నతదశగాంచిన కంచుపని ప్రాముఖ్యము సన్నగిలెను. సాదా పట్టువస్త్రములు, వింతయైన జంతువులబొమ్మలు చైనా సాంకేతిక అక్షరములు అల్లబడిన పట్టువస్త్రములు (Embroidry) తయారుచేయబడుచుండెను.

---

* ఈపద్ధతి ఉత్తరోత్తర శతాబ్దములలో నవలంబింపబడెను. చైనా పశ్చిమ ప్రాంతములో ప్రథమమున నాటబడిన వాల్నట్టువృక్షము క్రీ. వె. రెండవ శతాబ్దములో లొయాంగ్‌లోని రాజోద్యానవనములో నాటబడినట్లు కన్పట్టుచున్నది.

ఆ వస్త్రములు స్వదేశీయుల యుపయోగమునకేగాక దూరదేశములకు ఎగుమతిచేయబడుచుండెను. సాహిత్యము, సామాన్యభాష, లిపులద్వారా గలిగిన భావప్రకటనావకాశము, దీర్ఘ కాలముగా అనుభవించుచుండిన దేశశాంతి; పనిపాటలులేని విశేషజనము, ధనికులలో విద్యావ్యాప్తియు గమనింపదగియున్నవి. వైద్యశాస్త్రము; సైనికశాస్త్రము, వేదాంతశాస్త్రము, ఛందశ్శాస్త్రము, ఇంద్రజాలము, జ్యోతిశ్శాస్త్రములలో నిపుణులగువారిచే తయారుచేయబడిన 677 జాతీయగ్రంథములజాబితా ఆకాలమునుండియే ప్రారంభింపబడెను. ఈ జాబితాలు కొయ్యపలకలమీదను పట్టువస్త్రములమీదను వ్రాయబడెను.

క్రీ. వె. 23-25 సంవత్సరములమధ్య రాజధానినగరము విధ్వంసమైనను, సామ్రాజ్యగ్రంథాలయములో కొంతభాగమైనను కాపాడబడెను. రెండువేలబండ్ల పుస్తకములు "లొయాంగ్" కు తీసుకొనిపోయిరి. ఈ పుస్తకములుకూడా తరువాత కనుపడకుండాపోయినట్లు తెలియుచున్నది. అయినను అదృష్టవశాత్తు యీగ్రంథములు వ్రాయబడిన కొయ్యపలకలలోని వేలకువేలు తునకలు; తోలుపట్టాతో కట్టబడిన 75 పలకలుగల సంపూర్ణ సంపుటములు, మధ్యఆసియా ప్రాంతములో ప్రాచీన గడియారస్తంభము యొద్దనుండిన చెత్తకుప్పలో యిటీవలనే లభించెను. క్రీ. పూ. సుమారు100వ సం॥ రములో కనిపెట్టబడిన కాగితము రెండవశతాబ్దమునుండి, అంతకు పూర్వము వ్రాతపరికరములుగా వాడబడిన కొయ్యపలకలయొక్కయు, కొంతవరకు పట్టుగుడ్డయొక్కయు స్థానమును ఆక్రమించెను. ఇది నూతనముగా కనిపెట్టబడిన గొప్పవిషయమే ; కాని సారస్వతాభివృద్ధిదృష్ట్యా రావలసినంత త్వరగా రాలేదను విషయమే తీవ్రసమస్య. దీనిని కనుగొనినవెనువెంటనే అచ్చువేయు పద్ధతికూడ కనుగొనబడియుండినచో, చైనాగ్రంథములు అధిక సంఖ్యాకములుగా లభ్యమై విరివిగా సర్వజనానీకమునకు అందుబాటులో నుండెడివి. చిన్నాభిన్నమైపోవుటవలనను, కాలానుగుణమగు అనేకవిపత్తులకు లోనగుటచేతను అనేకగ్రంథములు కనపడకుండాపోయెను.

ప్రభుత్వశాసనపత్రములను భద్రపరచువారు చైనాచరిత్ర ప్రారంభమైననాటనుండి యుండిరి. కాని చరిత్రరచయితలు "హాన్" యుగమునకు పూర్వము లేరు. ప్రాచీనచరిత్రలో కేవలము వాస్తవముగా జరిగిన సంఘ

టనలే వ్రాయబడియుండెను. "షి - చి" యనుపేరిట వ్రాయబడిన చరిత్రాంశ ములు క్రీ. పూ. 100వ సం.వరకు వెలువడలేదు. ఊహాపూరితములగు విష యములనుండి "సత్యమును" వేరుచేసి యీ చరిత్రి ప్రథమముగా ప్రచు రింపబడెను. "షి-హి" చరిత్రరచయిత సుమాచియాన్ అదేపేరుగల గొప్ప జ్యోతిశ్శాస్త్రిపండితునిపుత్రుడు. ఆ కాలములో ఎక్కువ దేశపర్యటనచేసిన వారలలో నొకడు. ఆయన చరిత్రనుగురించి కడునమ్రతతో యిట్లువ్రాసెను.

"మాకు అందచేయబడిన సంఘటనలను ఒకపద్ధతిగా రూపొందిం చుటకంటె నా చరిత్రలో గొప్పవిషయమేమియును లేదు. అందుచే దీనిలో కల్పితమైనదేదియు లేదు.* ప్రామాణికనిరూపణలతో కూర్చిపెట్టుటయే నేనుచేసినపని" దీనితరువాతశతాబ్దములలో చరిత్రనువ్రాసిన రచయితలు యీయన అనుగమించినపద్ధతినే నవలంబించుటద్వారా ఆయనచరిత్రను విశేషముగ మెచ్చుకొనిరి. ఒకటిన్నర శతాబ్దమునకుపిదప చరిత్రలువ్రాసిన చరిత్రకారులుగూడ గొప్ప కీర్తిమంతులైరి. "సుమా-చి-యాన్" అనాది నుండి జరిగిన సంఘటనలను తనచరిత్రలో వ్రాయ సంకల్పించియుండగా వీరుమాత్రము చిన్ సామ్రాజ్యపతనమునాటినుండి "హాన్" కాలమువరకు జరిగిన 230 సం. కాలమునాటి విషయములనే తమ చరిత్రలో వ్రాసిరి.•

---

* ఈ చరిత్రలోని 130 లో 47 అధ్యాయములను "ఎడొ ఆర్డు చావన్నీస్" అనువదించుటయో లేక సంక్షిప్తపరచుటయో చేసియుండెను. ఉపోద్ఘాత ముతోకూడిన నీ యనువాదము Les Memoires Historianes De Semats'ien 5 vols (Paris 1895-1905) లో నున్నది. ఆధునిక వివర ణకు, సి. యస్. గార్డ్నర్ చే వ్రాయబడిన Chinese Traditional Historiography (1938) లోని 16-17 పేజీలు చూడుడు.

• డాక్టరు H. H. డబ్సు యీ మూలగ్రంథము ననువదించుచున్నారు. రెండుసంపుటములు వెలువడినవి. పాన్-కుచే వ్రాయబడిన తొలి హాన్ వంశచరిత్ర Baltimore 1938-1944) cf. also డాక్టర్ నాన్సీ-లీ-స్వాన్, పాన్-చౌ, చైనాదేశపు ప్రప్రథమ విద్వాంసురాలు (New york, 1932)

ఇదియే వారిరువుర చరిత్రలకు గల వ్యత్యాసము. ఈ రెండుచరిత్రలను శ్రద్ధగా చదివినచో, వారు వ్రాసినక్రమము, ప్రస్తావించుతీరులలోని ప్రవీణత విదితము కాగలదు. ఈ సందర్భములో "పాన్-పియా" యీ చరిత్రలను గురించి వ్రాసిన విమర్శ అమూల్యమైనది. సారస్వతమునుగురించి చేయబడినవిమర్శ శైశవస్థితిలో నున్నదనియు, క్రీ. పూ. రెండవశతాబ్దములోనుండిన స్వేచ్ఛా చింతనము క్రీ. వె. ప్రథమ అర్ధశతాబ్దమధ్యమున అంతరించి, హాన్ప్రభుత్వ సభ్యులలో తీవ్రమగు మొండివాదమునకు ప్రాబల్యమును కలిగించెనను విషయము గమనీయము.

షువో - వెన్ - చియె - ట్జు క్రీ. వె. 100 సం. లో నిఘంటువును తయారుచేయుటకు ప్రత్యేకపు యేర్పాట్లుచేయించెను. దానిలో 9353 అక్షరములకు వివరణములున్నా, 1163 అక్షరముల ద్వంద్వప్రయోగములున్నా తెలుపబడినవి. విశిష్టకవితారీతులు దివ్యవిషయములనుగురించిన కథలు, న్యాయశాస్త్రస్మృతులు వానిలో నుదహరింపబడెను. స్త్రీలకు నీతిపాఠములు, భూగోళమును గురించి తెలుపు గ్రంథములు, మతమునుగురించి ప్రథమ వ్యాఖ్యానముకూడ దానిలో చేరియుండెను.

భాగ్యవంతులకు పేదలకు యేనాటినుంచియో ఆనందమునుగలిగించు చున్న సంగీతమునకు రెండుమూడు నూతనవాయిద్యములు చేర్చబడినవి. వానిలో చైనీయులచే "పియి-పా" అని పిలువబడు వీణ ఒకటి. బాక్ట్రియా దేశముతో చైనాకు గలిగిన సంబంధముద్వారా దాని కా రూపము గలిగి యుండును. ప్రథమ ద్వితీయశతాబ్దములలో కట్టబడిన "గాంధరాన్" స్మృతి చిహ్నములననుసరించి దానియొక్క స్కంధము గుండ్రముగానుండి నాలుగు తీగెలుగలపలక గలిగియుండెను. వాద్యగాడు దానిని తన రొమ్మునకానించు కొని దానితీగెలను మ్రోయించుచుండును. చైనావా రుపయోగించిన మొదటి వీణాస్వరూపమే యిది. మరియొక తంత్రీవాయిద్యము "కుంగ్ - హో" లేక "కాన్ - హౌ" అని పిలువబడుచుండెను. ఆ వాద్యమునుగురించి క్రీ. వె. 126 సం.లో చనిపోయిన యొకచరిత్రకారుడు అదిమొదలు మృదుమధుర మైన నాదమును ధ్వనించుచుండెననియు, తరువాత అశుభసూచకమైన సంగీతము పాడుచోట్ల దీనిని యుపయోగించుచుండిరనియు ఆయన చెప్పెను.

వెదురుదండితో 14 తీగెలుగలసంగీతవాయిద్యము మూడవది. ఈ వాయిద్యములు దక్షిణప్రాంతములకు చెందియుండవచ్చును.

పరిశ్రమలు

సుదీర్ఘమైన హాన్‌వంశ పాలనకాలములో పరిశ్రమలు విరివిగా విస్తరించియుండవచ్చును. *వ్యవసాయమునకు సంబంధించిన అభ్యుదయమును ఒకపండితుడు తెలియజేసెను. మెట్టధాన్యములు; పునాసపైరులు; త్వరగాపండుపంటలు; ఆలస్యముగాపండుపంటలు. పంటలను మార్చిమార్చి వేయుట ఈకాలమున నూతనముగ ప్రవేశపెట్టబడెనని ఆయన వ్రాసెను. ఒరకపునేలలలో వెదురు, ఫలములు, కూరకాయలు, కలప, వంటచెరుకు మొదలగువాటిని పెంచుట, బంజరుభూములను తాత్కాలికముగనైన పండించుటకు దొరువులుత్రవ్వుట మొదలగునవికూడా అప్పుడే ప్రవేశపెట్టబడెను. వ్యవసాయము, పరిశ్రమలు, యుద్ధములలో బండ్లులాగుజంతువులకురొమ్ము త్రాడులనువేయుట ఈకాలముననే కనుగొనబడినవి. పాశ్చాత్యదేశములలో పదిశతాబ్దములమీదటనే పశువులకు యీ వస్తువులు వాడబడెను.

హాన్ వంశపాలనలో వినోదములను గురించిన ప్రధానవిషయములు సారస్వతగ్రంథములనుంచియు, మట్టిపాత్రలు, యిటుకలు, శిలలపై చెక్కబడిన గుర్తులనుంచియు గ్రహింపబడినవి. డేగవేట, గుర్రపుసవారిమీద చేయు వేర్వేరు నృత్యములు ఉత్తరదేశములోనుండు దేశదిమ్మరిగుంపులలోనే ప్రారంభమైయుండవచ్చును. సర్కసులలో గడచివర అడ్డముగ నొకకర్రను గట్టి చేయు ఆటలు చైనాదేశములో ప్రారంభమైనవే. రథములో హాస్యనటన కూడ వారివినోదమే. క్రీ. పూ. 300 సం. కాలమునాడే బంతులతో గారడీ చేయబడుచుండినట్లు వ్రాయబడినది. మరకాళ్ళనుగురించిన సంగతులు తత్త్వ

*మాబెల్ - పింగ్ - హువా - లీ చే వ్రాయబడిన చైనాదేశ ఆర్థికచరిత్ర : 149—151 పేజీలు చూడుడు.

•క్రీ. పూ. రెండవశతాబ్దమువరకు స్పష్టముగా నుదహరింపబడకపోయినను, ప్రఖ్యాతిగాంచిన చిక్కుడుగింజలు చాలకాలమునుండియే వాడుకలోనుండెను.

వేత్త వ్యాంగ్ - చౌంగ్ వ్రాసెను. యుద్ధములకు సిపాయీలను సంసిద్ధుల చేయుటకు ఆడబడు కాలిబంతి ఆటలనుగురించి క్రీస్తు పూర్వమునాటి అనేక గ్రంథములలో నుదహరింపబడెను. దానినే రెండవశతాబ్దపు రాతిపలకలమీద చిత్తరువులరూపమున జెక్కిరి. నృత్యమును స్త్రీలు పురుషులుకూడ అభ్యసించుచుండిరి ఎడ్లపందెములు, కోడిపందెములు, తాడులాగుపందెములు దక్షిణదేశపు వినోదములై యుండవచ్చును. విలువిద్య, పరుగుపందెములు కుక్కపందెములు,/ చేపలుపట్టుట, వేట మొదలగునవన్నియు ప్రాచీనకాల క్రీడలేయైనను యిప్పటికిని చాలమంది వాటి ననుసరించుచునేయున్నారు. చైనీయులలో పనిపాటలులేని భాగ్యవంతులు "వెయి-చీ" ఆటఆడుచుండిరి. చదరపు పలకపై సొగటాలతోను, యెముకముక్కలతోను ఆడునది యొకటి. ఈ కాలములోనే బొమ్మలాట, తోలుబొమ్మల ప్రదర్శనములు ప్రారంభమై యుండవచ్చును.

# మూడవ అధ్యాయము

## రాజకీయానైక్యము

### మూడు రాజ్యములు-పడమటిసీన్ (A D 220-317)

సుమారు 300 సం.లకాలము చైనాప్రజలు కొంత శాంతియుతస్థిర జీవితము గడపిరి. రెండవశతాబ్దముతుదిని నానాటికి ప్రబలుచుండిన యసంతృప్తి తీవ్రరూపముదాల్చి హాన్‌రాజవంశము నధికారమునుండి తొలగించెను.

హాన్‌వంశపతనానంతరము అర్ధశతాబ్దికాలము, మూడు రాజవంశములు సింహాసనముకై పోరాడసాగెను. లోయాంగ్ రాజధానిగాగల "వే" వంశమువారు (220-265) దక్షిణమున; ఆగ్నేయమునమున్న ఊచియాంగ్ నుండి నాన్‌కింగుకు రాజధాని మార్చుకున్న "ఊ" వంశమువారు(220-280), పడమర-నైఋతిప్రాంతములచాంగ్-టూ రాజధానిగాగల షూ. లేక షూహాన్ వంశమువారు (221-264) ప్రతిరాజపుత్రుడు, వీరుడును సామ్రాజ్యమును స్వాధీనపరచుకొనుటకు శక్తికొలది ప్రయత్నములుజేసెను. వారిలో 'వే' వంశమురాజులు నెగ్గిరి. 264లో వారి యుద్యోగులలోనొకడు 'షు'లను అణచెను. 265లో ఆ ఉద్యోగి తనయజమానినే తొలగించి, అధికారము నాక్రమించెను. మరియు నతడు 280 లో, 'ఊ'లను జయించెను. ఆవిధముగ నాతడు క్రొత్తగ స్థాపించుకొనిన సామ్రాజ్యము 420 వరకు అస్థిరమైన స్థితిలో నుండెను.

చైనీయులు దక్షిణము-పడమరలు వ్యాపించుటవలననూ, వారిసైనిక విజృంభణమువలనను, అత్యంత ప్రాముఖ్యములగు మార్పులు యేర్పడినవి. నాణెములమారకము లేనందున వస్తురూపమున యిచ్చిపుచ్చుకొను పద్ధతి యమలులోనికి వచ్చెను. శాంతియుతపరిస్థితులనుండి యరాచకమునకును, భద్రాయుతజీవితము అత్యంతఅపాయకరమైనస్థితికిని మారినకాల మిది.

అట్టి పరిస్థితులలో నూతనభావములు, నూతనసంస్థలు నూతనాచారములు, నూతనసామగ్రి దేశమున ప్రవేశించుటకు మిక్కిలియనుకూలించెను.

వీటన్నిటికన్న బౌద్ధమతమునకు మంచి ప్రబలమగు అవకాశము కల్గెను. తూర్పు ఆసియాలో నేటికిని సుస్థిరముగ నిలచియున్న విదేశమతము. ఎపుడు ఎచట ప్రారంభమైనదో ఎవ్వరును చెప్పజాలరు. క్రీ. వె. 65 నాటికి వారిలోకొంద రన్యదేశీయులేమో చెప్పవీలులేదు. కాని, మొత్తముమీద బౌద్ధ సన్యాసులు, ప్రచారకులనెడి యొకతెగ యాంగ్‌టిస్‌ప్రాంతములందు, నేడు ఉత్తరకియాంగ్ యని పిలువబడు ప్రదేశమున నుండెడిది. వారు చక్రవర్తి సోదరునిరక్షణలో నుండిరి. ఈ చక్రవర్తిచే జారీచేయబడిన అజ్ఞాపత్రములో బుద్ధ, శ్రవణ, ఉపాసఖ యనుపదములు వారిభాషలో వ్రాయబడియుండెను.

క్రీ. వె. 148-170 యీమధ్యకాలమున పార్థియనురాజు, (అతనిని చైనీయులు యాన్‌షి, కో యని పిలిచెడివారు) బుద్ధిపూర్వకముగా తనసింహాసనమును త్యజించి, మతములో చేరెను. అతని మతప్రచారము రాజధాని సముద్రతీరప్రాంతములవరకు వ్యాపించెను. అతనియధికారకాలముననే బౌద్ధమతకేంద్రము లోయాంగ్‌లో ప్రబలముగా వృద్ధిగాంచెను. తాను బోధించుటమాత్రమేగాక పండితుల ననేకుల సమావేశపరచి, బౌద్ధమతసూత్రముల కొన్నింటిని చైనాభాషలోనికి అనువదించెను. వారి పాండిత్యమంత యుత్తమమయినది కాకపోయినదగుటచే, ప్రాచీనానువాదముల మరలమరల రెండుమూడుపర్యాయములు తర్జుమాచేయవలసివచ్చెను. షికియో ప్రచారముల ప్రభావము పండితులలోనేగాక రాజ్యాంగమునందుకూడ చెలామణి యయిననూ, చక్రవర్తినిమాత్రము పూర్తిగ తమమతములోనికి మార్చ జాలకపోయెను.

రాజధానియందు బౌద్ధమతము విశేష వ్యాప్తిజెందుటయేగాక, తదితర ప్రదేశములందుగూడ వ్యాపింపసాగెను. షుమారు 170 లో, నేటి షాంటుంగు రాజధాని సమీపమున నొక సమాధిపై నొకస్థూపము నిర్మింపబడెను. మరికొన్ని సంవత్సరములతర్వాత చాలయంతస్తులుగల యొకస్థూపము ఉత్తర కెయాంగ్‌సునందు నూతన హ్సు-చౌ ప్రాంతమునందు దేవాలయములో కట్టబడెను. ఆ దేవాలయములో బంగారపుపూతచేయబడిన బుద్ధవిగ్రహముండెను. మనకు తెలిసినంతవరకు మొదటి చైనాబౌద్ధసన్యాసి అన్‌హూయి రాష్ట్రములోనివాడు. అతడు పార్థియానుండి వచ్చిన బౌద్ధసన్యాసితోగలసి

పనిజేసెను. దక్షిణచైనాలోకూడ అకాలపు బుద్ధమత ముండిన నిదర్శనములు కలవు.

మూడవశతాబ్దములో చైనాలోని ఉత్తర, దక్షిణప్రాంతములలో బౌద్ధ మతప్రచారము అధికమయ్యెను. ప్రజలు బౌద్ధమతమునం దెక్కువ శ్రద్ధా భక్తులు కలిగియుండిరి. భారతదేశము, సోగ్డియానా, కోటాను, సిలోనుదేశ ములు, వాటిప్రాంతదేశములలోని భక్తులు, జ్ఞానులు తమ మతప్రచార ములు సాగించుటకు చైనీయులు తగియున్నారని గ్రహించిరి. మరియు దేశ ములోని యంతఃకలహములవలనను, అధికారుల అవినీతిప్రవర్తనమువల నను విసుగుజెందిన చైనీయులు నిరాశాపూరితులయినసమయములో, తమకు శాంతినిగలిగించు, తమయవసరములన్నింటిని దీర్చు యీ మతమును స్వీక కరించుటకు సిద్ధముగానుండిరి. యీ బౌద్ధమతము చైనావారిమతసిద్ధాంత ముల దృఢపరచుటయేగాక, కొంతవరకు వానిలోనిలోపములను పూరించెను. మానవుని మంచిచెడ్డలప్రతిఫలము ఆత్మవినాశ మను పురాతనసిద్ధాంత భావము తొలగించి. జీవునకు కర్మానుసారము పునర్జన్మ కలదనుసిద్ధాంతము ప్రచారముచేయుటయే ముఖ్య ఆదర్శముగ నుండెను. సాభిప్రాయచిహ్నము లగు మట్టి రాతితోనిర్మితములయిన విగ్రహముల పూజించుటను ప్రవేశ పెట్టెను. వానిలో కొన్ని మిక్కిలి యందమయినవి. స్వర్గమనిగాని, నరకమని గాని లేని చైనాప్రజలకు ఒక్కటిగాదు, పెక్కు స్వర్గనరకములను ప్రసా దించెను. మరియు బౌద్ధమతము. మరణానంతరము జన్మరాహిత్యమునకు దేవత్వమునకు మార్గము సూచించెను. వేయేల, యింతకుపూర్వమే తన మతమును వ్యాప్తిజేసిన హిందూదేశము, పరిసరప్రాంతము ఎట్టి ఫలితము లిచ్చెనో వాటినన్నిటిని చైనా కొసగెను.

బౌద్ధమతప్రచారకులు, గొప్పవంశీయులును, జ్ఞానులును యయి బౌద్ధమతము స్వీకరించిన పెక్కురాజ్యములనుండి వచ్చిరి. 250 లో నొక హిందూభిక్షువు మతశాసనమునందలి 250 సూత్రములను చైనాభాష లోనికి మొట్టమొదట అనువదించెను. ఇది చాల ముఖ్యమయినవిషయము. ఏలయన, మతస్వీకరణాభిలాష గలిగిన చైనామహాసభలనుండి యిది కోర బడినది. ఆక్ససునదీప్రాంతమునుండి యొకప్రచారకుడు వచ్చెను. అతడు

అన్షికోయొక్క అమితాయుస్సూత్రమును సరిచూచెను. టాంగ్కింగులలో స్థిరపడిపోయిన సొగ్డియన్వంశీయుడొకడు వచ్చి "ఉ" దేశపురాజును బౌద్ధ మతమును స్వీకరింపజేసి, స్థూపనిర్మాణముచేయుటకు ప్రోత్సహించెను. యీ వంశీయులు దక్షిణసముద్రములందును, ఇండియాయిందును వ్యాపార దృష్టికలవారై యుండిరి. మధ్యఆసియాలోని కుచారాజు 259 సం. లో లోయాంగులో బౌద్ధమతమును ప్రచారముజేసెను. హీనయాన, మహాయాన విభాగములు బాగుగ ప్రచారముజేయబడెను. వానితో హిందూ, ఇరానీయుల పూజావిధానములు ప్రచారముచేయబడెను. బౌద్ధమతప్రచారకులు చైనీయుల బలవంతపరచు పద్ధతుల నవలంబించక, వారిహృదయములను, మనసులను ఆకర్షించుటచేత యింత దిగ్విజయములను సాధింపగలిగిరి.

భారతీయులపలుకుబడి యితరశాఖలలోకూడవ్యాపించెను. చైనావైద్య శాస్త్రము చాల అభివృద్ధిచేయబడెను. మూడవశతాబ్దమునుండి *హైందవ గణిత, జ్యోతిషభావములు చైనాసారస్వతములో కనబడుచుండెను. శిల్ప శాస్త్రములోకూడ హైందవప్రాభవము స్పష్టముగ నుండెను. చైనాభూభాగ మున, చుక్కలవలెనుండుస్థూపములు,బుద్ధగయలోని మహాబోధిదేవాలయము వలెనో, పెషావరుసమీపముననున్న కనిష్కుని స్తూపములవలెనో నిర్మింప బడెను. శతాబ్దాంతమున నారవశతాబ్దమందలి యొకానొక గ్రంథకర్త వ్రాసి నట్లు లోయాంగ్లోనే షుమారు 42 స్తూపములుండెనని తెలియుచున్నది.

బౌద్ధమతసూత్రముల ననువాదముజేసినఫలితముగ, చైనాసాహిత్య ములో నూతనవిధములగు గ్రంథములు వెలువడెను. చైనీయుల జానపద గాథలకు బౌద్ధ జాతకకథలు చేర్చబడుటచే, నూతనత్వమేర్పడెను. నాంకింగు నగరమున, పెంగ్హ్వాయను సోగ్డియనువంశీయ పరిచారకుడు క్రీ. శ. 250 సం. ప్రాంతములోయిట్టికథల సంపుటములరెంటిని చైనాభాషలోనికి అనువ

---

*263సంవత్సరములో "లీ - హాయి' చే నొకగ్రంథము వ్రాయబడెను. దానిలో ప్రయోగాత్మక త్రికోణక్షేత్రగణితమునకు సంబంధించిన తొమ్మిది సూత్రము లుండెను. అది హిందువులదై యుండవచ్చును.

"వాన్హీ; టి_అంగ్ పావ్" x·x : 52. (1920_1921)చూడుడు.

దించెను. దానివలన నూతనభాషయగు సంస్కృతము చైనాభాషతో సత్వర బాంధవ్యము నేర్పరచుకొనెను. నవీనభావములు, నూతనపదములు ప్రవేశ పెట్టుటయేగాక, యీభాషను వ్రాయుటకు నూతనపద్ధతులు వెదుకవలసి వచ్చెను. హైందవమంత్రములు చైనాసంగీతములో కలసిపోయెను. అంతకు పూర్వము కాకున్నను మూడవశతాబ్దము తుదిభాగములో శాస్త్రోక్తముగ ధూపములువేయుపద్ధతి దక్షిణప్రాంతమునుండి వచ్చియుండవచ్చును. హ్వానులకాలమున శ్రమణులు (బిక్షువులు) తమతలలను గొరిగించుకొని, కాషాయవస్త్రముల ధరించుచుండిరి. కానీ, 220 తర్వాత వేర్వేరు రంగువస్త్రములగూడ వాడుచుండిరి. హిందూమతాభిప్రాయములు చైనాయందు వ్యాపించుటకు, బుద్ధమతము తన భక్తాగ్రేసరులను విరివిగ పుణ్యక్షేత్రయాత్రలుజేయ ప్రోత్సహించుటయే కారణమైయుండును.

చైనాకు తిరిగివచ్చినయాత్రికులు చెప్పిన కథలవలన, భూగోళశాస్త్రమునకు కొన్ని క్రొత్తవిషయములు సమకూడెను.

బౌద్ధమతము స్వీకరింపబడినకాలముననే దేశయభావములు, ఆచరణములు క్రమముగా వృద్ధిపొందుచుండెను. దానినే కొందరు పురాణేతిహాసముల చెప్పబడిన చక్రవర్తి హువాంగ్ - టి కాలమనియు, మరికొందరు లావోటు, చౌఆంగ్ — టుల కాలమనియు వాడుచుండిరి. అయితే, అదియే టాయిజమ్ అని ప్రఖ్యాతిగాంచెను. యీ నూతన సంస్కారము ఊ చక్రవర్తికాలమునుండి, రాజ్యాపహర్త వాంగ్‌మంగ్‌కాలమువరకు, గొప్పగొప్ప కుటుంబములలో ఆదరణాభిమానముల సంపాదించినందున, హాన్ వంశీయుల వాఙ్మయమునందు, దీనిపలుకుబడి, ప్రజాదరణముగూర్చి కొన్నివిషయములు వ్రాయబడియున్నవి.

జెక్ ఆన్ పరిపాలనలో క్రీ. పె. 2 వ శతాబ్దములోనుండిన చాంగ్ కుటుంబీయులలోనొకరు "టాయిజమ్" అను మతమును స్థాపించినట్లు యితిహాసములు తెల్పుచున్నవి. ప్రఖ్యాతిగాంచిన ఇరానియను మతమగు "మజదాయిజమ్"నుండి యీ పాశ్చాత్యపరిజ్ఞానము కొంత బలవత్తరమగు అంశముల గ్రహించియుండునని, డబ్సు యను చరిత్రకారుడు సూచించుచున్నాడు. యేది ఎట్లయినను 5 వ శతాబ్దిలో కొచీ-యన్‌చి (d 442) నాయ

కత్వము క్రింద పశ్చిమదేశమతము, తన ప్రత్యేకాభిమానమును పూర్తిగా కోలుపోయెను. క్రీ. పె. షుమారు 190 లో యీ వంశీయుడు 'చాంగ్ టు' షేన్సి రాష్ట్రములో చిన్న స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఐహికాముష్మిక విషయముల్పై ఆధిపత్యముగలిగిన ఆచార్యులుగల మతములు వెలసెను. చాంగ్-టు తనకుతానే 'స్వర్గాధిపతి'యను బిరుదమువహించెను.*217 లో త్యావో-త్యావో దేశమంతయు కొల్లగొట్టినపుడు యీ స్వర్గాధిపతిని బంధించి, రాజధానికి పంపెను. మతము నిలచియుండెను. చాంగువంశస్థులమని చెప్పుకొనువారు, చాంగ్‌లూవంశపారంపర్యమును 17 శతాబ్దములు సాగించిరి. యీ గురుపరంపరను ప్రభుత్వము అంగీకరింపకున్నను, 748 వరకు, అపుడపుడు, తనయధికారము చలాయించుచునే యుండెను కాని, చైనా ప్రజాప్రభుత్వము దానిని 1927 లో నిరాకరించెను.

మూడు గొప్పమతములలో నొకటియగు యీ నూతనమతము 'లావ్-ట్జూ; చూఅంగ్-జూ మతబోధనలలో గుడ్డిగా అవలంబించలేదు. యివి వీటికిపూర్వగ్రంథములు, వానివిభాగములయినను, చేతనమయిన ప్రకృతిని పూజించువిషయమై టాయిజము ప్రాచీనవిశ్వాసములను ఆచారములను కలిపి ఒకటిగా ఏర్పాటుచేసెను. సౌఖ్యము, ఐశ్వర్యము, చిరాయుపునను ముఖ్యమగు ఆశయముల సంపాదించుటకు 'టావో' లేక 'వే' సూచించునదే రాజమార్గమును, మనుజునకు పరమావధియు నయ్యెను. గొప్ప రచయితలవ్రాతలను భక్తితో గమనించుటవలననూ, వారి నైతికబోధనలవలంబించుటవలనను,రసవాదశాస్త్రమును మనస్ఫూర్తిగా చదువుటవలననూ శరీరపోషణావశ్యకతకు తగు నిర్ణీతాహారము, ప్రాణాయామము, శరీరవ్యాయామము మరియు కామకలాపముల గమనించుటవలన జ్ఞాను లీ ఆశయముల సాధింపగల్గిరి. సామాన్యజనులు దయ్యము లున్నవనియు మంత్రతంత్రములు ఆవశ్యకములనియు నమ్మియుండిరి. క్రమముగా వృద్ధిగాంచుచున్న స్మృతులలోని కొన్నిభాగములు వల్లించుచుండిరి. తమపాపముల నొప్పుకొని, పరిహారార్థము నూరుగజములరోడ్డును మరమ్మతుచేయుట మొదలగు సత్కార్యముల జేయుచుండిరి. బాటసారుల కుపయోగార్థము కొన్నిస్థల

*మాస్పెరో: "ఏషియాటిక్ మైథాలజీ" పే. 258 చూడుడు.

ములలో బియ్యము నిల్వయుంచి, టాయిస్టులు తమఅధిపత్యమున దానములుచేయుచుండిరి.

రాజమతమే వివాదాస్పదముగనున్నకాలమున, ఎక్కువ మతావలంబులుగల ఈ రెండు సమాంతరమతములు యుద్యమములు అనేకవిషయములలో ఏకీభవించి, ఒకదానినొకటి సంపన్నముగచేసుకొనుచుండుట తప్పనిసరియయ్యెను. ఘనమైన బౌద్ధమతము అత్యధికావకాశముల నిచ్చుచుండెను. బౌద్ధమత ప్రత్యేక ప్రఖ్యాతికి మినహా తదితరవిషయములందు టాయిస్టులు హిందూ ఆచార్యత్వమునే ముఖ్యముగా పాటించుచుండిరి. యిది టాయిస్టులసామాన్యపద్ధతికి కొంత విరుద్ధముగానుండెను. జీవునకు పునర్జన్మ సిద్ధాంతము, జన్మపరంపరలద్వారా జీవన్ముక్తికలదనుట అంగీకరింపబడెను. మరియు ముప్పదిమూడు పుణ్యలోకములు, పద్ధెనిమిది నరకములు హిందూ మతమునుండి స్వీకరింపబడినవి. ఆ లోకములకు చైనాఅధిదేవతల పేర్లుంచబడినవి. అసంఖ్యాకములగుసూత్రములు వ్రాయబడెను. భారతీయ జగత్సృష్టిని తెలుపు కల్పము (432,000,000) అనుపదమును మరియు కొన్ని పారిభాషిక పదములను కాలప్రమాణముల కుపయోగింపబడెను. బౌద్ధమతములోను లావోట్జు మతములోను ఏకాంతజీవితమనుఅంశము సామాన్యముగ నుండెను. కానీ బౌద్ధమతములోని సన్యాసత్వము, వసంత, గ్రీష్మఋతువులలో జీవహింసానిరోధము, మద్యములుసేవించుటపై నిరోధము అనునవి చైనీయులకు క్రొత్తగా కన్పించెను. కొంతకాలమునకు బౌద్ధమతము అనేక శాఖలుగా విడిపోయెను. వాటిలోనొకటి చాంఆన్ లేక ధ్యానైకశాఖ టాయిస్టు సిద్ధాంతములను, అభ్యాసములను యెక్కువగా అవలంబించి, చైనాదేశములో హిందూవిజ్ఞానమందలి యుత్తమాంశములను నిరూపించెను.

ఈ రెండుశాఖలలోని, యనుచరులు ప్రథమమునుండి చూపిన సహనము క్రమముగా మూడవశతాబ్దమునాటికి ద్వేషముగా పరిణమించెను* బౌద్ధమతమునకుజెందిన రెండవశతాబ్దమునాటి రికార్డులు, టాయిస్టుమతమునకు

---

* క్రీ. వె. 71 వ సంవత్సరములో వారిమధ్య ప్రథమపోరాటము జరిగినట్లు యేడవశతాబ్దపు బౌద్ధయితిహాసములలో నొకటి నిర్ణయించెను. కాని యిది బహుశా నిరాకరింపబడియుండును.

సంబంధించిన రెండవ మూడవశతాబ్దములనాటిగ్రంథములు, తుదకు తీవ్ర రూపముదాల్చిన యీ వివాదాంశములను వెల్లడిజేయు విశ్వసనీయమగు సాక్ష్యములుగా యేర్పడినవి. యీవివాదములు నిరంతరముగా సాగి, మరింత శత్రుత్వహేతువయినవి. యీ రెండుశాఖలవారును తమవివాదములను సచిత్ర వివరణలతో ప్రజలకు తెలుపసాగిరి. కిరాతకులమధ్య టాయిస్టులున్నట్లు చూపు దృశ్యములు బుద్ధదేవాలయములగోడలమీదను, భవనములమీదను చిత్రింపబడినవి.

యీ రెండు మతశాఖలమధ్య ముఖ్యమయిన భేదాభిప్రాయము లైంగిక సిద్ధాంతములనుగురించినది. బౌద్ధమతస్థులు బ్రహ్మచర్యమును బోధించుచు, మతాధికారులకు వివాహాదుల నిషేధించిరి. ఇంద్రియనిగ్రహము మానవ సహజప్రకృతికి వ్యతిరిక్తమని టాయిస్టులు విశ్వసించిరి. స్త్రీ, పురుషులు టాయిస్టుమతములలో కలసిమెలసియుండుపద్ధతిని వారు ప్రోత్సహించిరి. కొన్ని పండుగలలో పశుప్రాయమయిన ఉద్రేకజనితమగు వినోదములుజరుప బడుచుండెడివి. యీదృశ్యములు బౌద్ధమతస్థులకు, యితరులనేకులకు అసహ్యకరములుగా నుండెడివి. దీర్ఘాయువుపొందదగు రహస్యము నన్వేషించుటలో యేదో యొకవిధమగు నింద్రియనిగ్రహము అభ్యసించుట అవసరమని టాయిస్టులు గుర్తించిరి. దానికై కొన్నినిబంధనలను ప్రకటించిరి. నిబంధనలే కాక, వాటికితోడు నియతికూడ అవసరమయ్యెను. చైనీయుల సహజనైతిక ప్రవృత్తి, యితరమతములవారిచేతను, రాజ్యాంగసభ్యులచేతను చేయబడిన ఫిర్యాదులు, 7 వ శ. లో యీ అవినీతికరములగు అభ్యాసముల తొలగించుటకు సహాయపడెను. అయినను అవి 12 వ శ. వరకు యథారీతిగనే జరిగి పోవుచుండెను.

టాయిస్టులచరిత్ర వారి విజ్ఞానపరిచయమునుగురించి పరిశీలనచేయనిదే పూర్తికాజాలదు. రసాయనశాస్త్రాభ్యాసము, లోహములను బంగారముగా మార్చుట వారి నిత్యసంపదలకేగాక, అమరత్వమునొసగు సంజీవిని కనిపెట్టుటకై అభ్యసింపబడెను. ఇది క్రీ. పూ. రెండవశతాబ్దమునాటి విషయము. వై-పో-యాంగ్ అమరత్వముసాధించు గుళికలనుచేయు విధానముగురించి యొకగ్రంథమును రచించెను. యీ రసాయనవిద్యాభ్యాసము దైవికముగా

వైద్యము పరిశ్రమలకు ప్రధానసోపానమయ్యెను. వారు అమూల్యములగు మూలికలను కనిపెట్టిరి. గంధకము, పాషాణము, రసనంబంధమగు వస్తువులు, తుత్తునాగము, సీసము, రాగి, యినుము కలిసిన మిశ్రమ లోహములతో ప్రయోగములుచేయసాగిరి. వారి లోహశాస్త్రనిపుణత, ప్రకాశనములకు, చాయలను, రంగులను తయారుచేయుట కుపయోగించు వస్తువులు తుపాకిమందు, బాణసంచాలను తయారుచేయువిజ్ఞానము, శ్వాసనిరోధము. మైకముకలిగించు మందులు మొదలగునవన్నియు అనుభవసిద్ధరసాయన శాస్త్రవిజ్ఞానములో వారికిగల అతీత ప్రావీణ్యమును నిరూపించుచున్నవి. * మూడవశతాబ్ది ప్రారంభమున జీవించియుండిన టాయిస్టుచే రచింపబడిన ప్రథమ వస్తుగుణదీపిక నేటికిని మనకు అందుబాటులోనే యున్నది.

రెండవశతాబ్దాంతమున బౌద్ధమతము నాటుకొనిపోవుట. టాయిస్టు సిద్ధాంతము, ఆచారములు ఒకపద్ధతిగా యేర్పాటుచేయబడుట, ప్రభుత్వాధికారము క్షీణదశకువచ్చుట; యివన్నియు రాజమతదీప్తిని తగ్గించి, దానిపై దెబ్బతీసెను. మూడవశతాబ్దములోని తీవ్రఅరాజకము పుస్తకభాండారములు, పాఠశాలలు, పూజాస్థలములు సంపూర్ణ విధ్వంసమునకు దారితీసెను. సారస్వతము, చరిత్ర, న్యాయశాస్త్రము, కర్మకాండ మొదలగువాటిలో బోధనాభ్యాసమునకు అవకాశములేకుండజేసెను. నిర్దుష్టమయిన కన్‌ఫ్యూషియన్ ప్రభుత్వవిధానమునకు మూలాధారమయిన పురజనపరీక్షలు కొంతవరకు భంగమైపోయెను. ఆనాటి గుణతీవ్రత, గతమును విస్మరించు దృక్కులను తొలగించివేసెను. సౌశీల్య సదాచారములకు భంగకరముగా నుండెను. గ్రంథపఠనము, విశ్రాంతికాలపుపనులు, సుస్థిరమయినకాలము, సాధారణ అభివృద్ధిలమీద ఆధారపడియుండిన 'కన్‌ఫ్యూషియానిజమ్' దైవవిధివలన నిలచియుండెను.

240-48 సం.లమధ్య కన్‌ఫ్యూషియన్ సిద్ధాంతములలోని మూడువిషయములు రాతిమీదచెక్కబడి, 56 సం.లకుపూర్వము అధికారరీత్యా స్థాపింపబడినవానిసమీపమున, లోయాంగులో ప్రతిష్ఠింపబడెను. ఆ సిద్ధాంతసంబంధ

*జాన్సన్‌చే వ్రాయబడిన "ఏ స్టడీ ఆఫ్ చైనీజ్ ఆల్కెమీ" పేజీలు 103, 104, చూడుడు.

మయిన వ్రాతలలోని అక్షరములు నూతన ఆదిమభాషలకుసంబంధించినవిగా నుండెను. అందుచేత అర్ధశతాబ్దము కచపటిభాగములో తిరిగి దొరికిన యిరువది యెనిమిది శిలావశేషములు అమూల్యములయినవి. మధ్య అసియాలోని యెడారులలో దొరికిన పురాతనవస్తువులతోబాటు, యీ మూలములనేగాక, ప్రాచీనమయిన రెండువిధములగు లిపులనుకూడ భద్రపరచిరి. తనసిద్ధాంతముల ప్రవేశపెట్టుటయేగాక, కన్ఫూషియన్‌సన్యాసులకంటె గొప్పవాడని, కిరీటములేని ప్రభువనియెడివారి నమ్మకమును అంగీకరించలేదు. ఆయన మానవాతీతుడనిమాత్రము స్థిరపడెను. అనాటి ముఖ్యవిద్యాకేంద్రము చింగ్‌చౌ (ప్రస్తుతహూపే). కన్ఫూషియన్ సిద్ధాంతములను రెండవతూరి మార్పుచేయుటకు మూడువందలమందిపండితులు నియమింపబడిరి.

ఆకాలమున దినదినాభివృద్ధిజెందుచున్న వివిధమతసదాచారముల నిముడ్చుకొన్న మతము 'లావోట్జు' బోధనలై యుండును. ఆయనబోధనలలో చూపబడుచుండిన ఆదరణ ఆకాలములో వృద్ధిజెందుచున్న మతాభిమానమును తెలుపుచున్నది సారస్వతాభిప్రాయములుకూడ గౌరవింపబడుచుండెను. అవశేషములయిన యీగ్రంథములపై వాంగ్‌పి 226-249 అత్యుత్కృష్టకరములగు వ్యాఖ్యానములను వ్రాసెను. కన్‌ఫూషియస్-లావోట్జుల సిద్ధాంతములు ఒకేవిధముగనుండినవని ఆయనభావము, అయినను కన్ఫూషియన్ ఆదర్శపురుషుడని ఆయన భావించెను. తాను పూర్వాచారపద్ధతులను బోధింపకున్ననూ, మానవులు నీతిమంతులుగా నుండవలెనను విషయమును ధృడపరచుచుండెను. కువో-సియాంగ్ (d-312) అను స్వతంత్రభావుకుడు చియాంగ్-ట్జుపై ప్రామాణికవ్యాఖ్యానము వ్రాసెను. తనకాలమునాటి సంస్థలను, నీతులను దూషించెను. అవి కాలానుగుణముగ నుండనందున కల్పితములని యాతనియభిప్రాయము. లోయాంగ్‌లోని రాజ్యాంగసభ్యులు, యుద్యోగులసంస్థవారు, "వెదురుతోపు సప్తఋషు"లని పేరిడుకొని, తమ యనుచరులముందు మద్యపానము, సోమరితనముల ప్రాముఖ్యమునుగురించి పొగడసాగిరి. ఆకాలమున కఠిన నీతిసూత్రములకు తగియుండక అప్పుడు

వెలువడుచుండిన జానపదసారస్వతమునకును, హాస్యాలాపములకును, పద్యగ్రంథములకును విశేషావరము గలిగియుండెను.*

---

* ఆకాలమునాటి కన్‌ఫ్యూషియానిజమునకు సంబంధించిన, వాఙ్మయచరిత్ర యందలి యభివృద్ధిసూచకములగు ఒకటిరెండు సన్నివేశములయొక్క పలుకుబడి ఈకాలమువరకు నిలచియున్నది. 220 సం.లో తనతండ్రి ట్సావోట్సావో (౧౫౫ ౨౨౦) యధికారమునే సందేహించి, తనవశముజేసికొన్న 'పి' యువరాజు, తాను ఉత్తరచైనాపై తనపరిపాలన స్థాపించునపుడు తనమంత్రులకు, హాన్‌తో సమానమగు గొప్పరాజ్యము నేర్పరచుటకు, తనకనుకూలమగు రాజ్యాంగపరిశోధనలజేయుమని ఆజ్ఞాపించెను. మొదటిచక్రవర్తి, ఆయనపూర్వకాలపురాజులు కొందరు, ఆనాటి పరిజ్ఞానమునంతయు తమ వశముచేసుకొన విశ్వప్రయత్నములుచేసినను, ట్సావో కుమారుడుమాత్రము ఆవిధముగ తాను జేయుట దుస్తరమని గ్రహించగలిగెను. ఆవిధముగనే మొదటిసామాన్యసంగ్రహము, లేక ప్రతివస్తువిషయప్రదీపిక యాచరణలోనికివచ్చెను. దానికి సామాన్య, పైరివేటుసంబంధమైన పెక్కువారసు లేర్పడిరి. 'లీ' యువరాజుకొరకై చేయబడిన సమీక్ష కన్పడకపోయిననూ, అందులో షుమారు 8,000,000 పైగా మాటలుండెను.

281 సం.లో మరియొక ప్రధానసంఘటన జరిగెను. షుమారు ఆరు శతాబ్దములకుపూర్వము మరణించిన యొకరాజపుత్రుని లేక గౌరవకుటుంబీకుని సమాధిని తెరచినపుడు జరిగెను. 1,00,000లకు పైగా వ్రాతతో నిండిన వెదురుపలకలు దొరికెను. 15 యితర విషయైకవ్రాతలుగల గ్రంథములు, ముక్కలుకూడ నా సమాధిలో నుండినవి. వాటిలో కానన్ ఆఫ్ ఛేంజస్, హొవన్ కుమారుడైన 'మూ' క్రీడలు, B C 299 లో అంతమయిన లియాంగు లేక 'వీ'రాజ్యపు రాజకీయసమీక్ష, చీన్ రాజ్యము, కొన్ని యితిహాసకాలపు రాజకుటుంబములచరిత్రలుకూడ యుండినవి. 213 లో గ్రంథముల తగులబెట్టినపుడును ఉపాధ్యాయులు, వ్రాతగాండ్రపై దాడిజరిగినపుడును యివి తప్పిపోయి, యీ సమాధిలో దొఱకుట యొక ముఖ్యాంశము. వెంటనే పండితులు ఆనాడు ఆచరణలోనుండిన గ్రంథములను, వీటిని సరిపోల్చి చూడసాగిరి. వా రావిధముగచేసినతీర్మానముల పర్యవసానము 'టిసోచువాన్'

మూడవ శతాబ్దమునాటి మిగిలియుండిన గ్రంథములు బౌద్ధమత వ్యాప్తినిగురించి వ్యాకులతచూపలేదు. ఈ గ్రంథకర్తలు తమ పై ముఖ్యమును సంభాషణలలోను పరిహాసములు ఎత్తిపొడుపులప్రాతలలోనువెల్లడించియుండ వచ్చును. ఏమయిననూ, వారి సంప్రదాయానుసారము విదేశీయమతములను నిస్సందేహముగా, నిరసనదృష్టితో చూచెడివారు. 197 సం.రములో బౌద్ధ మతమునుస్వీకరించిన ఒక చైనా యువకుడు బౌద్ధమతమును ధైర్యముతో సమర్థించెను. ఆ వాదన బౌద్ధమతముపట్ల వారి యభిప్రాయమును తెల్పు ప్రామాణికసాక్ష్యము. కన్ఫూషియస్‌మతము జయింపబడదు. దానిలోని వాద ములకు సకృత్తుగా చేయబడిన ప్రతివాదనలు దానిని మార్చజాలవు. హిందూ దేశమునుండి మధ్యాసియానుండి వచ్చుచున్న విపరీతప్రవాహము నరికట్టు టకు శక్తికొలది యనేకశతాబ్దములు ప్రయత్నములుచేయబడెను. కానీ 11, 12వ శతాబ్దములవరకును అటుతర్వాతనే భంగపడి కూలిపోయిన బౌద్ధమత ముతో రాజీపడి, యొక నూతనమైనయధికారమతమును స్థాపించెను.

చైనా దేశస్థుల ప్రపంచవిజ్ఞానము, మతేతరవిషయములలో విదేశీయు లతో పరిచయము దృఢముగా పెంపొందుచుండెను. యీ సందర్భములో టాంగుకింగుపై వరుసదాడులు. దక్షిణసముద్రతీరములనుండి అనేకులు రాయబారులు చాంగ్-అన్‌చక్రవర్తికికట్టిన కప్పములు, మనము జ్ఞాపక ముంచుకొనుట అవసరము. క్రీ. శ. మొదటి యారుసంవత్సరములలో హిందూమహాసముద్రప్రాంతమునకు చైనారాయబారులు పంపబడిరి. వా రా మహాసముద్రమును దాటియుండవచ్చును. మధ్యధరాసముద్రపు తూర్పు ప్రదేశమునుండివచ్చిన సంగీతవిద్వాంసులను, గారడీవాండ్రను హాన్ చక్రవర్తి యాహ్వానించి గౌరవించెను. వీరిని బర్మాదేశప్రభువుపంపెను. 132 సం.రమున జావాప్రభువు కప్పముకట్టెను. 166 సం.రములో మార్కస్

---

హాన్‌లోని దానిస్థానమున మరలచేర్చుట యొకటి, పూర్వచరిత్రకాలనిర్ణయము తర్వాతవచ్చిన లియాంగ్‌చరిత్రయు నంగీకరించుట మరియొకటి. పూర్తిగా తలంపనిఫలిత మేమనగా, యీ వెదురుపలకలను వరుసక్రమముగా ఏర్పర చుటవలన చైనా లైబ్రరీలయందు గనునింపబడు 'ప్రత్యేకించుపద్ధతి' యొకటి అనాటినుండి ప్రారంభమైనది.

అరేలియన్ అంటోనియస్ టాంగుకింగుమీదుగా రాజాస్థానమునకు వచ్చిరి. 226 సం.రము చీ-యన్-లూన్-యను పేరుగల ఒకవ్యాపారస్థుడు తూర్పు రోమ్‌దేశమునుండి టాంగు-కింగుకు రాగా, యచటి స్థానికాధికారి నాన్‌కింగులో యున్న "ఉ" ప్రభువునొద్దకు పంపెను.

ఈయనరాజ్యము దక్షిణభాగములో నుండుటచేతను. ఉత్తర పశ్చిమ దిశలలో వే-షూ-రాజ్యములు దాటిపోవుటకు వీలులేనందునను, దక్షిణదిక్కుననే తన రాజ్యమును విస్తరింపజేయుట తప్పనిసరియాయెను. క్రీ. వె. 231 సం.మున 'కు అంగు టం' గ్'నాన్‌కింగు'ల చైనాగవర్నరు దక్షిణప్రాంత ప్రదేశములను స్వాధీనపరచుకొనమని. తనఅధికారులను పంపినపుడు, పై విధాన మవలంబింపవలసివచ్చెను. అందువలన సరిహద్దునకు వెలుపలనున్న రాజులు కానుకలసమర్పించుటకు రాయబారులను పంపిరి. అట్లు పంపినవారు: దక్షిణకంబోడియా, కొచ్చిన్, చైనారాజ్యాధిపతి ఫూ-నాన్-,చంపారాజు లిన్-యీ, ఉత్తరకంబోడియారాజు ట్యాంగు-మింగు.

15. 20 సం.రములతర్వాత యీ రాజే హిందూమహాసముద్రతీర భూభాగములన్నిటిని, ముందుగాపరిశీలించివచ్చుపనిమీద యిరువురురాయబారులను పంపెను. వారి కా యాత్ర రెండుసంవత్సరములకాలము పట్టెను. వారి వేదికలోని కొన్నిభాగములు విశేషప్రయోజనకరములుగా నుండెను. క్రమనుయిన వ్యాపారమార్గముల వెల్లడిచేయుట, ఋతుపవనములపరిజ్ఞానము పెద్ద యోడలవర్ణన దక్షిణసముద్రప్రాంతములలో హిందువులచే ఆక్రమింపబడిన విస్తారభూభాగములు అందు ముఖ్యముగవర్ణింపబడినవి. తాను కంబోడియాలో నుండగా.హిందూదేశపురాజు, ఫూ-నాన్‌ప్రభువుకు నాల్గు :సింధియన్‌గుఱ్ఱములనుకానుకగా పంపెనని అందులో ప్రముఖరాయబారి, తననివేదికలో తెల్పియుండెను. ఓడలు ఏడుతెరచాపలను విప్పి, వారములకొలది సముద్రయానము చేయుండెను. ఆ ఓడలు 600 మనుష్యులను, వేయిటన్నులకుపైగా సరకులను తీసికొనిపోవుచుండెనని ఒక సమకాలికునినివేదిక దృఢపరచెను. యీ యోడలనుగురించి వివరమగుసమాచారము కొంతకాలము రాయబారులు బౌద్ధసన్యాలు, విదేశయోడలపై ప్రయాణము చేయుచుండిరనుటనుబట్టి

చైనీయులు నౌకాయానములో తన దక్షిణ, పశ్చిమదేశీయులకు వెనుకబడి యుండినట్లు తెల్పుచున్నది.

ద్వీపకల్ప దేశములు, ద్వీపములు, దక్షిణ, పశ్చిమప్రదేశములుచూచి అచటి జనులనుగురించి తెలిసికొనుటయేగాక, చీనాదేశస్థులు మధ్యాసియా మంగోలియా, మంచూరియా, కొరియా, జపాన్‌దేశములను గురించిన నూతన విషయములను తెలుసుకొనుచుండిరి. ఈ కార్యక్రమమునకు భూగోళ శాస్త్రజ్ఞుల యవసర మేర్పడెను.

110 వ సంవత్సరములో మారిన్ టయర్ రచింపగా అనంతరం 170 లో టోలిమీచే సంస్కరింపబడిన దేశపటములతో పోల్చదగినట్లు యీ ప్రదేశములన్నింటిని నిరూపించు పటములు లేవు. ఏది ఎట్లున్నను యీ కాలమునాటికి చైనావారిస్వాధీనములోనున్న దేశపటములు స్థానికాధికారుల యుపయోగమునకై యుండియుండవచ్చును. సామ్రాజ్యసైన్యముల దండ యాత్రలను, బిడారు వ్యాపారులయుపయోగార్థము తయారుచేయుమార్గములును చూపు పటములుకూడ యుండెడివి. యీ ప్రాచీనపటములు నిస్సందేహ ముగా మోటుగా చిత్తుగానేయుండి, మూడవశతాబ్దంలో శాస్త్రోక్తముగ తయారుచేయబడిన పటములకు మూలాధారములుగ నుండెననుట కెట్టి సందేహమునులేదు. ఆ కాలములో పటముల తయారుచేయు ప్రముఖుడు పియీ-సియూ (224-71)

ఆయన మొదటి షిన్‌చక్రవర్తియొద్ద 261 సం.లో పబ్లికువర్క్సు శాఖమంత్రిగా యుండి, అప్పటికి అమలులోనున్న పటములతో తృప్తిజెం దక, తానువ్రాసినగ్రంథములో (ఇప్పటికి నిలచియున్న దదొక్కటే) పటము లను వ్రాయువారికి ఆరు నిబంధనల నిర్ణయించినాడు. యీ నిబంధనలమీదనే తాను వ్రాసిన చైనాపటము ఆధారపడినది. 500 లి (125 మైళ్ళ) ఒక అంగుళ ప్రయాణముగ, 18 భాగములుగా, పియో-సియో చైనాపటమును వ్రాసెను. దీర్ఘచతురవిభాగముల నుపయోగించుటయే యాతని నూతన కల్పన. దీనినే, గ్రిడ్‌సిస్టమని పిలచెదరు.

యాంగ్‌టిజీనదికి *దక్షిణముననున్న యుష్ణప్రదేశములనుగురించి వృద్ధియగుచున్నవిజ్ఞానము,వృక్షశాస్త్రమునుగురించి సంపూర్ణ నూతనవివేకము గ్రంథరచనకు దారితీసెను, యీ శాస్త్రమునుగురించి వ్రాయింపబడిన మొదటి గ్రంథము నాన్-ఫాంగ్, టుసోమూ-చాంగ్(దక్షిణమండలములోని వృక్షముల జాబితా) వృక్షజాతినంతటిని-మూలికలు, అడవిచెట్లు, ఫలవృక్షములు, వెదురు పొదలు యను నాల్గుతరగతులుగా కూర్చిన యెనభై జాతులనుగురించిన వివరము. 24 ఇతరవృక్షములను ఉదహరించి, ఆ వృక్షములు సిన్-రాజుకు విదేశములనుండి పంపబడినకానుకలుగ తెల్పిరి.

దక్షిణప్రదేశమును ఆక్రమించినందువల్ల కలిగిన అత్యంత లాభకరమగుఫలితము, తేయాకును గుర్తించుటయే. యింతవరకు తేయాకునుగురించి యెచటను పేర్కొనబడియుండలేదు. దీనినిగురించిన ప్రథమవృత్తాంతము జీచుయన్‌లో జన్మించి, 273 సం.లో మరణించిన యొక ఉద్యోగిజీవితచరిత్రలో నుండెను. అయినను తేయాకు వెంటనే ప్రజాదరణబొందలేదు. 8వ శ. మధ్యకాలమువరకు ఉత్తరచైనాలో దానియుపయోగము సామాన్యప్రజలలో వ్యాప్తిజెందలేదు. అప్పటికి అది టిబెట్టుదేశము చేరెను. 1200 సం.లు గడచినపిదప ఒక బౌద్ధసన్యాసి దానిని జపానులో ప్రవేశపెట్టెను. ప్రస్తుతము విపరీతముగ 'టీ'ని త్రాగు మంగోలులు 13, 14, శతాబ్దములలో ఆక్రమణకాలములో దానిని గుర్తింపలేదు.

చైనీయులయొక్కయు, వారిపరిసరప్రాంతీయులయొక్కయు జీవితములలోను అలవాట్లలోను ఈ'టీ'వలన కలిగినపరిణామాలను తూర్పుఆసియాను గురించిన చరిత్రగ్రంథములన్నింటిలో ఉదహరింపక తప్పదు. టీమొక్కలు విశాలక్షేత్రములలో సాగుజేయబడలేదు. ప్రతికుటుంబము తమకుకావలసినంత తేయాకు మాత్రమే యుత్పత్తిచేసుకొనుచుండెను. అపురూపమయిన,

---

*ఈ ప్రదేశమునుగురించి వ్రాయబడిన యితరగ్రంథములు : కొంగ్‌టాంగ్ నివాసి'యాంగ్‌పు'చే క్రీ.పె. రెండవశతాబ్దాంతమున వ్రాయబడిన 'ఐ-యు-చి' (అద్భుతవిషయములరికార్డు); కియాంగ్‌సు నివాసి "కుహూయి"చే (F 170-250) వ్రాయబడిన"కాంగ్-చౌ-చి" దీనిలో మొక్కలనుగురించి కొంత వ్రాయబడెను.

యమూల్యమయిన తేయాకు రకములను ఉత్పత్తిచేసుకొనుచుండిరి. మద్యపానము, ఆహారద్రవ్యములు, కర్మకలాపములందు చైనావారికి గల ఉత్సాహమునకును, పింగాణీపరిశ్రమ, టీపరిశ్రమ విశేషముగ ఋణపడి యున్నవి. ఈ పింగాణీపరిశ్రమ, తేయాకుఉత్పత్తి ఒకేకాలములో ప్రారంభింపబడినవని, యొకేచోట (కియాంగ్సి, చెకియాంగ్) బయలుదేరినవు, సున్నితములయిన, మంచిరకపు తేయాకు, అత్యంత సుందరములగు టీ కప్పులు, వాటిమూతలను ఎవరో కొద్దిమందిమాత్రమే సంపాదింపగలిగిరి. ఔషధమున తేయాకువిలువను చైనావారు చాలకాలముక్రిందటనే గ్రహించిరి.

ఆకాలపు భౌతికసంపదలోని ఇతరవిశేషములు చక్రపుబండి, జలయంత్రము. వీటివలన ధాన్యములు విసురుకొనుట, పొలములకు నీటిపారుదల చేయుటకు సదుపాయములేర్పడి, చైనావ్యవసాయదారులకు విశేషబాధ్యతను తొలగించెను.

చేమగ్గము, విత్తనములు చల్లు మోటుయంత్రము—యీ రెండు ప్రాచీన యంత్రములు హాన్‌పూర్వకాలమునాటివి. మూడవశతాబ్దములో ఇవి యెక్కువగా సంస్కరింపబడినవి.

## తూర్పు సీన్ - టర్కిక్ - సియాంగ్‌నూ మంగోలుల వంశములు (317-420)

266 వ సం.లో యీ వంశము స్థాపింపబడినతర్వాత, కొలదిశతాబ్దములు (420.వరకును) యిది కడు క్లిష్టమయిన పరిస్థితులలో నుండెను. ఈ శతాబ్దము గడిచినతోడనే దీనికి కష్టకాలము ప్రారంభమాయెను. పశ్చిమ ప్రాంతములో తిరుగుబాట్లు బయలుదేరెను. వానిఫలితముగ జె-కు అన్ (302-347) అను భాగ్యవంతమగు రాష్ట్రము చేజారిపోయెను. ఈ పరిస్థితి క్లిష్టమయినదే; కాని యెన్నియోసంవత్సరములనుండి తుర్కు, మంగోలియా, తుంగ్‌ఓక్ మొదలగు వేర్వేరుజాతిప్రజలగుంపులతో నిండియున్న యుత్తర దేశములో కలిగిన నష్టపరంపరలతో పోల్చతగినంత తీవ్రత యిందు కానిపించుటలేదు. మూడవశతాబ్దములో వారినాయకులెవరును లొయాంగ్‌లోని చైనాచక్రవర్తిఅధికారము నెదిరించగలస్తోమతను పశ్చిమభాగమునుండి

పొందజాలకపోయిరి. పైగా దానికి బదులు వారిలోవారు తీవ్రముగా పోరాడు చుండిరి. చైనాప్రభువులు ఒకప్పు డొకపక్షమును మరియొకతూరి మరియొక పక్షమును ప్రోత్సహించి, వారివిభేదములను హెచ్చుచేయుచుండిరి.

ఈ నాయకులలోనొకడు తనబాల్యములో రాజువద్ద కుదవపెట్టబడి యుండెను. చైనారాజ్యపరిపాలనామూలసూత్రములను, చరిత్రను బాగుగా గుర్తెరింగియుండెను. షాన్సీరాష్ట్రములో టాయుఆన్‌మండలములో 304 సం. రములో హాన్‌రాజ్యమును స్థాపించెను. తనతల్లివైపున, తాను ప్రాచీనరాజ్య సంతతివాడనని వెల్లడిచేయుచు, ఆ కీర్తిని నిలుపుకొనుటకే తాను హాన్‌రాజ్య మును మరల స్థాపించితినని ప్రకటించుచుండెను. ఆతని పుత్రుడు తండ్రి కుట్రలను సాగించెను. 311 సం.రములో యాంగ్‌పైన, 312 సం.రములో చియాంగ్‌ఆన్‌పై దండెత్తి, చైనారాజయిన "హుయే"ను సింహాసనచ్యుతుని జేసి, హత్యజేసెను, ఉత్తరచైనాయంతయు సియాంగ్ హస్తగతమయ్యెను. తరువాత రెండున్నరశతాబ్దములపర్యంతము చైనాదేశము చైనాసామ్రాజ్య ములో చేరలేదు. దేశదిమ్మరులను జాతివారు ఒకరివెనుక నొకరీ రాజ్యమును పాలించినను వ్యవసాయము, భాష మొదలగు విషయములు చైనాదేశపద్ధ తులలోనే జరుగుచుండెను. గొప్పగోడలదక్షిణప్రాంతములకు వలసపోయిన ప్రతివంశమును రెండుమూడుతరములవరకు చైనాఆచారములనే యవలం బించుచుండెను. చైనామహాసముద్రము తనలోనికిప్రవహించిన ప్రతినదిని ఉప్పునీటిమయముగ మార్చెను.

దేశదిమ్మరుల గుర్రపురౌతులచే ధరించబడినమాదిరిదుస్తులను ధరిం చుటయను చైనేతరాభ్యాసముమాత్రము చైనాలో స్థిరపడియెను. రాజోద్యో గులు, తదితరులుమాత్రము వదులయిన పైబట్టలు, నిడుపైనచొక్కాలు, రథములనెక్కువారివలె కురుచైనపాదరక్షలను చాలకాలమువరకు వాడుచుం డిరి. లోపలధరించుబట్టలు, షరాయి, రౌతులు వేసుకొను బూటులు క్రీ. శ. 4, 5 శతాబ్దములవరకు వాడుకలోనికిరాలేదు. టూయాంగ్‌కాలములో వాటి యొక్కవాడుక స్థిరపడిపోయెను. దేశదిమ్మరులతెగలు యుపయోగించు పెద్ద టోపీలు గొప్పవంశీయులు వాడుటకు ప్రారంభించిరి. ప్రాచీనచైనావారు వాడు

చుండిన "నడుకట్టు" (కాశికోక) పోయి తోలుపట్టాలు (బెల్టులు) వాడుక లోనికివచ్చెను.

5వశతాబ్దము పూర్తిగను, ఆరవశతాబ్దములో మొదటిభాగములోను (403-552) జౌ-జాన్ లేక, జాన్‌జుఆన్ అను వేరువేరుపేర్లుగల మంగోలు జాతివారు, కొరియాసరిహద్దులనుండి బాల్కాష్‌సరస్సువరకు వ్యాపించియుండిన మహాసామ్రాజ్యమును నిర్వహించిరి.

చైయాంగ్ - అన్ నుండి పారిపోయిన యొకరాజుచే నాన్-కింగ్‌లో స్థాపింపబడిన తూర్పు షీన్, చైనాసామ్రాజ్యము పెద్దనదికిదక్షిణమున కొంతకాలము బలహీనముగను, తరువాత బలయుతముగను నిర్వహింపబడెను. ఒకప్పు డది యుత్తరమున 'పసుపునది' వరకును, దక్షిణమున టాంగ్-కింగ్ వరకును విస్తరించియుండెను. 347 సం.తర్వాత జ-చు అన్ ఆక్రమింపెను. నాల్గవశతాబ్దములో పదునొకండుగురు చక్రవర్తులు సింహాసనమునధిష్టించిరి. వారిలో ఎక్కువమంది, 20, 30 సం.రములలోనే మరణించిరి. చైనా శరణాగతులరాకవలన వారిపాలితులసంఖ్య యధికమాయెను.

తమసరిహద్దులలోనుండిన చైనేతరజనమును తమలోకలుపుకొనుట, పరాయిరాజ్యములను దక్షిణ పశ్చిమప్రాంతములవరకు సాగుకాని ప్రదేశములను దురాక్రమణజేసి, వారియొద్దనుండి నిర్బంధముగ కప్పములువసూలు చేయువిధానమును షీన్‌సామ్రాజ్యమువారుకూడ సాగించుచుండిరి. చైనా చరిత్రకారులచే నల్లమరుగుజ్జు అని పేర్కొనబడిన నెగ్రిటాన్‌ప్రజలను దక్షిణమంగొలాయిడ్‌వంశమువారిలో కలుపుకొనిరి. నేటికాలములో కొందరు దక్షిణచైనీయులలో కనబడు జుత్తుముళ్ళు, నలుపురంగు, ఆ విషయమును నిరూపించుచున్నవి. చైనావారితో కలిసిపోయిన మరొకజాతి తాయ్‌వంశీయులు. ప్రఖ్యాతప్రతినిధులు ప్రస్తుతము తాయిలాండ్ (సయాము) ను స్వాధీనపరచుకొనిరి.

వేర్వేరుతెగలసంపర్కము, కలయికను గుర్తించిన పసుపునదివంశీయులలో కొందరు తమకుటుంబములలోని యీ అన్యరక్తసమ్మేళనమును నిరోధించిరి, కానీ, తమవంశములను కలుషితములుగాకుండయుంచుటకు

వారు చేసిన ప్రయత్నములు ఫలించలేదు. నూతనరాజ్యస్థాపనకు మార్గదర్శకులగు చైనావారు అంతర్వివాదములకు సమ్మతించుటయే యిందులకు కారణము. సామంతులవంశములు యీ నూతనరక్త మేళనము వలననే ఘనతగాంచెను.

రాజమతవ్యాప్తికి బొత్తుగా అనుచితమయిన యుగ మిది. కాని, కన్ఫూషియన్ మతము అంతరించలేదు. ఎంత చెడుగాచూచినను, దాని కదలిక యేమియు లేకుండెను. ఆ మతగ్రంథములు ప్రాజ్ఞులు, రాజోద్యోగుల ఆమోదముపొందకుండెను.

అయినను, బౌద్ధ-టాయిమతములు సామాన్యప్రజలలోను, చైనాదేశపు విదేశప్రభువులలోనూ ఎక్కువ వ్యాప్తిజెందెను. నిజముగ క్రీ. వె. 300 సం.లో బౌద్ధమతము పూర్తిగా చెలరేగి టాయిమతస్తులశక్తికి యెదురు నిలచెను మధ్యఆశియానుండి దూరప్రయాణముచేసి 310 సం.రములో "లోయాంగ్" చేరిన ఒక హిందూపండితుడు ఫో-ట్యూ-టెంగ్ యీ మతవ్యాప్తికి కారణభూతులగు ప్రముఖులలో నొకడు. యీ మతవ్యాప్తికి బాధ్యులగువారిలో యీయన హైందవుడు. గొప్పవాడు. రెండవచౌవంశమును స్థాపించిన కుటుంబీకులతోజేరి ముప్పదియేడుసంవత్సరములు వారితో సంబంధమువలని ప్రయోజనమును, తనబుద్ధికుశలత నుపయోగించి, రెండుమతములకు అంగీకృతమగుదేవళములను కట్టించెను. 334 - 348, కాలములో పాలించిన "షి - హు" చక్రవర్తి బౌద్ధమతములస్థాపనకు సమ్మతించినట్లు రాజాజ్ఞను ప్రకటించెను. ప్రభుత్వసహాయముతో చాల దేవాలయముల కట్టించి, చాలమంది గొప్పవారిపలుకుబడిగలిగిన శిష్యులను తయారుచేసెను. రాజ్యపరిపాలనతో భిక్షువులకు సన్నిహితసంబంధము కలుగజేసెను.

నాల్గవశతాబ్దము రెండవభాగములో కొరియాదేశమునకు బౌద్ధమత ప్రచారకులు పంపబడిరి. ఫో- ట్యూ-టెంగ్ శిష్యులలో ఒకరగు ట్యూ-ఆన్. యాంగ్‌టిజీ, పసుపునదిలోయప్రదేశములలో ప్రఖ్యాత మహాచార్యుడుగ నుండెను. 374 సం. రములో అయన బౌద్ధమతపట్టీనొకటి తయారుజేసెను. మతబోధనచేసి జనులను తనమతములో చేర్చుకొనుటయందును, ప్రజలలో బుద్ధునిజీవితచరిత్ర ఉపదేశములను వ్యాప్తిజేయుటయందును అతనికి

సంపూర్ణ విశ్వాసముండెను. తనశిష్యులను అన్నివైపులకు పంపెను. ఆతని ముఖ్యశిష్యుడు "హుయి-యు అన్" (334 - 416) బౌద్ధమతశాఖ లన్నింటిలో అతిముఖ్యమగు ఒకశాఖను స్థాపించి ఖ్యాతిగాంచెను. అందు పుణ్యభూమి - పద్మము (లేక) అమిదిస్టశాఖ, క్రియకంటె మతముమీద విశ్వాసమే ముఖ్యమని బోధించుటవలన, దానికి చాల విలువవచ్చినది కాని, విశ్వాసముతో "అమితాభ" నామసంకీర్తనము నిరంతరముగజేయుట ముఖ్యమనుటచేతను, దానివలన పరిశుద్ధప్రదేశమున లేక పశ్చిమ స్వర్గమున మరణానంతరము పునర్జన్మలభించుననుటనల్లనూ, కేవలము నామోచ్చారణకు అమిత ప్రాధాన్యమొసగినను దానివలన గాఢమగు ప్రతిఫలము కల్గుటయేగాక, మనశ్శాంతికూడ యధికముగ నేర్పడినది.

యీ శకములో వెలువడిన మరియొక మతశాఖ "చు-ఆన్" ధ్యానశాఖ జ్ఞానము, భక్తికలవారల నాకర్షించెను. దీనిలోనిబోధనలు ఉపనిషత్తులలోని కొన్నింటిని పోలియుండెను. అదికూడ టాయిజమ్‌లోని యున్నతోపదేశములతో సరిపోయినవి. కుమారజీవు (344-413) నియొక్క పలుకుబడిలోయుండిన "చూ-టావ్-షెంగ్"యను చైనీయునిచే స్థాపింపబడెను. ఒకరిచే చెప్పబడినట్లుగా యీశాఖ (ఏ) ప్రతిమానవుని హృదయములోను యుండవలసిన బౌద్ధమతసత్యమే యీతత్వము. (బి) మానవుడు ముఖ్యముగ చేయతగినది, తనదృష్టిని ఆత్మవైపుమరల్చి, హృదయములో బుద్ధుని చూడతగును. ధ్యానము, వైరాగ్యము, సత్కార్యములు నిరర్థకములు. (సి) దివ్యదృష్టి ఒకక్షణికములో లభింపగల జ్ఞానము, దానిని నేర్చుకొనుటగానీ, బోధించుటగానీ సాధ్యపడనిది. బోధనలు దానిని పొందుటకు మార్గసూచకములు యను వాదనలో యీతనికుండిన బుద్ధికుశలతవలననే కుమారవిజయుడు గొప్పకీర్తిని యార్జించుకొనెను. ఆతనితండ్రి హిందువుడు, తల్లి కూచరాజకుమార్తె.

ఆతడు తన యేడవయేటనే తన జీవితమును మతసేవకు యంకితముచేసెను. 352-354 సం.లో కాశ్మీరములో హీనయానమతమును చదివెను. 354 సం. తర్వాత కాష్గర్‌లోనూ, కూచలోను మహాయానమతము నభ్యసించెను. పదివేలమందిభిక్షువులు గలరను ఖ్యాతినిబొందిన నగరము

లలో యాతనిబాల్యముననే కీర్తిగడించెను. అనేకయాత్రలుజేసి, పెక్కుభాషలను సంపూర్ణముగ నభ్యసించెను. నాలుగువేదములు, పంచశాస్త్రములు, భిన్నమతావలంబకశాస్త్రములు, జ్యోతిషములను యీతడు శ్రద్ధగా గ్రహించెను. 382లో, లేక 383లో యాతడు ఖైదీగాపట్టుబడి, మొదట లూ కుఆం యనుపేర మిలిటరీయధికారిగ నుండి. తర్వాత లియాంగ్‌చక్రవర్తియైనవానిచే, మొదట కాంస్సులోని లియాంగ్-చూకును. తర్వాత చు,ఆంగ్ ఆన్‌కును పంపబడెను. ముఖ్యభాషలయందలి ఆతని పాండిత్యము, పరిజ్ఞానమువలన, తనపూర్వీకులకంటె యర్థ్వమగు అనువాదములజేసెను. అవిధముగా అనేకుల సహాయసంపత్తి బడసి, 421 లేక 425 చుట్టులలో 98 కావ్యముల అనువదించెను. వాటిలో 52(అనగా 302 ప్రతులు)యిప్పటి బౌద్ధమత త్రిపీఠికద్వారా నిలచియున్నవి. అనాటినుండి చైనాదేశములోని కొందరుపండితులకు యాతనిరచనలలోని యాకర్షణయు, ఆతనితర్వాతవారి అనువాదములందలి రుచియు, బౌద్ధమతము నిల్చియుండుటకు హేతువయ్యెను.

మరియొక ప్రఖ్యాత అనువాదకర్త ఫా-షియన్ యనునతడు షాంసి, యుత్తరరాష్ట్రము నుండి వచ్చియుండెను. ఆతను మతమును ప్రవేశించిన తోడనే, బౌద్ధమతమునుగురించి, సంపూర్ణముగ పరిశీలింపవలెనని నిశ్చయించెను. దానికై వానికికావలసినవిషయములు లోపించుటచే, 399 లో యితరులతోకలసి పెక్కు బుద్ధపవిత్రస్థలములకు బయలుదేరెను. సంస్కృతభాషలోనున్న అన్నిగ్రంథముల సంపాదింప నిశ్చయించెను. యీ యాత్రికులు మధ్యాసియాలోని టూ-హూ-ఆంగ్, కరషర్, కోటాన్, గాంధారదేశములగుండా 259 దినములు ప్రయాణముచేసి, 405లో మగధ చేరిరి. యాతడు పాటలీపుత్రమున మూడుసంవత్సరములకాలము యుండెను. వేర్వేరుశాఖలకు జెందిన పవిత్రగ్రంథముల సేకరించుట, నూతనప్రతులను వ్రాయుటయందు గడిపెను. 411 సం.లో విదేశనౌకలో సింహళము, జావా, లంకలమీదుగా సముద్రప్రయాణముచేసి తిరిగివచ్చెను. ఆతడు సంపాదించిన గ్రంథములతోను, విడివిడిగా దొరకిన బుద్ధస్మారకచిహ్నములతోను, 414లో చు-ఆంగ్-అన్ చేరగలిగెను. అచటను, నాన్‌కింగులోను 416లో మిక్కిలి

కష్టమగు అనువాదముచేయుటయందును సంపాదించిన చిహ్నముల క్రోడీకరించుటలోను కాలముగడిపెను.

యీకాలములో బౌద్ధమతస్థులు వైద్యశాస్త్రమునందు మిక్కిల శ్రద్ధ చూపినట్లు తెలియుచున్నది. వారితో కలిసియుండిన సామాన్యజనులును, జ్ఞానవంతులుకూడ చాల అమాయకులగుటచే, రోగములకుదుర్చుట బౌద్ధ సన్యాసుల కర్త్యవసరసాధనమని, బౌద్ధప్రచారకులు గుర్తించిరి. మరియు బౌద్ధమతప్రచారకులకు వైద్యశాస్త్రజ్ఞానము, వేరుజేయరాని శక్తియని యేర్పడెను.

యీకాలములలో టాయిస్టులుకూడ బౌద్ధప్రచారకులవలె చురుకుగా పనిచేయుచుండిరి. వారు ఉత్తర దక్షిణప్రాంతములలోని గొప్పవారిసంబంధమువలన కలుగు రాజకీయపరిజ్ఞానప్రయోజనముల బాగుగ గుర్తించిరి. వారు దివ్యఅవుషధము తయారుచేయుక్రమలును, సామాన్యలోహముల బంగారముగామార్చుటకై చేయుకృషియు చైనాప్రభువులనే గాక, మోటురాజులనుకూడ ఆకర్షించెను. వేర్వేరు విజ్ఞాన విషయములు, వానిలో ప్రత్యేకముగా సారస్వతముపై టాయిజము కలిగించిన శ్రద్ధ గుర్తింపతగియున్నది. టాయిస్టుమతాచార్యులలో కో-హంగ్ (270-350) అనువాడు ప్రాకృత వేదాంతముపై నొక ముఖ్యగ్రంథమును వ్రాసెను. కన్ఫూషియను సిద్ధాంతములపై వ్యవహారనైతికస్థితిని టావ్. యు. ఆన్. మింగు స్పష్టపరచెను. సీన్‌వంశరాజులయొద్ద కొంతకాలము న్యాయాధిపతిగ యుద్యోగముచేసిన పిదప, తనయిల్లుచేరి, తాను ప్రీతితో ఆనందించెడి ప్రకృతియు, అందలి పక్షులు మచ్చికజంతువులు, సాగుచేయబడినవృక్షముల సౌందర్యము అనుభవించుటకును, మిగతాకాలము వ్రాయుటలో గడుపుటకును తీర్మానించెను. ఆతడు పురాతన చైనీయులగుణముల నెక్కువగ గౌరవించెను. మరియు వ్యవసాయదారులు తృప్తినొసగు సన్నిహితులనియు, స్నేహితులనియు తలచెను. ఆకాలమునాటి కవితాశైలిని గ్రహించి, పెక్కు చిన్నకథలను వ్రాసెను. ఆకాలమునాటిసంస్థల ఖండించుముద్దేశముతో, "గౌరవపుష్పస్వర్గ"మను గ్రంథమును వ్రాసెను. అందు పైనికవిజృంభణము

నను, రాజకీయపరివర్తనమువలనను పారిపోయివచ్చిన కొన్నికుటుంబములు వారి భయపూరిత మూఢజీవితము వర్ణించియుండెను.

321-379 కాలమున చైనా గొప్ప వ్రాతగాడును, ప్రఖ్యాతఉద్యోగి, పండితుడును అయిన వాంగ్-హి-చి ప్రకృతి సౌందర్యోపాసియయినను, టాయిస్టుమతాభిమాని. రెండు మూడుశతాబ్దములలోనుండిన అనేక ప్రముఖ లేఖకులతర్వాత వచ్చిన చే-షుడీ (272-349) దగ్గర యీవిద్యను నేర్చుకొనెను. కూ-కయి-చీ (344-406) చిత్రలేఖనము, ఛాయాలేఖనములందు (కుంచెతోచిత్రించుకళ) యీతడు ప్రవీణుడు యీతడు 40 సం.ల కాలము రాజకీయయుద్యోగిగ పనిచేసెను. ప్రస్తుతము బ్రిటిషు మ్యూజియములో యుండు ఆతనిగ్రంథముపేరు **Admonitions of the Instructress of the Palace** "అంతఃపురయుపాధ్యాయినీసూచనలు"యనునది. రాజాంతఃపురజీవనములోని తొమ్మిదిదృశ్యములు, (మొదట పన్నెండుండెడివి) చిత్రింబడియుండెను. ఇది టీ-యాంగ్ యొక్క ప్రతియైయుండును. మ్యూజియముకు జెందిన లారెన్సు బినియన్ దానినిగురించి యీవిధముగ తనయభిప్రాయముల తెలియజేసెను - ఇది అపూర్వమయిన సంపూర్ణ ప్రఖ్యాతగ్రంథము. ఆకాలమునాటి ఉన్నతమయిన, సుకుమార, రూపములును, వారినాగరికత, సహజ సంపూర్ణఅభిలాషలయొక్క దృశ్యములు యని చెప్పకతప్పదు.*

పశ్చిమదూరప్రదేశమున చి-యాంగ్ లేక 'షూ' (నేటిజెక్‌యాన్) రాజ్యములోని స్థానికచరిత్రలు; అధికారవార్తాప్రకటనలును నేటిచరిత్రకారులకు అమూల్యాధారములుగ తయారగుచుండెను. 750 సం.లో వ్రాయబడిన చరిత్రవ్రాతప్రతి యొకటి టాన్-హూంగ్‌లోని యొక పురాతనదేవాలయములోని, గ్రంథాలయములో పెల్లియట్ యనువానికి దొరకెను సరిహద్దు జిల్లా యగు టాన్-హూంగ్‌నుండి పశ్చిమమున పెద్దగోడవరకునుండు ప్రదేశమునంతటినిగురించి వ్రాయబడియుండెను. కొన్నిశతాబ్దములవరకు ఒకటి తర్వాత యొకటిగా, యీ దేశీయచరిత్రలు కూర్చబడినవి. పదిశతాబ్దముల కాలము యీ చరిత్రలను యితరులు నిర్లక్ష్యముగచూచిరి. తుది మూడు శతాబ్దములలోమాత్రమే వాటిప్రాముఖ్యత సంపూర్తిగా గుర్తించబడెను.

---

* ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా, 14వ సంచిక సబ్ చైనీజ్ పెయింటింగ్.

ఈకాలమునాటి యీసంస్కృతికి క్రొత్తగా చేర్చబడిన విషయములు కొంతప్రాముఖ్యత గల్గియున్నవి. 'సీన్'కుపూర్వమే చైనాలో "పాచికలు" వాడుకలోనుండెను. వాటినిగురించి యొకసూత్రములో చెప్పబడినట్లు అనువాదము తెల్పుచున్నది.* 406 లో కుమారజీవునిఆజ్ఞపై అనువాదముచేసిన సూత్రములో నున్నది. చైనాలో యిటీవలవరకు విరివిగా వాడుకలోనున్న పల్లకివంటి కుర్చీలు గొప్పలేఖకులు వాంగ్-సి-చి, పోటుతెంగ్‌ల జీవిత చరిత్రలలో ప్రథమముగా వ్రాయబడియుండెను.

అకాలములో కుర్చీలు, పాచికలకన్న ఎక్కువగా బొగ్గు వాడుకలో నుండెడిది. దానియుపయోగము దేశమంతయు ప్రాకెను. బొగ్గుయుపయోగించుటచేత యెవరికితెలియకయే విశేషముగా కలప నిలువచేయబడెను. పది శతాబ్దములతర్వాతనే యూరపులో యిటువంటిసంఘటన చెప్పవలసి యున్నది.

## ఉత్తర చైనాలోని 'పీ', దక్షిణ చైనాలోని సంగ్, చి-లియాంగ్, చియాంగ్ వంశములు : (420-589)

420 సం.లో దక్షిణచైనాలో తూర్పు సీన్‌రాజ్యము నశించిన తర్వాత ఒకటిన్నరశతాబ్దములకాలము (439 సం.లో) ఉత్తరచైనాలోని రాజ్యము నకై కలహించురాజులను పైవంశమువారు ఓడించిరి. దేశమంతయు రెండు భాగములుగా విభజింపబడెను. చైనీయులు దక్షిణభాగమును తుర్కులు యుత్తరభాగమును పాలించుచుండిరి. పరిపాలనావిధానము యీ కాలమంతటిలోనూ పూర్వపుపద్ధతినే యనుసరించియుండెను. సాంఘిక, వైజ్ఞానిక పద్ధతు లెక్కువగా మార్పుజెందలేదు. ఉత్తరమున పసుపునదిలోయప్రదేశ పాలకులు విశేషముగా చైనేతరులే. ప్రజలుమాత్రము ప్రధానముగ చైనీయులే. గొప్పమార్పులు లేకుండా చైనానాగరికత క్రమముగా వర్ధిలుచుండెను. 'టో-పా' తెగపేరిట 'వే' 2వ శతాబ్దమునాటికే షాన్సిలోకి పోయి

---

*"హెచ్. హెచ్. డబ్సు"చే వ్రాయబడిన "హిస్టరీ అఫ్ ది ఫార్మర్ హాన్ డైనాస్టీ" 1 : 292; "ఏ. వేలే"చే వ్రాయబడిన "ఇన్ బుల్లిటిన్ అఫ్ ది మ్యూజియం అఫ్ ది ఫార్‌యీస్టరన్ యాంటిక్విటీస్" V. 140 (1933)

యుండుటచే, వారు చైనాదేశస్థులాచారములను అలవరించుకొనిరి. విదేశ భాష, విదేశాచారములను తప్పక యవలంబింపవలెనని స్వదేశీయులను ఒత్తిడిచేయక వారు మనఃపూర్వకముగా చైనావారిపేరులను, ఆచారములను దుస్తులను, సంస్థలను (సైనికవిషయములుతప్ప) అలవరచుకొనియుండిరి. వారినివాసస్థానములలో నొకటిరెండు ప్రదేశములలో ప్రాచీనలిఖితపత్రములు కొన్ని దొరికినను, వారి వ్రాతలిపిజాడలు దొరకలేదు.

చైనీయుల జీవితమార్గముల వా రెంత ప్రోత్సహించినను, యుద్ధములలో "టో-పా" తెగవారు కడుక్రూరముగను, పట్టుదలగలవారుగ నుండిరి. తమ తోటితెగలవారికి యీవిషయములోమాత్రము వా రేమియు తీసిపోరు. ఉత్తరచైనాదేశములోనుండిన తమశత్రువులనందరను ఓడించి పారద్రోలుట ఘనకార్యమే. కాని, వారంతటితో నాగక, 402. సం.న తమ సరిహద్దులలో అల్లరులుగలిగించుచున్న "అవార్లు"ను, గోబీని దాటి తరుమగొట్టిరి. ఉత్తర సరిహద్దు ప్రాంతమున ప్రతీకారదాడులనుండి రక్షించుకొనుటకు "గొప్పగోడ"ను మరమ్మతుజేసిరి. (423-440) ప్రస్తుత కల్గానుకుత్తరమున దక్షిణవంపుగోడ కట్టబడెను. 445-448 సం.లలో నతనిసైన్యములు మధ్యాసియాలో "కూ-చా" వరకుగల ప్రదేశము నాక్రమించెను. ఇచట సైన్యాధిపత్యము, అశ్వదళయుద్ధము అత్యుత్తమముగా యుండెను.

పట్టుదలతో సవారిజేసి, తీవ్రముగ దెబ్బతీయగల అశ్వదళవిభజన ప్రాముఖ్యతను చైనావారిచేతను, సంచారతెగవారిచేతను గుర్తింపబడియుండెను. హాన్‌చక్రవర్తి, "ఊ-టి"గారు గుర్రములపెంచుటయందు ప్రత్యేక శ్రద్ధవహించిరనియు, వాటిసహాయమున తనకాలమునాటి చుట్టుప్రక్క శత్రువులను ఓడించిరనియు చెప్పబడెను స్టెపిమైదానములలో పెరిగిన గుర్రములకు యాంటిజీ దక్షిణప్రాంతములలో పెరిగెడి పచ్చిక యచటి వాతావరణస్థితికి సరిపడకుండెను. "ఊ-టి" రాజుచే గుర్రములకు అనుకూలముగ వృద్ధిచేయబడిన సారవంతములగు పచ్చికబయళ్ళు నాల్గవశతాబ్దములో చైనా రాజులు పోగొట్టుకొనిరి. ఆ కారణముచే శత్రువులనుఓడించగల అశ్వదళములు వారికి లేకుండపోయెను. యాంగ్-టిజినదికి దక్షిణముగనుండిన ప్రదేశము అశ్వదళసైన్యమున కనుకూలముగానుండనందున, యెంతనష్ట

మైనను ధరించి, ఆ గొప్పనదీప్రాంతము రక్షించుకొనుటయే వారికర్తవ్యమై యుండెను.

యీకాలములో వాడబడిన గుర్రపుజీను (సామాస్లు) అన్నియంశము లలోనూ, గుర్రమునోటిలోపెట్టబడు యినుపతునక. కళ్ళెము, జీనులతప్ప పూర్వపువాటికి పోలియుండెను. * రికాబులుమాత్రము లేవు. గుర్రములు మిక్కిలి వేగముగా పరుగెత్తునపుడు బాణములను ప్రయోగించు సాయుధ రౌతునకు అత్యంతయుపయుక్తమయిన యీ సామాస్లు చైనాచరిత్రలో 477 సం.లో ఉదహరింపబడియుండెను.

అయిదవశతాబ్దము గడచిన తర్వాత, "టో-పా" తనయుద్ధప్రాబల్యము ను నిలుపుకొనలేకపోయెను. 534 సం.లో ఆ వంశీయులు తూర్పు, పడ మరతెగలుగా చీలిపోవుటచే వారిరాజ్యము ముగిసిపోయెను.

420 మొదలు 589 మధ్యకాలములో సాంఘికఅశాంతి రాజకీయ కల్లోలమును వృద్ధిచేసెను. భూమిపన్నులవిధింపు యీ అశాంతికి ముఖ్య కారణమయ్యెను. స్వాభావికములగు విపత్తులుగానీ, అరాచకముగానీ కలిగి నపుడు, ఐశ్వర్యవంతులు, బలవంతులునగు కొద్దిమంది భూస్వాములు, మిక్కిలి భాగ్యవంతులు, శక్తివంతులగువారికి తమవస్తువులను విక్రయించ వలసివచ్చుచుండెను. అనివార్యమయిన యీపన్నులను తప్పించుకొనుటకు, భాగ్యవంతులు తమభూములను బౌద్ధదేవాలయములయొక్క టాయిస్టుమత ముల రక్షణక్రిందయుంచుటయో, తమకుటుంబములలో నొకనిని మతప్రచా రకునిగ చేర్చుటయో సామాన్యముగ జరుగుచుండెడిది. తమ ఆస్థిని పోగొట్టు కొనిన కొందరు నిరాశాహతులై సైనికసేవ, నిర్బంధసేవలనుండి తప్పిం చుకొనుటకు మతములలో ప్రవేశించుచుండిరి.

ఎన్నిఅడ్డంకులు కలిగినను, బౌద్ధమతము నానాటికి వృద్ధియగుచుండెను. యీకాలము బౌద్ధమతమునకు 'బంగారుశకము' అనికూడ పేరుగాంచినది.

---

* క్రీస్తుశకమునకు పూర్వమే రికాబుగురించి సిథియనులకు తెలిసియుండ వచ్చును. దీనివిషయము కాలనిర్ణయమును "ఆరకిడ్డి" చేయలేదు.

"యురేషియా సెప్తెన్ట్రియనలిస్ ఆన్టిగా," ix 206-208(1934)ను గ్రౌసెట్ యల్ యంపైర్ డెస్ స్ట్పీస్, పే. 37; నోట్ 1. ను చూడుడు.

అన్ని అవసరములను దీర్చుటకు వేర్వేరుశాఖలు వెంటనే బయలుదేరెను. 357 తరువాత మతములోప్రవేశించుటకు ఎక్కువమందిస్త్రీలు యుత్తరువు పొందిరి. సూత్రములు, మతసంబంధమగు తదితరగ్రంథములు అత్యంత యుత్సాహముతో అనుసరింపబడెను. దక్షిణప్రాంతమున, పరంపరగావచ్చిన వంశములవారందరు ఉన్నతాధికారుల తీవ్రహెచ్చరికలను సరకుసేయక బౌద్ధమతమవలంబించుచుండిరి. 'వే' రాజ్యపురాజధాని లోయాంగ్‌లో 500-515 సం.లలో మూడువేల యితరదేశభిక్షుకులకు పోషణసౌకర్యములు చేయబడెను. లీయుసంగ్ ప్రభువులకాలములో వేలకువేలు గోపురములు, బౌద్ధదేవాలయములు, విగ్రహములు నిర్మింపబడెను. దక్షిణ 'చా'లో బౌద్ధ మతాచార్యులు ప్రభుత్వసభలలో ప్రముఖస్థానములు గలిగియుండిరి. చిన్న తనములో టాయిమతస్థుడయిననూ, మొదటి లీయాంగ్ చక్రవర్తి (502-549) బౌద్ధమతాభివృద్ధికి ఎంతయో పాటుబడెను. అందుచే అతడు చైనా అశోకుడని పేరుగాంచెను. 547 లో ఏర్పడిన తిరుగుబాటులో శిథిలము లయిన బౌద్ధమతచిహ్నములు తిరిగి కట్టబడెను. ఇరువురు చక్రవర్తులు వారి యొక్కవారసుడు మతగురువుదీక్షను పొందిరి.

ఈ బౌద్ధమతప్రచారము చైనీయులు యుత్సాహముతో అవలంబించి నందువలన గలిగిన ఫలితములన్నింటిలోనూ శిల్పచాతుర్యము వన్నెకెక్కెను. చిత్రలేఖనము శిల్పవిద్య కేమాత్రము తీసిపోదని నిరూపించుటకు వలసిన ఆకాలమునాటి చైనీయనిదర్శనము టన్-హాంగ్‌లోని శృంగారమంటపముల లోని కొన్నిగోడలుతప్ప, ముఖ్యమగు చిత్రములేవియు నిలచియుండలేదు. టో-పా-చన్, ఆయనతర్వాతవచ్చినవారు శిల్పమును, రాతిపై చెక్కువిద్యయు గృహనిర్మాణమును సార్థకమగునట్లు పెంపొందజేయుటచేతనే, మానవుని వలనను, కాలానుగతమార్పులవలనను గలుగు విపత్తులకు నిలచి, నేటికిని కొన్నివస్తువులు స్థిరముగ నిలచియున్నవి. 414 మొదలు 520 వరకు గడ చినకాలములో షాన్-సీలోని ప్రస్తుత టో-టంగ్‌చెంత మొదటి 'వే' రాజ ధానిసమీపముననున్న రాతిగుహలలో టో-పా అనేక మంటపములను చెక్కించి. వాటికిని యా రాతిలోనే చెక్కబడిన విగ్రహములకును ఆభరణ ముల నలంకరింపజేసెను. మరికొన్నిమంటపములు థో-పా, వారితర్వాత

వచ్చినవంశములవారి ఆధిపత్యముక్రింద చాలప్రదేశములలో కట్టబడెను. అవి ఎక్కువగా షాన్-సీలోని 'టీయన్-టంగ్ పర్వతముసమీపముననూ, షాన్-టంగ్‌లోని విచెయింగ్‌ప్రాంతమునను, లోయాంగుసమీపమునన్న లంగ్-మెన్‌లోనూ, టన్‌హూ ఆంగ్‌లోనూ, చెక్కబడెను. ఈ మందిరములలో చెక్కిన చిత్రములలో ఒకేరీతిగా లేకపోయినను, మధ్యయుగమునాటి ఐరోపా క్రైస్తవదేవాలయములలోని శిల్పములపోలియుండెను. తక్షశిల, పెషావరు, మధుర, యితర పశ్చిమఆశియాదేశములద్వారా గలిగిన అభివృద్ధికరములగు సవరణలు, సహజసిద్ధముగ కన్పట్టుచున్నవి. ఈ పనిచేయుటకు నియమింపబడిన శిల్పకారులలో కొందరు పరదేశములనుండి పిలిపింపబడియుండవచ్చును* ఇన్ని పరదేశప్రోత్సాహములుండినను, గృహ విగ్రహ నిర్మాణములు ఎక్కువగా చైనావారిపద్ధతులలోనే కట్టబడెను. పరదేశమతమే యధికముగా ప్రాబల్యమగుచుండెను.

సంగీతవిద్య, దానిలో ముఖ్యముగ భక్తిరసపూరితకీర్తనలు, మందిరములలోనూ, మఠములలోనూ పాడబడుచుండెను. హిందూదేశములోని ప్రాచీన బౌద్ధగేయములు తంత్రీవాయిద్యములకలయికతో పాడబడుచుండెను. కానీ, చైనాలో యంతట విశేషముగ నేటికిని గాత్రసంగీతమునే పాడుచుండిరి. ఆరవశతాబ్దము గడచిననాటినుండి రాతిమీద చిత్రింపబడిన చిన్న సంగీతవాయిద్యసమ్మేళనమునుబట్టి, కొంతవరకు వాయిద్యములుండెనని విదితమగుచున్నది. ప్రాచీన మతప్రచారకులు తమకీర్తనలను చైనాభాషలో సరిపుచ్చుట సుసాధ్యముకానిదని గ్రహించిరి. సంస్కృతములో అనేకాక్షరశబ్దములుపలుకు స్వరముతో ఏకాక్షరచైనాశబ్దములను యెవరును

*439వ సంవత్సరములో "టన్-హూ ఆంగ్" దేశము "టి-యో-పా" అధీనమైనప్పుడు 30,000 కుటుంబములు రాజధానినగరము "టా-టి-అంగు"కు బలవంతముగా తొలగింపబడినవని "వె-షు" చెప్పెను. ఈ కాలములో సన్యాసులు బౌద్ధమత సాధనసామగ్రులు యావత్తు తూర్పుదిశకు వచ్చెను" (బి. రొలెండ్ ఆర్టి బస్ ఏషియే" X: 5 p (1947) లో నుదహరించెను.

ఉచ్చరింపజాలకపోయిరి. నూతన భాషాసంప్రదాయము యవసరమగుటచే బౌద్ధమతస్థులయిన దేశీయ విదేశీయసభ్యులు ఆ సాంప్రదాయముల సృష్టింప ప్రయత్నములు జేసిరి.

5, 6 వ శతాబ్దములనాటి గృహములు, విగ్రహములు, దేవాలయ ఉపకరణముల అవశేషములున్నూ చైనా బౌద్ధమతస్థుల గ్రంథములున్నూ. బౌద్ధమత ఔన్నత్యస్వరూపమును విశేషముగా తెలియజేయుచున్నవి. బౌద్ధ మతప్రచారకులలో సభ్యుడయిన "హు-యి-చియాన్"చే తయారుజేయబడిన కాసేంగ్, చుఅన్ (వన్నెకెక్కిన బౌద్ధమతగురువులజీవితములు) గ్రంథము. అమూల్యగ్రంథములలో నొకటి. జాతీయ, పరదేశీయులగు హాన్‌వంశము నాటినుండి, లియాంగ్ వరకుగల మధ్యకాలమందుండిన సన్యాసులజీవిత చరిత్రలు యిందులో వ్రాయబడినవి. స్వయముగా తమప్రాణముల బలియొసంగిన, యేడుగురిజీవితచరిత్రలుకూడ వానిలో యుండెను. బౌద్ధమతము రాకపూర్వము చైనావారికి వారిజీవితములు అపురూపమగుభావములను వ్యక్తపరచెను. ఒకవ్యక్తి ప్రాణములను త్యాగముజేయుట యితరబలిదానములకంటె యుత్కృష్టమైనదనియు, బలిదానముగా యొకవ్యక్తి తన వ్రేలిని దగ్ధముచేసుకొనుట. రాజ్యములోనిప్రజలందరిని రక్షించుటకంటె గొప్ప త్యాగమని సధర్మపుండరీకసూత్రములలో బోధించెను. ఆదర్శమును మార్గ దర్శకముగా వుంచుకొని, మోక్షమును పొందువిషయములో, యీ సూత్రము చాల ప్రజానురంజకముగ నుండినట్లు తెలియుచున్నది. బహిరంగప్రదేశములో ప్రజలు స్తోత్రములుచేయుచుండగా, అనేకులు బౌదమతసన్యాసుల ఆదర్శానుసారముగ ఆత్మార్పణమును జేసిరి.

దూరదేశయాత్రలు కొనసాగుచుండెను. బౌద్ధమతదీక్షాపరురాలగు "వెయి" చక్రవర్తిని "హు" ఆజ్ఞానుసారముగా 516 సం.లో చేయబడిన యాత్ర కడు ప్రాముఖ్యమయినది. సంగ్‌యన్, మరికొందరు మిత్రులతో మతగురువు హు-షెంగ్‌తోనూ కలిసి 518 సం.లో మధ్యాసియాద్వారా గాంధారమునకు పోయి, తిరిగి 522 సం.లో లోయాంగుకు తిరిగివచ్చెను. ఆయన వచ్చునపుడు బౌద్ధమతమహాయానశాఖకుజెందిన 170 సూత్రములను, శాస్త్రములనుతీసుకొనివచ్చెను. ఈ కాలములో నూతన బౌద్ధమతశాఖ

లలో టి - యి యన్-టియె కడు గొప్పది. ఇది 575 సం.లో ప్రారంభింప బడెను. ఈశాన్యచెకియాంగ్ రాష్ట్రములోని ఒకపర్వతశ్రేణిపేరిట బయలు దేరినది. బుద్ధునిమనసు ప్రతిజీవములోనూ ప్రతిఫలించుచున్నదని టి-యిన్-టియె చెప్పెను. దానిని గ్రహించి యాచరణలోపెట్టతలంచిన వ్యక్తికి కొంత యుపదేశము విధిగా అవసరమగుచున్నది. ఈ సూత్రము పండితులనాశ్రయించెనని యూహింపదగియుండెను. ఈ శాఖ పక్షపాతమయినదికాదు. ఉద్రేకము, కర్మకలాపము, స్వీయనిగ్రహశిక్షణ మొదలగు అనేకగుణములును (భూతములు) యున్నవని అంగీకరించి, ఆరవశతాబ్దము నుండి ప్రపంచములోని అనేక సాంఘికశాఖలతో సహనముచూపుచు బౌద్ధ మతము ఉన్నతమయినభావమును నిలిపెను.

విదేశమతముచే ప్రోత్సహింపబడుచు, అభివృద్ధిగాంచుచు టాయిస్టులు 446 సం.లో బౌద్ధమతమును "వెయి" ఉత్తరమున నిషేధింపగలిగిరి. కాని యా నిషేధచర్య కొలదిసంవత్సరముల తర్వాత తొలగింపబడెను. కన్ఫూసియన్ పండితుల విమర్శలనుకూడ బౌద్ధమతము యెదుర్కొనవలసి వచ్చెను. భవనములనుస్థూపములనునిర్మించుట కర్మకలాపములలో కాలమును వృథపుచ్చుట, బుద్ధిమాంద్యము (మందబుద్ధి) కృత్రిమవాదము టాయిపేరిట యాచరింపబడుచున్నదానిలో మోసములను విచారము వెలిబుచ్చుచుండిరి. ఈకాలములోవలెనే యాకాలమునకూడ ప్రజలు దృఢవర్గములుగ విభజింపబడలేదు. ఆకాలములో ప్రఖ్యాతప్రతినిధులు రెండువిధములగు చైనామతము లవలంబించుచు, అదేసమయమున తమపై నిర్బంధించబడిన మతము స్వీకరించుటకు చేతులుజాచుచుండిరి.

పురాతన చైనాసిద్ధాంతములకు విరుద్ధముగానున్న బౌద్ధమతములోని నూతన వేదాంతసిద్ధాంతములను గాంచి యాందోళితులయిన కొందరు, కరపత్రములు, విన్నపములద్వారా ఆ మతమును (మతములను) దాడిజేసిరి. చైనావారిహృదయములలో గాఢముగ నాటియుండిన సిద్ధాంతములు "పూర్వనిర్ణయము" బౌద్ధమతములో బోధించిన "కర్మ" సిద్ధాంతము-చైనావారికి విప్లవ సిద్ధాంతముగ నుండెను. విశ్వాసము, ఋజువర్తనము యీ జన్మలో కాకున్నను, మరొకజన్మలోనైనను మోక్షమును సిద్ధింపజేయునని మతా

చార్యులు బోధించుచుండిరి. దీనినిబట్టి మానవుడు నాశనములేనట్టి ఆత్మ గలిగియున్నాడని తేలుచున్నది. వారి యోగ్యతాయోగ్యతలననుసరించి వారు గౌరవింపబడుటయో, లేక శిక్షింపబడుటయో జరుగునని, దానికి స్వర్గము, యొకటిరెండునరకములు గలవని వారివిశ్వాసము. జనసామాన్యమునకు, కొలదివిద్యాధికులకు యీ యభిప్రాయమువలన గలుగు మానసికశాంతి యెంతయినను, యీసిద్ధాంతములు పండితులకు విమర్శనీయాంశములే. కొన్నిశతాబ్దములతరబడి చెలరేగిన వాదోపవాదములు ముగియలేదు. వాస్తవముగ చైనావారు యీ శతాబ్దములన్నిటిలోనూ, హిందూమతములో కలిగిన నూతన కల్పనల తాము తెలిసికొని, అంగీకరింపదగినయంశములకై ప్రయత్నించుచుండిరి.

ఈ యుగమునాటి పండితులు, మతవిషయికతగవులాటలలోనే సంపూర్ణముగ నిమగ్నులయియుండక, మరి యెన్నియోవిషయములలో శ్రద్ధ వహించుచుండిరి. 5 వ శతాబ్దములో "షెన్-హుయో-యాన్" చే వ్రాయబడిన "దక్షిణచైనావర్ణన" తూర్పుఆసియాను గురించి వివరింపబడిన చాల భాగము "Commentary on the water classic" మొదలగు గ్రంథములద్వారా భూగోళజ్ఞానము అధికమాయెను. "$\pi$" యనుగుర్తునుగురించి చాలవరకు సరియైన ప్రథమగణితము "టూసూ-చు-అంగ్చి" (420-500) వ్రాయబడెను. తమంతటతామే పనిచేయు కొంపస్‌వంటి వృత్తలేఖినులకూడ యీతడు కనిపెట్టెను. చైనాభాషనుగురించి చేయబడిన మొదటివిమర్శ 480 సం.లో 'లియుం-షే' చే ముగింపబడెను. ఆయన దానిలో 35 వేర్వేరు సారస్వతగ్రంథములగురించి చర్చించెను. లియాంగ్‌రాజకుమారుడు "సియో-టంగ్" (501-531) విద్యాసంబంధమగుగ్రంథముల సమకూర్చెను. దానిలో 36 వేర్వేరువిధములయిన సారస్వతరచన లుండెను. మతసంబంధమగు విషయములు దానిలో చేర్చబడలేదు. రాజోద్యోగులవారికై పలుకుబడికలిగించువిషయములలో టాయిస్టు, కన్ఫూషియన్‌కావ్యములతర్వాత, యివియే ప్రాముఖ్యస్థానమును వహించినవి. పురాతనచరిత్రలో ఆసక్తిగలవారికి, పండితులకు, ఉన్నతోద్యోగుల నిరంకుశాధికారములనుగురించి యనేకగాథలు దానిలో వివరింపబడియుండెను. చిత్రకారులు, వర్ణములు (రంగులు) గురించి

ప్రత్యేకముగ తెలుపు ప్రథమగ్రంథము, 5 వ శతాబ్దములో 'సిన్-చాంగ్-చి' చే వ్రాయబడెను. చిత్రలేఖనముగురించినవిషయములు నియమములు ప్రప్రథమముగ 500 సం. లో 'షీ-యో' చే వివరింపబడెను.

భాషయొక్క శబ్దవ్యుత్పత్తిశాస్త్రమునుగురించికూడ విచారణచేయబడెను. మనకందరకును తెలిసినట్లుగా, అనేక యితరభాషలు, తమభాషలోని అనేకవిభాగములు గలవను సంగతి చైనావారికి తెలియును. స్వరములను, నాలుగువిభాగములుగ నిర్ణయించిన ప్రథమమానవు డెవరో మనకు తెలియదు. కాని, 5వ శతాబ్దముతుదిని పలువురుపండితులు దానినిగురించి తెలుసుకొనుటకు శ్రద్ధవహించియుండిరని స్పష్టమగుచున్నది. చైనాఅక్షరముల వర్ణక్రమము చాల ముఖ్యమయినది. అది చాలకష్టమయినసమస్య. బహుశా హైందవ, మధ్యఆసియాపండితులు కొందరు ఆ సమస్యను పరిష్కరించి యుండవచ్చును. తాలవ్యములగుర్తించుటకు రెండవచైనాయక్షరమును, అచ్చుతోగూడిన మూడవఅక్షరము ఓష్ఠములును, పదములగుర్తించుటకును వాడియుండవచ్చును.

ఈకాలమునందలి యభివృద్ధికార్యక్రమములలో, యంతప్రాముఖ్యము కాకపోయిననూ, మట్టితో విగ్రహములను తయారుచేయుకళను చేర్చవలసియుండును. హాన్ కాలమునాటికి ప్రారంభమై, పిదప కొలదిశతాబ్దములలో దినదినాభివృద్ధిగాంచిన యీ కళ, భాగ్యవంతులను దహనముచేయునపుడు, పశువులను, మానవులను బలియిచ్చు ప్రాచీనయాచారముపట్ల గలిగిన యసహ్యతను సూచించుటకు ప్రారంభమాయెను. పురాతనవస్తుశాస్త్రము, మరణించినవారు వాడినవస్తువులు, గృహములు, పనిముట్లు, పశువులయొక్క నమూనాలు మొదట తయారయినవి. ఉత్తరమున "వెయి", దక్షిణమున "లియాంగ్" వంశములకాలమున పాత్రలు, టాయిలెటుపెట్టెలు, ఫ్లాస్కులు, ఆటకత్తెలు, పాటకులు, యోధులు, నౌకర్లు, పశువులపరంపర లుండెను. ఈ విగ్రహములు పురాతనవస్తుశాస్త్రరీత్యా యెక్కువ ప్రయోజనకరములుగా నున్నవి. ఏవిధమయినజీవినైనను బలియివ్వకుండా మానుకొనవలెనను, ప్రముఖనీతిసూత్రము, బౌద్ధమతమునకు సంబంధించియుండుటతప్ప, దీనికిని బౌద్ధమతమునకునూ యెట్టిసంబంధములేదు. వాటినికొను శక్తిగలిగిన

బౌద్ధేతరులచే యివి యుపయోగింపబడియుండును. ఈ విగ్రిహములతయారు చేసిన కళాకారులు, ప్రథమ 5000 సం.ల తుదికాలములో ప్రఖ్యాతిగాంచి యుండవచ్చును. తరువాతకాలములోగూడ స్మశానభూమి కుపయుక్తముగ నుండు యీ విగ్రహములు యుండియుండవచ్చును. వేయిసంవత్సరముల తర్వాత మృతకళేబరములతో వీటిని భూస్థాపనముచేయునాచారము పోయి, దానికిబదులు, బంగారు, వెండి, లోహములకడ్డీలు, కాగితరూపమునచేయ బడినవి పాతివేయబడుచుండెను. పదకొండవశతాబ్దములో సర్వసామాన్య మయిన దహనక్రియలుకూడ దీనికి కొంతవరకు కారణభూతములయియుండ వచ్చును.

అయిదు, ఆరవశతాబ్దములలో రవాణాసౌకర్యములు తక్కువగానుండి నను, సరకులు, వైజ్ఞానికగ్రంథములు, జానపదకథలు, మార్పుకొనబడు చుండెను. వానిలోకొన్ని చైనాలో స్థిరముగ నుండిపోయెను. దేశములోనికి క్రొత్తగా దానిమ్మ, నువ్వులు, నార, ధనియాలు, ఉల్లిపాయలు, పెద్ద చిక్కుడు, దోస మొదలగునవి ప్రవేశపెట్టబడెను. "సొగటాల" ఆట, ఏనుగుచదరంగము, చైనావారియాటలలో చేర్చబడెను. రెండవది హిందూ దేశములో ప్రారంభమై, యక్కడనూ, తూర్పు పడమరదేశములలోనూ, అదేకాలమున వ్యాప్తిజెందెను.

దూరదేశముల యితిహాసవిషయములు చైనాదేశపు కల్పనాకథలను వృద్ధిచేసెను.

# నాలుగవ అధ్యాయము

## పునరైక్యతగాంచిన చైనా

### సుయి - టి - యాంగ్ (590-906)

చిన్నాభిన్నమైన చైనాదేశములో తిరిగి ఐకమత్యమునుగలిగించినకీర్తి యాంగ్ - చి - యన్‌గారికి దక్కినది. మొదట యీయన "చౌ" వంశరాజుల యొద్ద నొక యుద్యోగిగా నుండెను. 581వ సం.లో అప్పుడు రాజ్యమేలు చున్న "బాలుని" తొలగించి తాను "సుయి" రాజ్యమును స్థాపించెను. తరువాత ఆ బాలరాజుని, ఆవంశమున మరి యేబదితొమ్మండుగురు రాకుమారులను చంపెను. కొన్నిసంవత్సరములపిదప "లి-యాంగ్" వంశపు తుది చక్రవర్తిని సింహాసనభ్రష్టునిచేసి "పెద్దగోడ" (Great wall) దగ్గర నుంచి "పెస్కడోర్సు" వరకు (ఫుకియన్‌రాష్ట్రపు దక్షిణసరిహద్దుకు నేరుగా తూర్పుననున్న చిన్నదీవులు) నున్నరాజ్యమును స్వాధీనపరచుకొనెను. 541వ సం. నుంచి తిరుగుబాటులుచేయుచున్న "అన్నాం" రాష్ట్రీయులు 603 సం. లో ఆయనకు లొంగిపోయిరి. 605 సం.లో ఆయనసైన్యము ఆ రాష్ట్రపు రాజధానినగరము "చంపా" ను కొల్లగొట్టెను. అప్పటికి ఆయనరాజ్యము దక్షిణదిశసరిహద్దువరకు వ్యాపించెను. ఈ వంశరాజులు పరిపాలనచేసినది స్వల్పకాలమేయైనను వారిపరిపాలనలో చేయబడిన ప్రజోపయోగకార్యములు (వ్యక్తిస్వాతంత్ర్యపునరుద్ధరణ, అనేక నూతనకల్పనలు) యీ వంశము పిదప వచ్చిన "టి-యాంగ్" వంశీయులచేకూడ ననుసరింపబడెను.

చైనాను జయింపకపూర్వమే 582 సం.లో "యాంగ్-చి-యన్" మధ్యఆసియావ్యవహారములలో జోక్యముగలుగజేసుకొనుచుండెను. తమ యొక్క రాజ్యాధికారవిషయములో తగాదాలుపడుచుండిన తూర్పుతురుష్కుల (టి-యు-చుయె) పై శతృత్వమువహించి, లోగడ వారికి తాబేదారులుగా

మన్న పశ్చిమతుర్కులను ప్రోత్సహించి తిరుగుబాటు లేవదీసెను. అత్యంత క్రూరుడైన పశ్చిమతుర్కినాయకుడు "టార్డు"తూర్పుతుర్కులను కడు సుల భముగా నోడించెను. వెంటనే తన పరిసరప్రాంతములలో నెవరును ఎక్కువ బలవంతులుగాకుండా వారి బలాబలములను(అధికారసమానత్వము) సరిచూచుటకు 585 సం.లో "యాంగ్‌చెయిన్" పశ్చిమతుర్కులతో సఖ్య మును విడనాడెను. చైనాదేశపు అదృష్టమువలన పశ్చిమతుర్కులరాజ్యములో తిరుగుబాట్లు బయలుదేరెను. "టార్డు" 603 సం.లో పదవీభ్రష్టుడగుటచేత నాయనరాజ్యము ఛిన్నాభిన్నమైపోయెను. సూక్ష్మబుద్ధిగల చైనాయేజంటు "పి-యె-చు" (548-627) టాష్కెంట్ రాజధానిగాగలిగిన పశ్చిమకక్షవారిని బలపరిచెను. "లియి" రాజధానిగాగల సామ్రాజ్యపత్యర్ధికక్షనాయకుడు తాను టార్డంతఘనుడుగా కావలెననియెడి తనఆశను వదలి చైనాకు లొంగి పోయెను. తూర్పుతుర్కులనాయకులుకూడ చైనారక్షణనే వాంఛించి, 608వ సం.లో అత్యంత కీలకప్రదేశమగు "హామి"ని చైనావారికి స్వాధీనపరచెను.

ఆసంవత్సరములోనే చైనావారు "పి-యె-చు" నాయకత్వముక్రింద మంగోల్‌తెగకుచెందిన "టి-యు-యుహన్" ను "కాన్సు" నుంచి టిబెట్టు లోనికి తరిమవేసిరి. 607-610 సంవత్సరములమధ్య ఆగ్నేయదిశవైపు తమరాజ్యమును విస్తరింపజేయుప్రయత్నములు తిరిగి ప్రారంభింపబడెను. 610 సం.రములో "కు-ఆంగ్-టంగ్" లోని సైన్యసహాయముతో ఫార్మో జాను స్వాధీనపరచుకొనిరి. 607వ సం.లో యాంగ్-కు-ఆంగ్ తూర్పు యిండీస్‌దీవులకు రాయబారసంఘమును బంపెను. ఉత్తరసరిహద్దువైపు రాజ్య విస్తరణ ఎక్కువ జయప్రదముగా కొనసాగలేదు. ఈనాటి కొరియాదేశ ములో మూడింట రెండుభాగములును, దక్షిణమంచూరియాలో యెక్కువ భాగమును గలిగియుండిన "కోగుర్యో" రాజ్యముపై 598, 614 సంవత్సర ములలో నాలుగుపర్యాయములు దాడిజేసిరి. కాని ప్రతిదాడి నిరర్థకమై వా రాపదలపాలాయిరి. శౌర్యవంతములగు సేనలుగలవను "సుయి" వంశస్థుల కీర్తి తదితరదండయాత్రలవలననే గలిగెను. దూరదేశములనుండి పలు వురు రాయబారులు రాజ్యసభకు వచ్చియుండిరి. చైనాదేశపు రాయబారులు కూడ యిండియా, టుర్కిస్థాన్‌దేశములకు పోయిరి. వారు తిరిగివచ్చునపుడు

సింహములచర్మములు, గోమేధపుకూజాలు, రాతినార, నాట్యకత్తెలు, బౌద్ధ మతసూత్రగ్రంథములను తెచ్చిరి. "హాన్" "సుయి" వంశములమధ్య గడచిన నాలుగుశతాబ్దములలోను క్షీణించిపోయిన చైనాసామ్రాజ్యము మరియొక మారు గొప్పస్థితికి వచ్చుచుండెను.

"సుయి" వంశస్థాపకుడు ఆయనకుమారుడు సుస్థిర ప్రభుత్వమును స్థాపింపజాలకపోయినను, వారు స్వల్పకాలమే పాలించినను వారిచే ప్రారంభింపబడి కొనసాగింపబడిన సంస్కరణలు వారివంశమునకు ఖ్యాతిని గడించెను. దేశపాలనావిధాన మభివృద్ధిగాంచెను. పశ్చిమరాజధాని "చెయాంగ్-ఆన్" నగరములో నాలుగు; తూర్పురాజధానినగరము "లొయాంగ్"లో రెండు ధాన్యపుగిడ్డంగులు కట్టబడెను. ఉత్తరసరిహద్దు పెద్దగోడ(Great Wall) బలిష్టముచేయబడెను.* ఈ కట్టుదిట్టములుచేయుటలో యెందరో మనుజులు మరణించిరి.

574వ సంవత్సరమునుంచి ఉత్తరచైనాలో ననేకహింసలకు గురియైన బౌద్ధమతము తిరిగి రాజాదరణను పొందసాగెను. "సుయి" చక్రవర్తులు వైభవప్రియులు. వారు పసుపునదీప్రాంతముననుండిన రాజధానినగరములను తిరిగి కట్టించుటయేగాక, యాంగ్ట్జిముఖద్వారముననున్న యాంగ్-చౌను మూడవరాజధానిగా నిర్ణయించిరి. రాజధానినగరములమధ్యను, అంతకుమించి కేంద్రమునుండి వాయవ్యప్రాంతమునకు(వారిరాజ్యాధికారములోనున్న గొప్పప్రదేశ మదియే!) నెక్కువగా నాహారపదార్థములను సరఫరాచేయు యాంగ్ట్జిదిగువప్రదేశమునకును, తూర్పుచైనాలోనుండిన కాలువలను పెంపుచేసి, రాకపోకలసౌకర్యములను యేర్పాటుచేసెను. 1600 సం.లో

* 607వ సం.లో మండువేసంగిలో 10లక్షలమందిజనులు 10దినములపాటు పనిజేసిరనియు, వారిలోసగముమంది మరణించిరనియు, "బింగ్-హామ్" చరిత్రకారుడు తెలియజేసెను.

'సుయి' వంశపతనము - టయాంగ్‌వంశప్రారంభము" అను పుస్తకములో 20 పేజీచూడుడు. తమ యజమానులదృష్టినుండి చాలమంది తప్పించుకొనిపోయియుండవచ్చును. అట్టివారినందరను మృతులుగా లెక్కవేసియుండవచ్చును.

చైనాపాలకుడొకడు తానువ్రాసిన గ్రంథములో నున్నదున్నట్లీ విధముగా తెలియచేసెను.

"రెండవ "సుయి" వంశచక్రవర్తి తనవంశీయుల పాలనకాలమును పలుసంవత్సరములపాటు తగ్గింపజేసినను, తనతరువాత రానున్న పదివేలతరముల ప్రజలకు మేలుగలుగు నేర్పాట్లనుచేసెను. ఆయన పరిపాలన కడు నిర్దాక్షిణ్యముగా నుండెను. కాని, ఆయనపాలన శాశ్వతములగు ప్రయోజనములను గల్పించెను. *

584వ సంవత్సరములో కాలువలను త్రవ్వుట ప్రారంభించిరి. 618 సంవత్సరంనాటికి ఉత్తర, దక్షిణసీమలలో "హెయి"నది "హాంగ్_చౌ"ల మధ్యను తూర్పు పశ్చిమసీమలలో "యాంగ్_అన్, "యాంగ్ - చౌ" ల మధ్యను రాకపోకలేర్పాటుచేయబడెను. ఆకాలమునాటి "సంగ్" చరిత్రకారు డొక భాగమునుగురించి యిట్లు వర్ణించెను.

"షాన్‌యాంగ్" నుండి యాంగ్‌ట్జినదివరకును త్రవ్వబడినకాలువ నీటిమట్టపుపై భాగము నలుబదిగజములవెడల్పున నుండెను. కాలువగట్ల కిరుప్రక్కలను రోడ్లువేయబడెను. రోడ్ల కిరుప్రక్కలను చెట్లు నాటబడెను. తూర్పురాజధాని (ప్రస్తుతపు లొయాంగ్) నుండి చి - యాంగ్ - టు (ప్రస్తుత యాంగ్‌చౌ) మధ్యనున 2000 పైగా వీలదూరము రోడ్లపొడుగునా నాటబడిన రెండుప్రక్కలనున్న చెట్లనీడ లొకదానిపై మరొకటి క్రమ్ముకొనుచుండెను. ప్రతి రెండు పోస్టుస్టేషనులమధ్య సామ్రాజ్య విశ్రాంతిభవనములు నిర్మింపబడెను. "చై యాంగ్ - అన్" రాజధానినుండి "చియాంగ్‌టు" వరకు నట్టి విశ్రాంతిభవనములు నలుబదికి మించియుండెను. • ఇన్నిసౌకర్యములనుచేసియు, వాటిని అనుభవించుఅదృష్టమును "సుయి" సామ్రాజ్యాధికారులు పొందజాలకపోయిరి. తమ ప్రభువులయొక్క అసహనము, వారిభోగవిలాసములకుచేయు అమితవ్యయము ప్రజలలో నసం

---

* కీ ఎకనమిక్‌ఏరియాస్ యిన్ చైనీస్ హిస్టరీ. P. 122 "చి" గారిచే అనువదింపబడినది.

• "కీ ఎకనమిక్ ఏరియాస్ ఇన్ చై నీస్‌హిస్టరీ," 117_118 పేజీలలో.

తృప్తిని గలిగించెను. ఆ యసంతృప్తి నానాటికి నెక్కువయై రగిలి మంటలు రేగునంతవరకు హెచ్చిపోయెను.

తూర్పుతురుష్కులఖాన్ కొరియాలో చక్రవర్తికిగలిగిన నపజయములను అనువుగా చూచుకొని దేశములోని చాలభాగమును నిర్మూలనముచేసెను. వాయవ్యప్రాంతములోనున్న "యన్-మెన్" ముట్టడిలో 615 సంవత్సరములో "యాంగ్ - కాంగ్"నే చెరపట్టెను. వెంటనే ప్రజలలో నంతఃకలహములు ప్రారంభమాయెను. యాంగ్ కుటుంబమునకు, తురుష్కులకు వివాహము ద్వారా బంధుత్వము గలిగిన "లి" రాజకుటుంబపు తిరుగుబాటు "సుయి" వంశనాశనమునకు కారణమయ్యెను. 617వ సంవత్సరములో చెయాంగ్-అన్, "లియుఅన్" స్వాధీనమయ్యెను.

టియాంగ్ వంశము

యాంగ్-చౌ రాజధానినగరములోని తన స్వంత సుందరభవనములో "యాంగ్ కు ఆంగ్" హత్యతో "లియుఅన్" "లిషి-మిన్" గార్లచే స్థాపింపబడిన "టియాంగ్" వంశప్రభుత్వము 618 సంవత్సరము యేప్రియల్ 11వ తేదీన ప్రారంభమాయెను, ఆ వంశీయులు మూడుశతాబ్దములకాలము వారిపాలనను కొనసాగించిరి. చైనాదేశచరిత్రలో నాకాల మత్యంత ప్రతిభావంతముగా నెంచబడెను. "సుయి" ప్రభువులచే ప్రారంభింపబడిన నిర్మాణ కార్యములను దేశమంతటను, దేశాంతరములలోనుకూడ కొనసాగించిరి. ప్రారంభములో వారిపాలన విశేషముగా కేంద్రీకరింపబడెను. కాని క్రమముగా 705వ సంవత్సరమునను విశేషముగా 756 వ సంవత్సరమునను కేంద్రీకరణపాలన పోయి నానాటికి వర్ధిల్లుచుండిన స్వాతంత్ర్యతకు దారిచూపెను. విద్యాభ్యాసము ప్రోత్సహింపబడెను. దేశప్రభుత్వపుటుద్యోగులకు పరీక్షలు తిరిగి ప్రవేశపెట్టబడెను. దేశములో చెలరేగిన నంతఃకలహములకాలములో వదలివేయబడిన భూములు తిరిగి పంపిణీచేయబడెను. కన్ఫ్యూషియన్ మతస్థాపనకు ప్రతిడిపార్టుమెంటులోనూ, ప్రతిజిల్లాలోనూ దేవళములు నిర్మింపబడి ఆ అధికారమతము పోషింపబడెను. అయినను పరమతసహనము విస్తరించియుండెను.

రాజధానినగరము "చి-యాంగ్-అన్" అన్యమతావలంబనకు, సర్వ

సమానత్వమునకు కేంద్రస్థానమాయెను. అప్పటికి వుండిన కాలువ లభివృద్ధి చేయబడుటయేగాక, క్రొత్తకాలువలుకూడ త్రవ్వబడెను. "సుయి" చక్రవర్తులనాటి కఠినశాసనములు తిరిగి చట్టబద్ధముచేయబడెను *

టి - యాంగ్‌న్యాయచట్టము 653 సం.లో ప్రకటింపబడియుండవచ్చును. ఆ న్యాయచట్టము విస్తరింపబడినకూర్పు 737 సంవత్సరములో ప్రచురింపబడెను. అన్నాం, జపానుదేశములలోని ప్రాచీన శాసననిర్మాతలలో గొప్పయుత్తేజమును గలిగించెను.

ఈ వంశప్రభువుల ప్రారంభదశలో తుర్కులు దాడిజేయుటకు యత్నించిరి. ఆ దాడులను జయప్రదముగా నెదిరించి, వారలను 630 సంవత్సరములో మంగోలియాదేశములోనికి తరిమివేసి, అచట తుర్కులశత్రువులతో సఖ్యముచేసుకొని, వారిసహాయముతో యీ తుర్కులను స్వాధీనపరచుకొనెను. ఈ గర్భశత్రువు "చె - యాంగ్ - అన్"కు 682 వ సంవత్సరమువరకు లొంగియుండెను. చైనాచక్రవర్తి "లి-షి-మిన్" పరిసరప్రాంతీయతెగలకు గొప్ప ఖాన్‌గా కూడ నుండుటచే, చక్రవర్తిగాను, ఖాన్‌గాను అధికారమును చలాయించుటకు అనుభవమును గలిగియుండెను.

630 మొదలు 650 వరకు పాలనచేసిన "స్రోన్_టకన్_స్గాన్‌పొ" యను రాజు చైనారాకుమార్తెను తనకు వివాహముచేయమని కోరెను. మొదట ఆయన దానికి అంగీకరింపలేదు. కాని 641 వ సంవత్సరములో టిబెట్టునుంచి వచ్చిన దండయాత్ర నోడించినపిదప నందుల కంగీకరించెను. 646 సంవత్సరములో రెండురాజ్యములమధ్యను రాజకీయసంబంధములను వృద్ధిచేసుకొనుటకు మగధకు రాయబారి నంపెను. ఆయన తిరిగిరాగానే సింహాసనము నొకడు స్వాధీనపరచుకొనుటకు యత్నించుచుండినసంగతిని తెలుసుకొని, వానిని పట్టుకొని 648 సంవత్సరములో "చియాంగ్-అన్"కు తీసికొనిపోయెను.

"కోగుర్యో"కు యీశాన్యప్రాంతపరిసరములలో మాత్రమే "లి-షి-మిన్" యపజయమును పొందెను. 660 సంవత్సరములో కొరియాలో ప్రబలు

* 92 అపరాధులకు విధించబడిన మరణశిక్ష ద్వీపాంతరవాసశిక్షగా మార్చబడెను.

చున్న అనైక్యతను యుపయోగించుకొని "లీ"కి తరువాత సింహాసనమునకు వచ్చిన రాజు కొరియాలోని విశేషప్రదేశమునందేగాక మంచూరియాలోని "కోగుర్యో" లోకూడ చైనాప్రభుత్వమును స్థాపించెను. మొదట "ప్యాంగ్-యాంగ్" లోను తరువాత "లియాటంగ్"లో నుపరాజధానుల నేర్పాటుచేసి అచట గవర్నరుజనరలులను నధిపతులుగా నియమించెను. తదితర ముఖ్యయుద్యోగములన్నిటికిని కొరియాదేశీయులనే నియమించెను.

90 సంవత్సరములపాటు అనగా 758 వ సంవత్సరమువరకు నిలిచి యుండిన యీ అధీనరాజ్యము వర్ధిల్లుచుండిన వ్యాపారమునకు, విజ్ఞానమునకు సహాయకారిగా నుండెను.

ఇతరచోట్ల కూడ యీ చక్రవర్తి యుద్ధములలో సమానజయమును గాంచెను. 663 సం.లో "ప్యాక్చి"ని స్వాధీనపరచుకొనుటకు పంపబడిన సైనికోద్యోగి 667 సంవత్సరములో పశ్చిమతుర్కులనోడించి చెల్లాచెదరుగా తరిమివేసెను. పామీర్ పర్వతములకు పశ్చిమమునన్న రాజ్యములతో రాజకీయసఖ్యము నేర్పాటుచేసుకొని, తుది సస్సానిద్ ప్రభువునకు ఆయనకుమారునకు తనదర్బారులోనే నాశ్రయమిచ్చెను.

ఇన్నివిజయములను సాధించియు, 663 సం.రము మొదలు తరువాత శతాబ్దములో సగమువరకు యీయన టిబెట్టు, తుర్కిదేశీయులవలన ననేక అపజయములను పొందెను. అయినను వారిప్రతిభ యెక్కువగానే యుండెను. పరిష్యారా జీయన ఆస్థానమునకు పదిమందిరాయబారులను పంపెను. సింధులోయప్రదేశములోని హిందూరాకుమారులు చైనాఅధిపత్యము నంగీకరించిరి. ఆసియాలోని అనేకరాజ్యములనుంచి "చాంగ్అన్"కు రాయబారులు గుంపులుగుంపులుగా వచ్చిరి.

"సు అన్ సింగ్" ప్రభుత్వములో సుస్థిరసామ్రాజ్యలక్షణము లుండినను, అవలక్షణములుకూడ లేకపోలేదు. "లియో"లో చైనావారిప్రాబల్యమును మంచూరియాలోని ఖైతానులు కూలద్రోయుచుండిరి. 749సంవత్సరము తరువాత మంగోలియా "యుగర్" తుర్కుల ఆధిపత్యములో ట్యాంగ్ చైనాతోసమానమైన ఉచ్ఛస్థితిలోనుండెను. అరబ్బులు ముస్లింనాయకత్వము క్రింద విజృంభించి, తుర్కిస్థాన్ పశ్చిమప్రాంతమున చైనావారిఅధికారము

నంగీకరింపకుండిరి. నైఋతిప్రాంతములోని "తాహి" రాజ్యములుకూడ "చెం-యాంగ్-టు"లోని చైనారాజ్యమునే ధిక్కరించుచుండిరి. టిబెట్టువారు పామీర్ పర్వతములలోని ముఖ్యమైన కనుమలమార్గములను స్వాధీనపరచుకొని చైనాకు యిరాన్‌కుమధ్య రాకపోకల నవరోధించిరి. "సుయాన్ సంగ్"తన వైస్రాయి "కా-సియాన్-చి"ని ఆ కనుమలను తిరిగి స్వాధీన పరచుకొమ్మని నియమించెను. 747 సంవత్సరములో నాయన టిబెట్టుపై గొప్ప దాడిచేసి వారిని పూర్తిగా నోడించెను.

కాని "కా-సియాన్-చి" తాష్కెంటురాకుమారునిపై దాడిచేయుటలో తనశక్తికిమీరిన సాహసముజేసెను. అరబ్బులు తాష్కెంటురాకుమారుని సహాయమునకు పోయి, 751 సంవత్సరము జూలై నెలలో తాలాస్‌నదియొద్ద జరిగిన గొప్ప రణరంగములో "కావ్"ను పూర్తిగా నోడించిరి. ఈవిధముగా తుర్కిస్తాన్ చైనాఅధికారమునుండి వైదొలగి, స్వాతంత్ర్యమునుపొందుటయేగాక బౌద్ధమతస్థానములను తొలగించి, వాటిస్థానే పాశ్చాత్యమతములు - వాటిలో ముఖ్యముగా, యిస్లాంమతములను ప్రవేశపెట్టిరి. టాంగ్ చైనా తమకంటె యెక్కువ సామర్థ్యముగల నరబ్బులను నెదుర్కొనవలసివచ్చెను.

పైన వివరించినట్లుగా ఉత్తరమున ఖైతానుచేతను దక్షిణమున తాయిచేతను నోడిపోవుచుండిన తమసైన్యములను కేంద్రీకరించుటకు చైనా కవకాశములేకపోయెను. రాజ్యాంతము కడువేగముతో సమీపించుచుండెను. దానికితోడు 755 సంవత్సరములో రాజధానిలో నంతఃకలహములు ప్రారంభమాయెను. మధ్యఆసియాలో "కో" లేక "తుంగన్" తెగకుచెందిన నొక సాహసికుడీ అంతఃకలహములకు నాయకుడు. 756 సంవత్సరములో సింహాసనమును తనపుత్రునికొప్పగించి చక్రవర్తి "చాంగ్-టు"కు పారిపోయెను. 757లో ఆయన "చాంగ్-అన్"ను స్వాధీనపర్చుకొనెను. ఈ తిరుగుబాటు 763వ సంవత్సరమువరకు కొనసాగెను. జనబలము, రాజ్యము, ఐశ్వర్యము, ఖ్యాతులను గోల్పోయి చైనా క్రుంగిపోయెను.

తరువాత పై శతాబ్దములో చైనారాజ్యము క్రమక్రమముగా క్షీణించి ప్రారంభస్థితిని పొందెను. పైనుంచి దిగువవరకు నడచుచున్న దుష్పరి

పాలన దేశస్థితిని పూర్తిగా తారుమారుచేసెను. 875 సంవత్సరములో షాన్-టంగ్‌లో తిరుగుబాటుబయలుదేరి చైనాదేశమంతటిలోను వ్యాపించెను. 876 మొదలు 877 సంవత్సరములో "హాయి"నదీముఖద్వారము, హోనాన్‌రాష్ట్రములు కొల్లగొట్టబడెను. 878 సంవత్సరములో తిరుగుబాటుదారులనాయకుడు "హాంయాంగ్-చౌ" "ఫూకెన్" రాష్ట్రము నాక్రమించుకొనెను. సామ్రాజ్యమునకు మరియొకవైపున "షాన్సీ"లో నల్లరులు బయలుదేరెను. 879 సంవత్సరములో క్యాంటన్‌నగరము ధ్వంసనుచేయబడెను. హాంయాంగ్ వెంటనే ఉత్తరమునకు పోయి "లొయాంగ్" "చి-యాంగ్-అన్" నగరములను కొల్లగొట్టెను. స్వల్పకాలము తానే చక్రవర్తియని ప్రకటించుకొనెను. 884 సంవత్సరములో తిరుగుబాటు అణచివేయబడెను. కాని సామ్రాజ్యము దక్కలేదు. 883 సం.లో "కియాంగ్-సు" 891లో "జక్చు ఆన్" 906లో రాజధాని నగరము జారిపోయెను. పోటీనాయకులలో బయలుదేరిన నంతులేని స్పర్థలు టియాంగ్‌వంశపాలనకు స్వస్తిచెప్పెను.

### సుయి-ట్యాంగ్‌పాలననాటి మతము-సంస్కృతిస్థితి

హాన్‌వంశరాజులపాలనలో తప్ప మిగతాకాలములలోని మతచరిత్ర తత్పూర్వమువలెనే నానావిధ విభేదములతో కూడియుండెను. బౌద్ధమతము, టాయిమతము ఉచ్ఛస్థితిలో నుండెను. పశ్చిమదేశములనుండి అనేకమతములు యీ దేశములో ప్రవేశించెను. తన అభివృద్ధికై ప్రత్యేకముగా శిక్షితులగు ఉద్యోగులపై ఆధారపడియుండిన నిరంకుశప్రభుత్వపుటాదరణతో కన్ఫూషియన్‌మతము వర్థిల్లుచుండెను. మతప్రాముఖ్యతను తొలగించి, లౌకికపుసూత్రములపై పరిపాలన జరుపబడుటవలనను, చైనావారిమతమునకు జెందని (బౌద్ధమతముతోసహా) అసంఖ్యాకులగు స్త్రీపురుషసన్యాసులను హత్యచేయుటవలనను, వారిపుణ్యక్షేత్రములను నిర్మూలనముచేయుటవలనను వారిమతగ్రంథములను బహిరంగముగా తగులపెట్టుటవలనను, ఆకాలములో చైనాలో పరమతసహనము 842 మొదలు 845 వ సంవత్సరమువరకు కుంటువడెను. ఈ పద్ధతి బౌద్ధమతమును నశింపచేయజాలకపోయినను, కొంతవరకు ఆ మతఔన్నత్యము నరికట్టగలిగెను. తక్కినమతముల సంపూర్ణముగా నంతమందించెను.

సుయివంశరాజులపాలనలో బౌద్ధ టాయిమతములు రెండునూ ప్రభుత్వాదరణను సమానముగా పొందియుండెను. కాని ట్యాంగు అధికారము నకురాగానే బౌద్ధమత మణచివేయబడినట్లు గాన్పించెను.

పదిఅధ్యాయములుగలిగిన నొక ప్రత్యేకగ్రంథముద్వారా బౌద్ధమతముపై "ఫూయి"చేసిన విమర్శను బౌద్ధమతాచార్యులు ఖండించిరి. ఆ ప్రత్యేక గ్రంథము "త్రిపిటక" లో భద్రపరచబడియున్నది. కాని, యీవంశమునకు చెందిన రెండవచక్రవర్తి యిచ్చిన యుత్తరువులో బౌద్ధమతమువలన తన రాజ్యమున కెంతటి ఆర్థికనష్టము గలుగుచున్నదో తేటతెల్లముగా వివరించెను. నిర్బంధసేవకావృత్తిని తప్పించుకొనుటకు సోమరులు, నిర్వ్యాపారులు బౌద్ధమతము నవలంబించుచుండిరనియు, నవలంబించియు వా రైహిక సుఖముల ననుభవించుట మానలేదనియు, ధనార్జనకై పాటుపడుచుండిరనియు వివరింపబడెను గ్రామములవెంట తిరుగుచు, మార్కెటులలో వ్యాపారముచేయుచు, భూమిని సేకరించి వ్యవసాయముచేయుచు, సరుకులను కూడబెట్టుచు, నేతనేయుచుండిరని తెలియచేయబడెను. వారి వృత్తి వ్యాపారములు, నడవడిక యితరసామాన్యజనులమాదిరిగానే యుండెను. వారిప్రవర్తన మతనియమములను గాని, సాధారణ వ్యక్తినియమములనుగాని అనువర్తించకుండెను.* బౌద్ధయాత్రీకుడు సు-ఆన్-సాంగ్ 729 సంవత్సరములో "చాంగ్_అన్" ను రహస్యముగా వదలి యిండియాకు పోవలసివచ్చునంతటి యొత్తిడిని ప్రభుత్వము గలిగించెను. కాని, ఆయన ఇండియానుంచి చైనాకు 645 ఏప్రియలులో తిరిగి వచ్చునాటికి తీవ్ర విరోధభావము తొలగిపోయెను. తనరాజ్యముపై సంపూర్ణ అధికారమును పొందిన "లి_షి_మిన్" యితరమతములన్నిటిని సమదృష్టితో జూచుచుండెను.

ఇండియానుంచి తిరిగివచ్చుచున్న "సు-ఆన్-సాంగ్"ను "చాంగ్"

---

* ఈ ప్రమాణములో ఉదహారణము "చియు-ట్యాంగ్ షు" గ్రంథములో 1వ అధ్యాయము 14_15 పేజీలనుండి అనువదించి, "న్యూ లైట్ ఆన్ చైనీస్‌సొసైటీ" అను గ్రంథములో 32-33 పేజీలలో డాక్టరు కె. ఏ. విట్ ఫోజెల్‌గారిచే వ్రాయబడినది.

అన్"లో గవర్నరుగారినీ, "లొయాంగ్" రాజధానినగరములో చక్రవర్తి గారు నాహ్వానించి యాదరించిరి. అధికారవైఖరి అప్పుడప్పుడు కొంత మార్పులకు లోనగుచుండినను పై శతాబ్దములో బౌద్ధమతవ్యాప్తి కెట్టి యవరోధములను గలుగలేదు.

714 వ సంవత్సరములో పన్నెండువందలమంది బౌద్ధమతసన్యాసులు సన్యాసినులు మతప్రచారసంఘమునుండి తొలగింపబడిరి. నూతన దేవళముల నిర్మాణము నూతనవిగ్రహముల ప్రతిష్ఠాపన, బౌద్ధమత గ్రంథములకు అనుకరణము నిషేధింపబడెను. ఉన్నతవంశస్థు లెవరును బౌద్ధులతోగాని టాయిస్టులతోగాని నెట్టిసంబంధములను కలిగియుండరాదని యాజ్ఞాపింపబడిరి. కాని బౌద్ధమతసంస్థల ప్రాబల్యము, ప్రజాదరణ విశేషముగానుండినట్లు సమకాలికగ్రంథములు, పురాతనవస్తుశాస్త్రము ధ్రువపరచుచుండెను. భూ సముద్రమార్గములద్వారా పుణ్యక్షేత్రములకు బౌద్ధయాత్రికులు సాహసించి పోవుచుండిరి. "హూయాన్స్యట్సాంగ్"కు తరువాతవచ్చిన ప్రముఖ యాత్రికుడు "ఇ-చింగ్". ఆయన 671 సంవత్సరముమొదలు 690 వరకు ఇండియా గాంధార, కాశ్మీరదేశములలో గడపెను. అప్పటికి వాడుకలోనున్న అయోమయవ్రాతపద్ధతికి బదులుగా సంస్కృత అక్షరముల కనుకరణములను తయారుచేయుపద్ధతిని కనుగొనెను. సంస్కృతగ్రంథములను అవలంబింప మొదలిడెను.

689-695 సంవత్సరముల మధ్యకాలములో చే-బింగ్. సుమారు వేయిమాటలుగల సంస్కృత-చైనీయనిఘంటువును రచించెను "కూ-చా" దేశ మతబోధకుడు "లి-యన్" (706-789) సంవత్సరములమధ్యకాలములో పన్నెండువందలమాటలుగల చైనా-సంస్కృతభాష నిఘంటువును తయారు చేసెను. చక్రవర్తికోరికననుసరించి "లి-యన్" మందులు, మూలికలను గురించి వ్రాయబడిన సంస్కృత వైద్యగ్రంథమును అనువదించెను. విద్యార్థులు ప్రత్యేకంగా జపానువారు చైనా అధ్యాపకులవద్ద విద్యనభ్యసించుటకు వచ్చిరి. దేవాలయనిర్మాణము; మందిరములఅలంకరణ, వేదములకనువాదము వాటికి నకళ్ళను తయారుచేయుట మొదలగుపనులు చురుకుగాజరుగుచుండెను. ఈ పనులకగు యావద్వ్యయము దేశీయయాత్రికులేగాక విదేశబాటసారులు,

ప్రతులుకూడ భరించుచుండిరి.* దేశీయ మత భక్తిగీతములు విశేషముగా నభివృద్ధిగాంచుచుండెను.

జ్యోతిషశాస్త్రము, గణితశాస్త్రములు హిందూపండితుల ప్రోత్సాహముతో సత్వరాభివృద్ధిని గాంచుచుండెను. 618 వ సంవత్సరములో ప్రథమ "టి-యాంగ్" చక్రవర్తి యుపయోగార్థ మొక భారతీయునిచే పంచాంగ మొకటి వ్రాయబడెను. ఒకశతాబ్దానంతరమున సుభాకరసింహ వజ్రబోధిలకు శిష్యుడు చైనామతాచార్యుడు నగు "ఈ-సింగ్" (683-747) సౌర్యమాన సంవత్సర కాలపరిమితి 365-2444 రోజులనియు, సౌర్యమాన మాసకాల పరిమితి 29-53059 దినములకు సమానమనియు నిర్ణయించెను. ఈ గణితముపై నాధారపడియుండిన నాయన నూతనపంచాంగము 729 వ సంవత్సరములో ప్రభుత్వ మవలంబించెను. బౌద్ధమతప్రచారములో వైద్యశాస్త్రము ప్రముఖస్థానమును పొందెను. బౌద్ధదేవళములలో వైద్యశాల లేర్పాటు చేయబడెను. ఈ వైద్యశాస్త్రము నభ్యసించుటకు ప్రత్యేకముగా నిర్ణయింపబడిన కొందరు యువకసన్యాసు లప్పుడప్పుడు "చ్యాంగ్-అన్"కు పంపబడుచుండిరి.

అత్యంత వ్యాప్తిజెందిన బౌద్ధమతసమాజములో దుర్నీతి యుండక తప్పలేదు. ప్రభుత్వములో నెక్కువ పలుకుబడిగల టాయిస్టు లా లోపములను వెంటనే గమనించి ఆ దుస్థితిని వెల్లడిజేయుచుండిరి. దీనికంటె ముఖ్యమైనవిషయము మరొకదానిని ప్రభుత్వము గుర్తించిరి. ఈ సామ్రాజ్యములో బౌద్ధమతసమాజ సామ్రాజ్యమొకటి విస్తరించుచున్నదనియు, దానిని ప్రభుత్వ మదుపులోనికి తేజాలకపోయినచో అసలు సామ్రాజ్యమునకే విచ్ఛిత్తి

* 839 వ సంవత్సరములో తాను "యాంగ్-చౌ"లో నుండగా, దేవళపు వసారా మరమ్మతుచేయుటకు సహాయమర్థించుచు, తనయొద్దకు వచ్చి, ఆ మరమ్మతులకు పది మిల్లియనుల ధన మవసరమనియు, రాష్ట్రమంత్రి, నగరములోని పరిష్యన్ పటాలము చెరియొక మిల్లియనులు యిచ్చిరనియు చంపావాస్తవ్యుడొకడు 2 లక్షలు చందాగా నిచ్చెననియు, జపానునుంచి వచ్చిన తాము యేబదివేలు యివ్వవలెననియు, తన నర్థించెనని జపానుదేశ యాత్రికుడు "ఎన్నిన్" వ్రాసెను.

గలుగవచ్చుననియు నిరంకుశసామ్రాజ్య ప్రభుత్వనాయకులు గుర్తించిరి. ఈ భావము బలవత్తరముకాగా ప్రభుత్వము వీరిపై చర్యతీసుకొనిరి బౌద్ధ మతావలంబకులజనాభా, వారి ఆస్తిపాస్తులలెక్కలు తీసుకొనుటకు నిర్ణయించిరి. 845 సంవత్సరపు నాలుగవమాసములో జనాభాలెక్కలు తయారు చేయబడెను. మూడుమాసములపిదప చైనాదేశమంతటిలోనున్న బౌద్ధమతస్థుల యావదాస్తులను ప్రభుత్వము స్వాధీనపరచుకొనెను. ఆ సంవత్సరమే 8 వ మాసములో చక్రవర్తి యీ దిగువ వివరింపబడిన విధముగా నుత్తరువులను జారీచేసెను.

"4600 దేవాలయములు నిర్మూలింపబడవలెననియు; 260500 భిక్షుకులు మతమునుండి తొలగింపబడవలెననియు, ఇకముందు వారందరు రెండు సంవత్సరముల కొకమారు ప్రభుత్వమునకు పన్నులు చెల్లింపవలెననియు, సాగుచేయుటకు లాయకైన లక్షలాదియకరములభూమి ప్రభుత్వవశము చేయబడవలెననియు, నిర్బంధ దాస్యవిమోచనముగాంచిన 1,50,000 బానిసలు (స్త్రీ పురుషులు) యిప్పటినుంచి ప్రతి రెండుసంవత్సరముల కొకమారు పన్నులు చెల్లింపవలెననియు, సన్యాసులు, సన్యాసినులు విదేశ వ్యవహారశాఖ అధికారవర్గమువారి అధీనములో నుండవలెననియు, నెస్టొరు, పార్శీమతము మొదలగు విదేశమతప్రచారకులు, యింతటినుంచియైనను చైనా ఆచారములను అపరిశుద్ధముచేయకుండాయుండుటకు, వెంటనే మతప్రచారమును వదలి సామాన్యజీవితములను అవలంబింపవలెననియు నాజ్ఞాపించుచున్నా"మని ప్రకటింపబడెను.*

ప్రభుత్వమునకు విజయము సిద్ధించెను. ఈ యుత్తరువులు పరదేశ మతవ్యాప్తిని సంపూర్ణముగా నంతమందించెను. కాని యిప్పటికే చైనామతముగా అంగీకరింపబడిన బౌద్ధమతము నశించకపోయినను, అంతవరకు పొందిన పారమార్థిక, వైజ్ఞానికఖ్యాతిని తిరిగి పొందజాలకపోయెను.

* రాజధానినగరమునకు కడుదూరముగానుండిన "జచుమన్" వంటి ప్రదేశములలోని బౌద్ధమఠముల కీ యుత్తరువులు వర్తింపబడలేదని యిటీవలనే చైనావిద్వాంసులచే చేయబడిన పరిశోధనలవలన తెలియుచున్నది.

రెండున్నర శతాబ్దములుగా బౌద్ధమతప్రాచ్యజ్యోతిగా వెలిగిన చైనా యితర దేశములలో నిందుమూలముగా తనప్రజ్వలతేజమును పోగొట్టుకొనెను.

చైనాలో నీకాలమున ప్రవేశించిన విదేశమతములలో పార్శీమతము మొదటిదిగా చైనాగ్రంథములలో నుదహరింపబడెను. తమకు పశ్చిమమున నున్న (పరిష్యా అయియుండవచ్చును) ప్రజల ఆదరణను పొందుటకు, ఉత్తర "చి-యి" ఉత్తర "చౌ" రాజ్యముల ప్రభువులు చాలమందీ మతము నవలంబించి వారి కర్మకాండ వైదీక మతైక నృత్యములలో పాల్గొనుచుండిరి. 621 వ సంవత్సరములో "టి-యాంగ్" మతవిషయముల నదుపులో నుంచుట కేర్పాటుచేయబడిన ప్రభుత్వశాఖను పునరుద్ధరించెను. చైనాలో నివసించుచున్న విదేశీయు లీ మతముల నవలంబించుట కనుమతింపబడిరి. కాని చైనాదేశస్థు లా మతములను స్వీకరింపరాదు. పార్శీమతస్థులు క్రైస్తవ మతమును స్వీకరించుట కెట్టిప్రయత్నములు చేయలేదు. 849 సంవత్సరంలో జారీచేయబడిన నిషేధపుటుత్తరువులు యీ మతజీవితము నంతమొందించెను. కాని యీ మతము 12 వ శతాబ్దమువరకు "చిన్-కి-యాంగ్" "కెయిఫెంగ్"లో మాత్రము నామమాత్రావశేషముగాయుండెను.

తరువాత చైనాదేశములో ప్రవేశించినమతము క్రైస్తవమతములోని నెస్టోరియన్‌శాఖ. దీనిని చైనాదేశస్థులు ("లుమినస్") తేజోవంతమైన మతమని పిలుచుచుండిరి. తెలిసినంతటిలో మొదటిప్రచారసంఘము సిరియా (లేక పరిష్యా) నుండి వచ్చి, రాజధానినగరములో 635 సం. లో స్థిరపడెను. * తరువాత మూడుసంవత్సరములకు ప్రభుత్వ మీమతము నాశీర్వదించెను. ఈ మతము రాజధానినగరములోనేగాక వెలుపలిప్రదేశములలో కూడ వ్యాప్తిజెందెను. "లొయాంగ్" "చెంగ్-టు" "క్యాంటన్" యింకా మరికొన్నిప్రాంతములలో దీనినిగురించి వ్రాయబడియుండెను. 845 వ సంవత్సరములో యీ మతము నిర్దాక్షిణ్యముగా నణచివేయబడుటచే పదకొండు,

---

* నెస్టోరియన్‌కుటుంబమొకటి 578 వ సంవత్సరములో "కాన్సు"కు వచ్చెనని పి. వి. సెయికీ తెలియజేసెను.

"నెస్టోరియన్ డాక్యుమెంట్సు అండ్ రెలిక్సు యిన్ చైనా" అను గ్రంథములోని 86 వ పేజీ చూడుడు.

పన్నెండు శతాబ్దములనాటికి దీని * విషయమై తెలుపు సాధారములుకూడ లేకుండాపోయెను. చైనాలో కాలానుగుణ్యముగా ప్రవేశించిన మూడవ మతము "మణికెయిజం". ఈమతమును "బాబిలోను" దేశవాసి మణియను నతడు (216-276) స్థాపించెను. ఇది అన్నిమతములలోనుండి వాస్తవిక సిద్ధాంతములను చేర్చిన మతము. 694 వ సంవత్సరములో పరిష్యనులు మొదలగువారిచే చైనాలో నీమతము ప్రవేశపెట్టబడెను. చైనామిత్రరాజ్యమైన "యుగర్ కాఘన్" యీమతమును స్వీకరించునంతవరకు చైనాలో దీనిస్థితి క్లిష్టముగానేయుండెను. తిరుగుబాటుదారులయొద్దనుండి "లొయాంగ్"ను స్వాధీనపరచుకొనినసంవత్సరానంతరము 763వ సంవత్సరములో నీ మతము ప్రభుత్వామోదమునుపొంది ప్రజామతముగా ప్రకటింపబడెను. "బాబిలోనియా"లోనుండిన నీ మతస్థాపకు డీ మతమును ప్రచారముచేయుటకు మంగోలియన్ ప్రచారకులను పంపెను. "యుగుర్" రాజుసహాయముతో నీ మతము "టియాంగ్" రాజధానినగరములో నుండి "యాంగ్ట్జ" నదీ లోయలోని నగరములకును తదితరప్రాంతములకును వ్యాపించెను. "టియాంగ్" చైనాతోనుండు సమానహోదాను "యుగర్" కోలుపోయినప్పటినుండి మణిక్యనుమతము క్షీణించిపోయెను. నిషేధింపబడిన యీమతము, తదితరమతములలో తనస్థానమును పోగొట్టుకొనినను ఒక రహస్య సంఘముగా దానిఅవశేషము లేదవశతాబ్దప్రారంభమువరకును గన్పట్టుచుండెను. ఆ మతములోని మనోరంజకములగు సిద్ధాంతముల నా మత జ్యోతిషశాస్త్రపండితులు వెల్లడిజేయుచుండిరి. సోగ్డియన్-మణిక్యనులు ఏడు దినములవారమును (సప్తగ్రహములపేరిట) నిర్మాణముజేసినట్లు 764 వ సంవత్సరమునాటి రికార్డువ్రాతలు ధృవపరచుచున్నవి. వారములపేర్లు క్రమానుసారముగా చైనా, యిండియా, పరిష్యా, సోగ్డియన్ దేశగ్రహముల పేర్ల ననుసరించియేయుండెను.

చైనాలో యీ అన్యమతములనుగురించి మన మెంత శ్రద్ధతో గమ

* ఈకాలములో "లియో" సామ్రాజ్యములో కొందరు నెస్టోరియన్ క్రిష్టియను లుండిరి. (See) Ryuro Torei sculptured stones of the Lio dynasty అను గ్రంథములోని 60-61 పేజీలు.

పించినను, బౌద్ధమతమువినహా తక్కిన మతములకంటెను టాయిజం, కన్ఫూషియానిజమ్ మతము లెక్కువగా ప్రజాదరణమును పొందెననువిష యమును మనము మరువరాదు. టాయిజమును ప్రోత్సహించుటకు "టి" వంశప్రభువులకు సంకల్పసిద్ధములగు హేతువులుండెను. కాని ఆ వంశము లోని చాలమంది ప్రభువులు రాజమతమునకు లొంగిపోయి, దానికే యెక్కువ ప్రాముఖ్యతనిచ్చిరి. సామ్రాజ్యమంతటిలోను పరిపాలనావ్యవహార ములను రాజభక్తితో నిర్వర్తించుటకు కావలసిన రాజకీయోద్యోగులను తయారుచేయుతలంపే దీనికి కారణము. అప్పటి ప్రభువులకు సైనికబలము గాని, వంశపరంపరాముగతమైన హక్కుగాని లేనికారణముచే వారికి సలహా సహాయ సంపదల కీ యుద్యోగులే ఆధారముగా నుండిరి

తమ పూర్వాచార పాలనవిధులను, ఆకాలపునాటి భావములను, సాంప్రదాయములను ఇంకను కొనసాగించుటకుయత్నించుట, బీదలను తృణీ కరించి హింసించు ఐశ్వర్యవంతులతో సంబంధములు గలిగియుండుట మొద లగు అకృత్యములే వారికి వాడుచేసుకొనిన అపకారములు. టింహాంగ్‌లోను, చైనాలోను చురుకుగా పనిచేయుచుండిన ప్రభుత్వోద్యోగులు భూములపై నుండి వచ్చు నాదాయముపై జీవించుచు నైశ్వర్యవంతులకుటుంబములకు జెంది ఒక ప్రత్యేకతరగతిగా నుండిరి. తక్కిన సామాన్యజనానీకపు మొరలను ప్రభువులాలకించినంతవరకు నంతయు సవ్యముగానే నడచెను. రెండుకక్షల బలాబలములు సమానముగా నుండెను. కాని ఒక పక్షమువా రత్యంత బల వంతులైనప్పు డీ పద్ధతి పనిచేయక నిలచిపోయెను.

రెండవచక్రవర్తియొక్క పరిపాలన, నిర్ణయానుగతసంస్థకు సరియైన నిదర్శనము. ఆయన టాయిజంపట్ల వ్యక్తిగతాభిమానముగలవా డయినను బౌద్ధమతము (675) నాదరించి గౌరవించెను. కన్ఫూషియన్ మతమును పునరుద్ధరించుటకు తన శక్తికొలది ప్రయత్నించెను. ఆయనపాలనలో నుద్యోగఅర్హతను పొందుటకుముందు నిర్ణీతపరీక్షలలో నుత్తీర్ణుడగుట తప్పని సరిగా నిర్ణయింపబడెను. రాజధానినగరములో పుస్తకభాండాగారమును ననేక కళాశాలలను స్థాపించి, దేశమంతటిలోను పాఠశాలలస్థాపనను

ప్రోత్సహించెను. * 630 సంవత్సరములో కన్ఫూషియన్ పేరిట దేశమంత టను దేవళములు నిర్మింపబడవలెననియు, ప్రభుత్వోద్యోగులు బలిహరణ ములు సమర్పింపవలెననియు ప్రకటించెను. పదిసంవత్సరముల పిదప నా ఋషికి తానే బలిఅయెను. 647 సంవత్సరములో కన్ఫూషియన్ మత మతాధిపతులలో యిరువదియిద్దరు ప్రముఖుల స్మృతిచిహ్నముగా రాతిపలక లను యీ దేవళములలో స్థాపించవలెనని యాజ్ఞాపించెను. 754 లో "సు అన్-సంగ్" చక్రవర్తిపతనమునకు పూర్వము "హాన్-లిన్" అను పేరిట నొక విద్వత్సభను స్థాపించెను. 19 వ శతాబ్దమువరకు యీ మత వ్యాప్తిని పెంపొందించుట కీ విద్వత్సభ పాటుపడెను. ఆనాటి సమర్థులగు విద్వాంసులెల్లరునుగల యీ సభ ప్రభుత్వ సారస్వతవ్యవహారభారమును వహించియుండెను. వీరికాలములో కన్ఫూషియన్ మతము చైనాదేశములో బలవత్తరమై చైనాసంస్కృతి నవలంబించిన కొరియా, జపానులలోకూడ వ్యాప్తిగాంచెను.

రాజ్యసభలోని కొందరు టాయిస్టుసలహాదారులు గొప్పపలుకుబడి గలిగియుండిరి. మూఢభక్తిగలిగిన చాలమందినాయకులు చిరంజీవత్వమును గలిగించు "సంజీవిఓషధి" అన్వేషణకు కొందరు రసవాదులను ప్రోత్స హించుచుండిరి. కన్ఫూషియన్ అధికారులు దీనిని తీవ్రముగా నిరసించిరి. నేటికిని నిలచియున్న వ్యావహారికగ్రంథములు టాయిజంమతమును నిర్దాక్షి ణ్యముగా విమర్శించుచు వ్రాసియుండినందున టాయిజముయొక్క నిజస్థితిని తెలుపుట సులభసాధ్యముగానుండెను. అగోచరమగు ఆముష్మికవిషయము లను, ప్రకృతిసౌందర్యమునారాధించు టాయిజపుమతము చిత్రకారులకు కవి సత్తములకు ప్రత్యేకోద్రేకమును గలిగించెననుటలో యెట్టి అతిశయోక్తి

---

* టియాంగ్ నిఘంటువులో నుదహరింపబడినట్లు "చి-ఆంగ్-లిన్" జాతీయవిద్వత్సభలో 651 వ సంవత్సరములో 3260 చైనావిద్యార్థు లుండిరి. తరువాత కొరియా, జపాన్, టిబెట్టు, మధ్యఆసియా దేశములనుండి విద్యా ర్థులు వచ్చి, దీనిలో చేరిరనియు, మొత్తముమీద అందరునుకలసి 8000 మంది విద్యార్థు లుండిరని ప్రగల్భములాడిరి.

యును లేదు. * టాయిజం ప్రజలకు, యూహించుటకు స్వప్నప్రపంచమును చూపుటయేగాక వారియాత్మల కుల్లాసము ఉత్తేజమును గలిగించెను. రాబోవు స్థితిగతులనుగురించి కొంత విశ్వాసమునుకూడ వారిలో గలిగించెను.

అత్యంతాభివృద్ధిచూపినకాలము తరుచుగా ప్రజలలో నెక్కువ ఉత్పాదకరమైన ఫలితములను గలిగించును. "టియాంగ్ చైనా"యే దీనికి తార్కాణము. చైనా విదేశవ్యాపారము విలాసవస్తువుల యుత్పత్తి ఆవశ్యకతను పెంపొందించెను. మట్టిపాత్రలు, పింగాణీపాత్రల యుత్పత్తి అపూర్వమైన అభివృద్ధిని పొందెను. చైనామట్టిపాత్రలు ఎక్కువ పేరుప్రఖ్యాతిని గలిగియుండెను. బాగుగా మెరుగుపెట్టబడిన అసలు పింగాణీవస్తువులు ఖాలీఫాకు పంపబడుచుండెను ఈ వ్యాపార మనేక నూతనపరిణామములను పొందుచుండెను. టి-యాంగ్ కుమ్మరులు పరిష్యా, యిండియా, గ్రీసుదేశపు నమూనాలను అనుసరించి మట్టిపాత్రలను తయారుచేయుచుండిరి. ఆరవశతాబ్దతుదిభాగములోను, 7 వ శతాబ్ది ప్రారంభదశలోను విగ్రహములను మలచి శిల్పవిద్య అత్యంత యున్నతస్థితిని పొందెను. ఈ శిల్పవిద్య నైపుణ్యము కొన్ని మరువరాని నిదర్శనములవలన తెల్లమగుచున్నది. మతావేశము తగ్గినకొలది యీ శిల్పవిద్య క్రమక్రమముగా క్షీణింపజొచ్చెను. కొన్ని ప్రత్యక్షనిదర్శనములద్వారాను, చైనావిమర్శకుల విమర్శలద్వారాను మనము నిర్ణయించగలిగినచో, రూపచిత్రములను వ్రాయు చిత్రకళ అత్యున్నతస్థాయిని పొందెనని చెప్పవలసియుండును. ప్రకృతిదృశ్యములను చిత్రించుటకుకూడ నిబ్బరముగా వర్ధిల్లుచుండెను. ఆనాటి చిత్రకారులలో "ఉ-ట్యా-సు అన్" చాలా గొప్పవాడు. (మ 792) అయన చిత్రించిన మూడువేల బౌద్ధచిత్తరువులు, పట్టువస్త్రములపై చిత్రించిన చిత్తరువు లానాటి ప్రపంచములో నెక్కువ ఆదరణీయములుగా నుండెను. పలకతోచేయబడిన నమూనాలతో బట్టల— అద్దకమువేయు చేతిపని వాడుకలోనికివచ్చెను. కొరియా, జపాను దేశీయు లత్యంతశ్రద్ధతో వ్రాసిన ప్రతులద్వారా నప్పటికి ప్రబలియుండిన

---

*Cf. B. Belpaire "Le Taoism et Li T'ai-po" Melaanges Chinois et Bouddhiques.
1 : 1—14 (1931—32) చూడుడు.

గృహనిర్మాణశాస్త్రజ్ఞానమును మనము గ్రహింపగలుగుచున్నాము. ప్రత్యేకముగా మతభవనముల, రాజభవనముల నిర్మాణము దేదీప్యమానముగాను, నత్యంత వ్యయదాయకముగాను నుండినట్లు గోచరించుచున్నది. 600 సంవత్సరములో దక్షిణహూపేలో కట్టబడిన రాతివంతెన యీనాటికిని నిలచియున్నదనువిషయము, వంతెనలుకట్టుటలో చైనావా రెంతటియనుభవమును గలిగియుండిరో విశదపరచుచున్నది. సాహిత్యములో పద్యకావ్యము లగ్రస్థానము నాక్రమించియుండెను. చైనాలో నాకాలము కవిత్వబంగారుయుగముగా పరిగణింపబడెను. "మానవుడైనవాడల్లా కవియే" యని విమర్శకు డొకడు వక్కాణించెను. * 2200 మందికవులచే వ్రాయబడిన 48,900 నీతి పద్యములుగల కావ్యము 1705 వ సంవత్సరమునాటికి కూడ నిలచియున్నది. ఆ కవిసత్తములలో "పో-చు-యి" (776—846) అను కవి యొక్కకీర్తి అయనజీవితకాలములోనే కొరియా, జపాన్ దేశములవరకు వ్యాప్తిచెందెను. "లి-పో" (701-762) "టు-వు" (712-770) "వ్యాంగ్-వె" (699—759/60) "వెయింగ్-వు" (Ca. 740-830) వంటి ప్రఖ్యాతకవీశ్వరుల పద్యము లనువదింపబడెను. కాని ఆ బిరుకకవుల పద్యావళి యూరోపియన్ భాషలలోని కింతవరకును తర్జుమాచేయబడలేదు. సాహిత్యాభివృద్ధికి వారందరు పద్యకావ్యములను వ్రాసియుండిరి. దానికితోడు వ్యాసకర్తలు, చరిత్రకారులు తెలుపజాలనట్టి అకాలపు పరిస్థితులను రాజసభ్యులు, సైనికులు, చిత్రకారులు, మతగురువులు తెలిపియుండిరి. అంతియేగాక కొన్నిగ్రంథములు వారు స్వభాషలో వ్రాసియుండిరి. దానినిబట్టి అకాలపుభాష, భావములు గుర్తింపసాధ్యమగుచున్నది. వచన (గద్య) గ్రంథములు, విద్వద్గ్రంథములు అత్యుత్తమతరగతికిజెందియుండెను. చైనాభాషనుగురించి వ్రాయబడిన రెండు యుత్తమగ్రంథములు "సు-యి" రాజవంశీయులకు ప్రత్యేకఘనతను గలుగజేసెను. ఇప్పు డా గ్రంథములు చైనీయభాషను ఉచ్చారణను నభ్యసించుటకు మూలాధారములుగా నున్నవి. "హ్యాన్" వంశచరిత్ర "యన్-షి-కు" (581-645) గారిచే గొప్ప ప్రావీణ్యతతో సరిదిద్దబడి ప్రచు

* చైనాదేశపుకవి "లి-పో" గ్రంథము అను పుస్తకము 1 వ పేజీ "యిన్-వా జాటా"లో నుదహరింపబడెను.

రింపబడెను. అప్పటికి ముగిసిపోయినసంక్షోభకాలమునాటి వివరములను తెలుసుకొనుటకు ప్రభుత్వాధికారులను కలియవెదకి, అనేక పండితబృందములు ఏడుచరిత్రలను వ్రాసిరి. ప్రభుత్వోద్యోగపరీక్షలకు చదువు నభ్యర్థులకు సహాయకారిగానుండుటకు రెండు సర్వవిషయసంగ్రహ నిఘంటువులు (Encyclopedias) వ్రాయబడెను. వాటిలో ప్రభుత్వపరిపాలనావిధానము, చేతిపనులు, ఔషధములు మొదలగు నన్నివిషయములు సంగ్రహముగా నుదహరింపబడెను. ఈ నిఘంటువు లానాటి యువకవిద్యార్థుల జ్ఞానాభివృద్ధికి, వ్యాసరచనకు నెంతయో సహకారిగానుండెను. వేర్వేరు మూలాధారములను 36 సంవత్సరములపాటు తరచి "టు—యు"గారు (735-812) 801 సంవత్సరములో వ్రాసిన "టి-అంగ్-టి యన్" గ్రంథము పైవాటికంటెను యెక్కువ పరిమాణముగల సాదృశగ్రంథము. ప్రఖ్యాత రాజనీతి నిపుణుడు, గ్రంథకర్తయునగు "హాన్-యు" (768—824) వ్యాసరచననియమావళిగ్రంథమును రచియించెను. కొంతశిథిలమైపోగా మిగిలియున్న నాయన గ్రంథభాగము పాండిత్యచైతన్యమునుండి విడివడి, అంతరంగిక సన్నిహితత్వమును నిరూపించుచుండెను. ఆయనతరువాత వ్రాయబడిన గ్రంథముల శైలిపై ఆయన ప్రభావమును నిరూపింపబడెను. చైనాదేశీయులచే నితర ప్రముఖులతోపాటు జ్ఞప్తియందుంచుకొనబడిన "హాన్-యి" కన్ఫూషియన్ మత తీవ్రవాది. 12, 13 వ శతాబ్దములలో వికసింపనున్న భావములను ఆయన యుపదేశించెను. బౌద్ధమతానుహాదకులు, మతబోధకులు వారిలో ముఖ్యముగా "సు-అన్-ట్సాంగ్" "ఐ-చింగ్"లు, వారిసహాయకులు, వారి తరువాతవచ్చినవారు అదేవిధముగా వందలాది సంస్కృతగ్రంథములను మనఃపూర్వకమైన శ్రద్ధ, దీక్షలతో చైనాభాషలోకి అనువదించుచుండిరి. "సు యన్ ట్సాంగ్" యాత్రలను వివరించుచరిత్ర కల్పితకథకులకు, నాటక రచయితలకు భావోద్రేకమును గలిగించుచుండెను. వీటిపైనాధారపడిన కల్పితగాథ లనేకపర్యాయములు ప్రజలకు వినిపింపబడుటయేగాక నాటక రూపముగా ప్రదర్శింపబడుచుండెను. ఇంతవరకు దేవతలు, మాంత్రికులను గురించి చెప్పబడుచుండినకథలనువదలి, బౌద్ధులు, టాయిస్టులు దైనికజీవితము, ప్రేమానురాగములగురించి తెలుపు కథలను స్వభాషలో వ్రాయు

చుండిరి. విదూషకులచే ప్రదర్శింపబడుచుండిన నాటికలు పెద్దనాటకములుగా వ్రాయబడి ప్రదర్శింపబడుచుండెను. * ఈపద్ధతి మధ్యఆసియాలో ప్రారంభింపబడియుండవచ్చును. ఏడవశతాబ్దముమొదలు తొమ్మిదవశతాబ్దమువరకు నాటకములు ధనసంపాదనపద్ధతిలో పేరుపొందినను, కొంతకాలమువరకు సాహిత్యగ్రంథములుగా ప్రాముఖ్యతగాంచలేదు. కర్రలపై అక్షరములు చెక్కబడి, అచ్చువేయుపద్ధతియొక్క ప్రాచీనచరిత్ర తెలుసుకొనజాలక పోయినను, సుమారు క్రీ. వె. 600 సంవత్సరములో యీ పద్ధతి కనిపెట్టబడినదనియు, పదవశతాబ్దములో చైనాలోనేగాక, కొరియా జపానుదేశములలోకూడ పండితబృందములచే క్రమక్రమముగా నామోదింపబడినదనియు తెలియుచున్నది. ఇప్పటికి భద్రపరుపబడిన అచ్చుదిమ్మలనిర్మాణములు జపానునుండి వచ్చినవే. అవి సుమారు 770 సంవత్సరములో తయారుచేయబడిన చిన్నమంత్రములు చెక్కబడినబ్లాకులు. "టన్-హూ-అంగ్"లో లభించిన 868వ సంవత్సరమునాటి "డైమెండుసూత్ర"మను పేరుగలిగి, యీనాటివరకు నిలిచియున్నగ్రంథము ప్రపంచ ప్రాచీనగ్రంథములలో మొదటిది.

సుయి-ట్యాంగుశకములో చైనాదేశము పునరుద్ధరింపబడెను. చిరకాలమునుండియు జరుగుచుండిన నంతఃకలహములచే నిర్మూలింపబడిన ననేకరాష్ట్రములయొక్క శక్తిసామర్థ్యము లైక్యముచేయబడి సామ్రాజ్యపునరుద్ధరణకు తోడ్పడెను. మందగమనాభివృద్ధిగల (సంస్కరణలు) కాలములో ఆశింపబడని నూతనమార్పులు రాజసభలోని విదేశీయరాయబారుల ప్రోద్బలముతో ప్రవేశపెట్టబడెను. సంగీతశాస్త్రములో నెన్నడో మరువబడిన స్థానవ్యత్యయ మిపుడు తిరిగి వాడబడుచుండెను. సప్తస్వరములలో ప్రతిస్వరముమీద ఆధారపడిన 84 విరామములు సృష్టింపబడెను. మిరియాలు; బీటుదుంపతో తయారైనచక్కెర; ఖర్జూరము; బాదం; అత్తి; నిమ్మ; అలివ్ మొదలగుపండ్ల నాహారదినుసులుగా వాడుచుండిరి. నేపాళనూనె, కుంకుమపువ్వు, మల్లెనూనెల నౌషధములుగా నుపయోగించుచుండిరి. రాజనగరులలోను, సైనికశిబిరములలోను "పోలో" బంతిఆట ఆడుచుండిరి. ఆ ఆటలో

* ట్యాంగ్‌కాలములో రాతిస్తంభములపైచెక్కబడిన హాస్యనాటకములు స్పష్టముగా హిందూదేశపు మూలాధారము గలవే.

కొంద రంతఃపురస్త్రీలుకూడ పాల్గొనుచుండిరి. శిల్పచాతుర్యము; నక్షత్రశాస్త్ర పరిజ్ఞానము, కవచము, దుస్తులు మొదలగునవన్నియు మార్పుజెందెను. అత్యంత విస్తీర్ణమైన చైనాదేశమును గుర్తించుటకు కలిగిన ఆవశ్యకత దేశ పటమును తయారుజేయు విద్యాభ్యాసమునకు దారితీసెను. చియా-టాన్ (730-805)చే 801 వ సంవత్సరములో తయారుచేయబడిన దేశపటము 10,000 మైళ్ళపొడవు 11,000 మైళ్ళ వెడల్పుగల దేశాకృతిని చూపించెను. చైనాదేశమునుంచి అప్పటికి కనుగొనబడిన ఆసియాప్రపంచమునకు నేల మీదను, సముద్రముపైనను యేర్పడిన 7 మార్గములు గుర్తింపబడెను. సైనికాధికారపద్ధతి యింకను వేధించుచునేయుండెను. ప్రభుత్వవ్యయమునకు వలయు ధనావశ్యకత హెచ్చుచుండెను. చాలకాలమునుంచి రైతులే యీ ధనమును పన్నులరూపముగా చెల్లించుచుండిరి. కాని 766-780 సంవత్సరములలో చేయబడిన సంస్కరణలవలన కొంతభారము ధనవంతులపై మోపబడెను. ఈ నిర్ణయములనమలుజరుపు అధికారము గవర్నరుల హస్తగతమై యుండెను. వారిదుష్పరిపాలన అప్పటికే రగులుచున్న ప్రజలఅసంతృప్తిని ప్రబలముచేసి తుదకు ప్రభుత్వనిర్మూలమునకు కారణభూతమయ్యెను. రాజసభలోను, రాష్ట్రసభలలోను కొజ్జాలు తమపలుకుబడిని వృద్ధిచేసుకొను చుండిరి. గొప్పమంత్రులుకూడ వీరిఅనుగ్రహముపైననే చక్రవర్తిని సమీపింపగలుగుచుండిరి.

# ఐదవ అధ్యాయము

## అనైక్యత : సంగ్ : ఉత్తర వాయవ్యప్రదేశముల విభజన

## ఐదు వంశములు : పది స్వతంత్రరాజ్యములు

టియాంగ్‌వంశపతనముతో దేశమంతటను అరాజకము ప్రబలెను. చైనాదేశపు వివిధప్రదేశములలో విభజనోద్యమములు జయప్రదముగా కొనసాగుచుండెను. చైనీయులచే "షాటో"యని పిలువబడిన తుర్కు తెగకు జెందిన యనేకయోధులలో ముగ్గురు క్రీ. శ. 907 మొదలు 960 వరకు సామ్రాజ్యాధికారమును చెలాయించుచుండిరి. ఖైతానులని పేరుగల మంగోలు తెగలు ఉత్తరముననున్న మంచూరియా, మంగోలియాదేశములను 907-1125 సంవత్సరములమధ్య నాక్రమించి, తమరాజ్యమును విస్తరింపజేయుచుండిరి. చరిత్రవిషయక దేశపటమును పరిశీలించినచో దేశములో నెంత అనైక్యత ప్రబలియుండెనో విశదముకాగలదు. చైనాచరిత్రకారు లీ కాలమునకు ఐదువంశములు-పదిస్వతంత్రరాజ్యములని పేరిడిరి. చైనాసామ్రాజ్య చరిత్రలో నీకాలమును కడు చెడ్డకాలముగా పరిగణించిరి. భాగ్యవంతులగు నిరంకుశభూస్వాములు గడుపుచుండిన భోగవిలాసజీవితము లోకవిధముగ నింద్రియసంతృప్తిని గలిగించుచుండెను. స్త్రీలపాదబంధనము 950 వ సంవత్సరములో మొదలిడెను. ఈ యాచారమెట్లు ప్రారంభమైనదో నెవరికిని తెలియదు. కాని యీ అభ్యాసము నాట్యకత్తెలతో ప్రారంభమాయెనని తలపబడుచున్నది. ఈ విషయ మెట్లుండినను యీ అలవాటు 1912 వ సంవత్సరాంతమువరకు నొకశతాబ్దము .చేయబడినప్రచారము, అవహేళనము ప్రభుత్వనిరోధమును లక్ష్యపెట్టకుండా పట్టుదలతో వాడుకలోనుండెను. చైనాప్రజలలో కాంటన్‌లోని పల్లెకారివనితలు, నైఋతి ప్రదేశములోని ఆదిమవాసులు, చైనా నొకప్పుడు జయించిన పరిసరదేశస్థులు, జర్చన్లు,

మంగోలులు, మంచూలుతప్ప తక్కినవారందరు నీ యభ్యాసమునకు దాసులై పోయిరి. అచ్చుపని వాడుకలోనికివచ్చుట యీకాలములో గలిగిన గొప్ప విశేషము. ఈపని నకలుసబదు అప్పుడప్పుడు నుపయోగించబడుట మాత్రమే గాక, సామ్రాజ్యములోని విద్యావంతులందరకు నిప్పుడది యత్యవసరమాయెను. "కాన్సు"లోని "టాంగుట్"; మధ్యఆసియాలోని "యుఇగర్"వారుకూడ దీనిని వాడమొదలిడిరి. 929 వ సంవత్సరములో "లొ-యాంగ్"లోని సామ్రాజ్యాధిపతి "జ-మయన్" రాష్ట్రమును తనరాజ్యములో కలుపుకొని, 5సంవత్సరాలకాలము తనయధీనములో నుంచుకొనుట వలన అచ్చువిషయమునుగురించి యాయన తెలుసుకొనగలిగెను. కన్ఫూషియన్‌మత గ్రంథమును ప్రామాణికగ్రంథముగా జేయుట ప్రథమకర్తవ్యము గావున, నా గ్రంథమును (932) వెంటనే అచ్చువేయవలెనని సామ్రాజ్యాధికారు లాజ్ఞాపించిరి. "చియాంగ్-అన్"లోని కొన్ని శిలాశాసనములను వాఖ్యాన విమర్శలతోకూడ అచ్చువేయుట కుత్తరువులీయబడెను. జాతీయ విద్వత్సభ 130 సంపుటములుగల యీ గ్రంథమును 21 సంవత్సరములలో నచ్చువేయించిరి. బౌద్ధమతగ్రంథముల నచ్చొత్తించుట చైనాలోను తదితర ప్రదేశములలోకూడ కొనసాగుచుండెను. ఇటీవల లభ్యమైనదృష్టాంతరము లీ విషయమును సమర్థించెను. 5048 సంపుటములుగల "త్రిపిటక"గ్రంథము 971-983 సంవత్సరములమధ్య ముద్రింపబడెను. టాయిస్టు మతసిద్ధాంతములుకూడ నచ్చొత్తింపబడెను. 4565 సంపుటములుగల గ్రంథ మది. ఆసంపుటములను 466 పెట్టెలలో పెట్టి 1019 వ సంవత్సరమున చక్రవర్తికి కానుకగా నిచ్చిరి. ఈమతము తనజన్మస్థానములో నున్నతస్థాయినిపొందుటయే గాక పరిసరదేశములలోకూడ వ్యాప్తిగాంచెను. విశేష విజ్ఞానాభివృద్ధివలన నానాటిసాంఘికస్థితిగతులను మఖ్యపరుపజాలరు. యుద్ధములు, రక్తపాతము సర్వసాధారణముగా జరుగుచుండెను. శాసనములు కఠినములుగానుండుటయే గాక అమానుషముగా అమలుపరుపబడుచుండెను. ఉద్యోగులలో లంచగొండితనము ప్రబలముగానుండెను. అధికారకేంద్రీకరణమువలన-నాణెములవిలువ తగ్గిపోవుటచే సరుకుల పరస్పరమారకము సాధారణవాడుకలోనికి వచ్చెను. ఉత్తరచైనాలోని కాలువలు, నీటిసదుపాయసౌకర్యములు శ్రద్ధగా గమనింప

బడకపోవుటచే నవి హీనస్థితికివచ్చెను. అందువలన వరదలు కాటకములు, వానివలన వ్యాపారస్థంభనము గలిగెను.

నిర్బంధములు, అప్పులు తొలగింపబడుటచే దేశములోని విశేష భాగములో నరాచకము ప్రబలెను. నిరంకుశప్రభుత్వము నెదుర్కొన శక్తి గలిగి, యెంత కాలమునుంచియో అన్నితరగతుల ప్రజలహృదయ విద్వేషము నకు కారణభూతమగు బౌద్ధమతము, మరియొక తీవ్రమైన దెబ్బ నెదుర్కొన వలసివచ్చెను. అప్పుడుకూడ బౌద్ధమతము కొందరుబలవంతుల మద్దతును పొందియుండెను. హ్యాంగ్‌చౌలో పాలించిన "యు", "యుహే" దేశముల రాకుమారు లనేకదేవళములను, స్తూపములను కట్టించి, విగ్రహములను ప్రతిష్ఠించిరి. క్యాంటనులోని ప్రభువులు రాజోచితవిధముగా మతము నాదరించుచుండిరి.

చైనాచరిత్రలో నీ కాల మనేక క్లిష్టపరిణామములను పొందెను. "చూ-ఋన్", "సుయి" పాలకుల పూర్వశతాబ్దములోవలె, దేశము చిన్న చిన్నరాష్ట్రములక్రింద భిన్నముకాకుండచేయుటకు జాతీయైక్యత పునరుద్ధర ణకు తగు ప్రయత్న మవసరమైయుండెను. చైనావారు రెండవమార్గమును నిర్ణయించుకొనిరి. క్రమశిక్షణ, ఐశ్వర్యము, ప్రభావముల కాలవాలమగు నైక్యతను జ్ఞప్తికితెచ్చుకొనుటయే దీనికి కారణమైయుండెను.

## "సంగ్" వంశము: (960–1279)

క్రీ. శ. 959 వ సంవత్సరములో చక్రవర్తి మరణించెను. ఆయన కుమారుడు మైనరగుటచే నా బాలునితరపున"చావ్-కుయాంగ్-ఋన్"(927-976) పాలించెను. లొయాంగ్ చక్రవర్తులయొద్ద ప్రజాశాఖోద్యోగిగాను, సైనికోద్యోగిగాను పనిచేసియుండెను. ఉత్తరమున ఖైతాన్‌పై దండెత్తి జయముగాంచినపిదప 960 వ సంవత్సరములో నాయన సంపూర్ణాధికార మును వహించెను. తరువాత 16 సంవత్సరములకాలములో రెంటినితప్ప తక్కిన విడిపోయినరాష్ట్రముల నణచివేసెను. "చికియాంగ్"లోని "ఉ-యె" రాష్ట్రమును, "షాన్సీ"లోని "ఉత్తరహాన్" రాష్ట్రమును 978, 979 సంవత్సరములవరకు స్వాధీనముకాకుండెను. ఈలోపుగ 965 వ

సంవత్సరములో "అన్నాం" విడిపోయెను. "యునాన్"లోని "నాన్-చా" స్వతంత్రరాజ్యముగ ప్రకటించుకొనెను. 947 వ సంవత్సరములో పసుపు నదికి (Yellow River) వెలుపల "లియావ్" రాజ్యమును స్థాపించిన శక్తివంతుడు "ఖైతాన్" "చా" రాజ్యపు ఉత్తరపార్శ్వమును భయపెట్టు చుండెను.

"చావ్" స్థాపించిన సంగవంశపాలన 1126-1135 మధ్య 9 సంవత్సరములపాటు కలిగిన విపత్కరపతనముతప్ప 960-1279 వరకు కొనసాగెను. హాన్, "టియాంగ్" పాలకులవలె యీ వంశపుపాలకులు చైనా రాజ్యమును విస్తరింపజేసినఖ్యాతిని గాంచలేదు. అశ్వములమేతకువలయు పచ్చిక, వాటినితర్ఫీతుచేయు ప్రదేశములు వలసినంతగా లభ్యముకాకుండు టయే సంగ్‌పాలకులన్యూనతకు కారణము. మిక్కిలి దారుఢ్యముగలిగి, శీఘ్రగాములగు తమప్రత్యర్థులపై దాడిచేసి యోడించుట సాధ్యము గాకుండెను.

1126-1127 సంవత్సరములో జర్చన్‌లు, సంగ్‌రాజధాని నగరముపై దాడిచేసి చక్రవర్తిని, ఆయనతండ్రిని, సభ్యులను మొత్తము 3000 మందిని బంధించిరి. చిన్నరాకుమారుడు, తక్కినఅధికారులు "యాంగ్‌ట్జీ" నదినిదాటి పారిపోయిరి. ఆ రాజకుమారుడు "లిన్-యాన్" (ప్రస్తుతపు హ్యాంగ్‌చౌ) అను పట్టణములో తనరాజ్యమును స్థాపించెను. ఆ పట్టణమును ప్రజలు "తాత్కాలిక రాజధాని"గా నిర్ణయించిరి. ఇచట "చా"వంశపాలకులు క్షీణించినసామ్రాజ్యమును పాలించుచుండిరి. 1273 సంవత్సరములో హాన్‌నది చేరువనున్న యిప్పటి హాపేరాష్ట్రములోని సాయుధదుర్గములను ముట్టడించి వాటిని స్వాధీనపరచుకొని "యాంగ్‌ట్జీ"నదినిదాటి "హాంగ్-చౌ"నుండి క్యాంటన్‌వరకు వ్యాపించియుండిన కోస్తాప్రదేశమునంతయు నాక్రమించి సంగవంశమును కూలద్రోసిరి. "దూకావ్" సమీపముననున్న నౌకదీవిలో నుండిన సామ్రాజ్యపు తుదినౌకాదళమును చిందరవందరజేసిరి.

నాగరికతాభివృద్ధిదాయకములగు నూతనకళలను సంగ్‌ప్రభువులు పెంపుజేసిరి. దానినిగురించి "కార్టర్" యీవిధముగ వ్రాసెను.

పద్యకావ్యములకుమారుగా విద్వద్వచనగ్రంథములు, సంక్షిప్తచరిత్రలు,

ప్రకృతిశాస్త్రగ్రంథములు, రాజ్యతంత్రశాస్త్రములు మొదలగునవి విరివిగా వ్రాయబడెను. గ్రీసుదేశములో స్వల్పకాలము మినహాయించగా చైనాలో గాని, పాశ్చాత్యదేశములలోగాని యెన్నడు కనివినియెరుగనంత శ్రేష్ఠమైన గ్రంథములుగా నుండెను. మతమునందలిభక్తి సడలి, తత్వచింతన మధిగమించెను. నేటివరకు చైనాలో ప్రాబల్యముగాంచియున్న గొప్ప భావసరణి యుద్భవిల్లెను. ప్రాచీనకాలపు మహోన్నతసాంప్రదాయముతో కళలు కొనసాగింపబడి సుఖానుభవమును పొందజేసెను.

నూతన నగరము లనేకములు నిర్మింపబడి, వాటి కావరణగోడలు కట్టబడెను. నీటిపారుదలమార్గములు, వరదలనిరోధము మొదలగు ప్రజోపయోగపు నిర్మాణములు విశేషముగా తయారుచేయబడెను. ఈ కార్యములు ముఖ్యముగా సముద్రతీరప్రాంతరాష్ట్రములగు "కియాంగ్సు" "చెకియాంగ్" "ఫుకియన్"లో నిర్మింపబడెను. 910 వ సంవత్సరములో ప్రారంభింపబడి "హ్యాంగ్‌చౌ"నుండి యుత్తరదిశవైపు 180 మైళ్ళపొడవున సముద్రతీరమున కట్టబడిన అవరణగోడ వాస్తుశాస్త్రనైపుణ్యమున కాదర్శము. నివాసగృహములు యెత్తైనకప్పులు, రాతిపలకలతో కప్పబడిన నేలను గలిగి యుండెను. కుర్చీలు సాధారణముగా వాడబడుచుండెను. పల్లకీలవంటి పడక కుర్చీలు ప్రయాణములలో విరివిగా నుపయోగింపబడుచుండెను. ప్రభువుల యానందానుభవమును గలిగించిన నుద్యానవనములు భాగ్యవంతులందరకు సుగమములాయెను. "టి-యాంగ్" పాలనలో వన్నెకెక్కిన మృణ్మయపాత్ర నిర్మాణ మీకాలములోనతిశమైనఅభివృద్ధినిగాంచెననికొందరుభావించు నంతటి యున్నతస్థితికివచ్చెను. "సంగ్"పాలనలోని పింగాణీపాత్రలు దేశవిఖ్యాతిగాంచి, జపాన్, ఫిలిప్పైన్సు, యిండో-చైనా, ఇండియా, సిరియా దేశముల కధికముగా నెగుమతిచేయబడుచుండెను. ఆఫ్రికాలోని కొన్ని ప్రదేశములకుకూడ యివి యెగుమతిచేయబడెను. 988 సంవత్సరములో జపానులోని మడతవిసనకర్రలపరిశ్రమ యిచట ప్రారంభింపబడెను. చైనా వారిచే సృష్టింపబడిన చీట్లపేకలు, పాచికల్పు వాడుకలోనికివచ్చెను. ఆ వంశాంతమునాటికి, సముద్రతీరమార్గములను, యిండియా తదితరదేశములకు పోవు సముద్రాంతరమార్గములను చైనావారు అరబ్బులనుండి వశపరుచుకొనిరి.

"దక్షిణసముద్రములలో ప్రయాణముజేయు యోడలు గృహములవలె నుండెను. తెరచాపలు ఎత్తినప్పు డవి యాకసములోని గొప్పమేఘములవలె గన్పట్టుచుండెను. వాటిచుక్కానులు అనేకపదుల అడుగుల పొడవుననుండెను. ఒకయోడ వందలకొలది ప్రయాణీకులను తీసుకొనిపోవుచుండెను. ఒక సంవత్సరమున కవసరమగు ఆహారపదార్థములను మోసుకొని పోవగలిగి యుండెను.*

ఖండాంతర సముద్రవ్యాపారముద్వారా దిగుమతిజేయబడిన వివిధ విదేశసరుకులు, సామాన్యజనానీకమునకును ప్రభుత్వమునకును ధనసంపాదనకేగాక, విదేశములతో విరివిగా పరిచయము గలుగజేసెను. ఈ వ్యాపారమును క్రమమార్గమునకుదెచ్చి లాభమును పొందుటకు ప్రభుత్వము యత్నించెను. ప్రభుత్వోద్యోగులు తాముగాని, తమప్రతినిధులద్వారాగాని విదేశవ్యాపారమును చేయకూడదని ప్రభుత్వ మాదేశించెను. కాని యా యుత్తరువులు పాటింపబడలేదు. ఈ గుత్తవ్యాపారమువలన పదియవశతాబ్దమున వచ్చిన 5 లక్షల రాబడి 1189 వ సంవత్సరములో 650 లక్షలకు పెరిగెను. దురదృష్టవశాత్తు అసంఖ్యాకముగానుండిన చైనానాణెములు విదేశములకు పోవుచుండుటచే, దేశములో నాణెములు కరువాయెను. ఈ దుస్థితిని తొలగించుటకు 970 వ సంవత్సరమునుండి ప్రభుత్వము కాగితపునోట్లను జారీచేయ మొదలిడెను. కాని యీపద్ధతి నిరర్థకమాయెను.• మొదటిప్రపంచయుద్ధానంతరమున జర్మనీలోను రష్యాలోను నాణెముల విలువను పెంచుట, తగ్గించుటవంటి పద్ధతుల కతీతములగు మార్గములు చైనాప్రభుత్వముచే నవలంబింపబడెను.

యుద్ధములలో ప్రేలుడు మందుసామానుల నుపయోగించుట యీ

---

* "లింగ్-వే-టే-టా"యను గ్రంథమునుండి "హార్తా అండ్ రాక్‌హిల్" గార్లచే ననువదింపబడిన "చౌ-జు-కా" పుస్తకములో 33 వ పేజీ చూడుడు.

• "కార్టర్"గారిచే వ్రాయబడిన"ది యిన్వెన్షన్ అఫ్ ప్రింటింగ్ యిన్ చైనా" అను గ్రంథములోని 73, 74 పేజీలు చూడుడు.

కాలములో నమలులోనికివచ్చిన గొప్ప అభివృద్ధిదాయకకార్యము. "చైనా దేశములో మతవిషయకాచారములలో నుపయోగింపబడుచుండిన చిన్న టపాకాయలతో ప్రారంభమై (క్రీస్తుశకము 6 వ శతాబ్దములో వాడుక వచ్చినది) పండ్రెండవశతాబ్దములో యుద్ధములలో వాడబడిన తూటాలు 13, 14 వ శతాబ్దములలో మంగోలులపాలనలో ఫిరంగులు మొదలగు ఆయుధముల వరకును గలిగిన విశిష్టాభివృద్ధి జాడలను మనము గుర్తింపగలము"* 1044 వ సంవత్సరమున వ్రాయబడిన చిన్న సైనికపుస్తకములో ప్రేలుడుమందు తయారుచేయబడువిధము వివరముగా వర్ణింపబడినదని చైనా చరిత్రకారులు వ్రాసియుండిరి. "లియో"లో "సంగ్" ప్రభువులు నిరర్థకయుద్ధములు చేయు కాలములో (1000) యీ తుపాకీమందు నుపయోగించెడు సైనిక ఆయుధములనుగురించి యుదహరింపబడెను. తరువాత శతాబ్దములలో, 1126-1127-1161-1162 సం.ముల మధ్య దండెత్తివచ్చిన, జర్చెన్‌లతో సముద్రముమీదను, నేలపైనను చేయబడిన యుద్ధములలో నీ ఆయుధముల నుపయోగించిరి. ఉత్తరపుదిశనున్న దుర్గములను మంగోలులు ముట్టడించినప్పుడు వారిపై యీ ఆయుధముల నుపయోగించుటలో జర్చన్‌లు వెనుకాడలేదు. పొడుగుపాటి వెదురుగొట్టములలో గుండ్లుదట్టించి, యీ తుపాకీమందు సహాయముతో ఆ గుండ్లను శత్రువులపైకి పంపునట్లుచేయు, ఆయుధము తుపాకీవంటిది యుండెను. దేశములోనికి త్రోసుకొనివచ్చుచున్న మంగోలులను నిరోధించుటకు 1259-1272 సంవత్సరములలో చైనావారు యీ ఆయుధములను విరివిగా నుపయోగించిరి. అప్పటికి శత్రువులుకూడ నీ ఆయుధములను సన్నాహపరచుకొనియుండిరి. 1272 సం. ముగియునాటికి "ఫాన్-చి-యంగ్" "సియాంగ్, యాంగ్" బలమైన ప్రాకారపు గోడలుగలిగిన నగరాలను ముట్టడించినప్పుడు శత్రువులు, రెండు క్రొత్త ఆయుధములను వాడిరి. అభివృద్ధిచేయబడిన వడిశెల, పెద్దపెద్దరాళ్ళను శత్రువులపై రువ్వునట్టి యంత్రము (మాంగోనల్) యీ రెండు ఆయుధములు యిద్దరు ముస్లిములచే తయారుచేయబడెను. ఇది గోడలను భేదించి ముట్టడిని

* అమెరికన్ ఆన్థ్రోపోలోజిస్టు XIX : 74 (1917).

తుదిముట్టించెను.* ఈ ఫిరంగులు మొదలగు ఆయుధములను కనిపెట్టినవా రెవరయినను, వీటినికనిపెట్టుటలో చైనావారు వారిపరిసరదేశములవారు ప్రముఖపాత్ర వహించినవిషయము. వీటినిబట్టి మరి యితరఆయుధములను బట్టి తెలియుచున్నది. టపాకాయలు, వాటికిసంబంధించిన బాణసంచాను చైనావారే తయారుచేసిరి. •

ఆకాలములో పల్లెగ్రామములలోను సరిహద్దుప్రదేశములలోను బుద్ధి వికాసము తక్కువగా నుండెను. కాని పెద్దనగరములలో ప్రజలు అపూర్వ విజ్ఞానమును పొందగలిగిరి. క్రీ. పూ. 5 మొదలు 3 వ శతాబ్దమువరకు వేర్వేరు న్యాయస్థానములలో గణుతికెక్కిన విజ్ఞానులు లేకపోలేదు. ప్రాచీన కాలపునాటి, ప్రస్తుతకాలపు, భద్రపరుపబడతగిన సాహిత్యగ్రంథములు ముద్రింపబడుచుండెను. అక్షరములను కఱ్ఱపైనను, లోహపుపలకలపైనను చెక్కి, సిరారాసి, కాగితములపై అద్దుచుండిరి. మట్టివస్తువులతోను, తగరముతోను, కఱ్ఱతోను, రాగితోను తయారుచేయబడిన అక్షరములతో ముద్రించుచుండిరి. అచ్చుపుస్తకములసంఖ్య పెరుగుదలవలనను, చదువుటకు యెక్కువ విశ్రాంతికాలముండుటవలనను, ఐశ్వర్యాభివృద్ధి కలుగుటచేతను ప్రజలు యెక్కువగా చదువుటకు సావకాశముకలిగెను.

సంగ్ కాలములో - మఠములలోగాని విద్వత్సభలలోగాని, ప్రభుత్వ కచేరీలలోగాని, విద్యాస్థాయి నిర్వివాదముగా నున్నతస్థితిలో నుండెను. "టి యాంగ్ చే" ప్రారంభింపబడిన పోటీపరీక్షలవిధానము వృద్ధిచెంది సరిదిద్దబడెను. 11 వ శతాబ్దాంతముననను, 12 వ శతాబ్దప్రారంభముననూ చేయబడిన సంస్కరణలవలన యీ విద్యావిధానము ప్రత్యేకాభివృద్ధిగాంచెను. అధికారపదవులను వాంఛించు అభ్యర్థులు కావ్యభాషనే అభ్యసించవలె

---

*"గాడ్రిచ్ అండ్ ఫెంగ్"గార్లచే వ్రాయబడిన "ది యర్లీ డెవలెప్‌మెంట్ ఆఫ్ ఫైరారమ్సు యిన్ చైనా" గ్రంథములోని 36 వ సంచిక 114-123, 250 (1946) పేజీలు చూడుడు.

• వాంగ్‌లింగ్‌చే వ్రాయబడిన "యిన్వెన్షన్ అండ్ యూజ్ ఆఫ్ ఆరమ్సు యిన్ చైనా" యనుగ్రంథము 37 వ సంచిక 160-178 (1947) పేజీలు చూడుడు.

ననియు తప్పక వాటిని కంఠస్థముచేయవలయునెడి నిర్బంధములపట్ల అసంతృప్తి యుండెను. ప్రఖ్యాత ప్రధానమంత్రి వాంగ్-ఆన్ షి (1021-1086) అనుభవపై కవిద్యాభ్యాసమును వృద్ధిచేయుటలో తనపలుకుబడినంతను వినియోగించెను. రాజధానినగరమందలి న్యాయశాస్త్రకళాశాలలలోను, వైద్య కళాశాలలలోను అభివృద్ధికరములగు మార్పులను ప్రవేశపెట్టెను. తన సామ్రాజ్యములో పెద్ద, చిన్న ఉద్యోగశాలలలోను ప్రభుత్వపాఠశాలలను స్థాపించెను. ఈ పాఠశాలలపోషణకై ప్రత్యేకింపబడిన భూములవలన వచ్చు నాదాయముతో కొంతవరకు యీపాఠశాలలు నిర్వహింపబడుచుండెను.

ప్రైవేటువిద్యాభ్యాసముకూడ నెక్కువగా వర్ధిల్లుచుండెను. విద్వాంసు లనేకులు యుపాధ్యాయులుగా పనిచేయుట కంగీకరించిరి. కనీసము 124 విద్యాభ్యసనశాలలు ప్రైవేటువ్యక్తులచే ప్రారంభింపబడెను. విద్వాంసు లుపాధ్యాయులుగా నియమింపబడిరి. ఉత్తరోత్తరా అభివృద్ధికిరాగలిగిన విద్యార్థులు జీతముల చెల్లింపనవసరములేకుండగనే చేర్చుకొనబడుచుండిరి. చింతన, యేకాగ్రతల నభ్యసించుటకు వీలుగానుండు వనప్రాంతములలోను, పర్వతములచెంతను యీ పాఠశాలలు ప్రారంభింపబడెను. వీటిలోనే గ్రంథా లయములు, ముద్రణాలయములుకూడ చేర్చబడియుండుటచే, నీ విద్యాశాలలు ప్రభుత్వప్రతిబంధకములకు లోనుగాకుండా తత్వజ్ఞానమును, పరిశోధనలను వృద్ధిచేయగలిగియుండిరి.

గద్య పద్యకావ్యములు యీ విద్యాలయములనుండి, మఠములనుండి, ఆశ్రమములనుండి; రాజాజ్ఞతో రాజధానినగరమునుండి విరివిగా వెలువడు చుండెను. "లి-పో" "హాన్-యు" వారిఅధీనప్రభువులచే వ్రాయబడిన గ్రంథములలోనుండినంత సాహిత్యము, సచేతనత్వము, నవీనత గలిగి యుండకపోయినను "సంగ్" పాలనలో ప్రఖ్యాతరచయితలు లేకపోలేదు. నిర్ణీతనియమములకు సూత్రములకు లోబడి వ్రాయవలసియుండుటచే, ప్రాచీనరచయితస్థాయిని కొలదిమందిమాత్రమే చేరగలిగిరి.

ఆకాలములో యెక్కువమంది ప్రతిభాశాలురగు వచనరచయిత లుండిరి. ఉత్తమవ్యాసరచయితలు గొప్పపదవులను సంపాదించుటలో విజ యముగాంచిరి. సైనికసంఘాధ్యక్షుడు "జే-యాంగ్-సియా" (1107-1072)

గారు శిశిరఋతుధర్మములు, మదనల్లిత్రాగుబోతు, కుటీరములనుగురించి వర్ణించెను. "రెడ్‌క్లిఫ్"నుగురించి "సు-షి"చే వ్రాయబడిన వ్యాసము చైనావిద్యార్థులందరకు పరిచయమే! ఆయన సమకాలికుడును ప్రధానమంత్రియునగు "వ్యాంగ్-అన్-షి" ఆనాటి అధికారయుతములగు ప్రభుత్వశాసనపత్రములను వ్రాసెను. "సు-మా క్వాంగ్" (1019-1086) కాలపుచరిత్రను వ్రాసెను. ఆయన క్రీ॥ పూ॥ 403 మొదలు క్రీ॥ వె॥ 959 సంవత్సరముల మధ్యకాలపు చైనాచరిత్రను ముగ్గురురచయితలసహాయముతో 20 సంవత్సరములు శ్రమపడి "ట్జు-చి-ట్యాంగ్-చి-అన్" అనుపేరుతో గొప్పచరిత్రను వ్రాసెను. సరియైన విషయనిర్ధారణచేయుటలోను, సంపూర్ణవివరములు సేకరించుటలోను నాయనకుండిన అకుంఠితదీక్షకు ఆయన సరళమైన సులభశైలి యోతయో వన్నెతెచ్చెను. "చెంగ్-చి-యో" (1104-1162) మధ్యకాలములోను, దానిపై శతాబ్దములో సరియైన విషయనిర్ధారణ, సంపూర్ణవివర సేకరణలలో దానినే పోలిన మరియొకచరిత్రను వ్రాసెను. ఆయన ప్రకృతి శాస్త్రమునం దభిరుచిగలవాడు. ఆయనచే వ్రాయబడిన "ట్యాంగ్-చి" యను గ్రంథములో శబ్దోత్పత్తిశాస్త్రము, వర్ణోచ్చారణశాస్త్రము, రాజకీయఉపవిభాగములు, పుష్పములు, కీటకములు, గ్రంథాలయములోని పుస్తకములజాబితా తయారుచేయువిధానము - పురాతనవస్తుశాస్త్రము మొదలగు వేర్వేరువిషయములను తెలుపు సంకీర్ణగుర్తులు చేర్చబడెను.

నిఘంటువులను కూర్చినవారు వేరొకరచయితబృందమునకు చెందినవారు. వారినిఘంటువులలో ననేకవిషయములు సమకూర్పబడియుండెను. అట్లుకానిచో నవి యిప్పటికి రూపుమాసియుండెడివి. "లి-ఫ్యాంగ్" (925-996); యు-హో-షి (930-1007); "మా-టు-అన్-లిన్) (1250-1319) యీ ముగ్గురును యీ రచయితబృందములో ప్రముఖులు. ప్రాచీనకాలపు కంచుసామగ్రి, శాసనములు, పేర్లుచెక్కబడిన రాతిపలకలు, కర్రముక్కలు, గృహోపకరణములు, కళాపసామాగ్రి, దుస్తులు, భవనములు మొదలగు వస్తువులచిత్రములు చేర్చబడిన గ్రంథము లనేకములు కూర్చబడెను. "జర్చన్ల"చే కొల్లగొట్టబడుటకుముందు 1123-1125 సంవత్సరములనాటి సామ్రాజ్యాధిపతులచే భద్రపరుపబడిన వస్తుసముదాయమునుగురించి

"వ్యాంగ్-ఫూ" వ్రాసెను. "చావ్-మింగ్-చియాంగ్" (1081-1129) గారున్నూ, చైనాచరిత్రలో ప్రథమవిద్యావతి, కవయిత్రియునగు "లి-చి-యంగ్" (1081-1140) అనుపేరుగల ఆయనభార్యయున్నూ కలసి వ్రాసిన రెండువేలశాసనములజాబితాను తయారుచేయుటలో చూపిన ఆసక్తి దీనిలో లోపించెను. భర్త చనిపోయిన మూడుసంవత్సరములపిదప (1132) వారిచే తయారుచేయబడినజాబితా ప్రచురింపబడెను.

సంగ్‌పాలనలోని యితర వచనకావ్యరచయితలు వాస్తుశాస్త్రము, ఉద్యానవనకృషిశాస్త్రము, ప్రయాణము, విదేశవాణిజ్యములనుగురించి వ్రాసిరి. "లీ-చియె" (మ. 1110) వ్రాసిన, "ఇంగ్-సా-ఫా-షి" యను గ్రంథము చైనావారి గృహనిర్మాణశాస్త్రమున కాధారగ్రంథము. ఆయన సామ్రాజ్యప్రధానసగరము "కెయిఫెంగ్"లోని రాజభవనములు దేవళముల నిర్మాణమున కెన్నియో సంవత్సరములు పాటుపడెను. స్మృతిచిహ్నములకు సంబంధించిన రాయి, కలప, పెంకు, యిటుక కట్టడములనిర్మాణమునకు నిర్ణీతనియమము లీగ్రంథములో వివరింపబడియుండెను. 13 వ శతాబ్దములో "చి-యన్-చింగ్-యి" వృక్షశాస్త్రనిఘంటువును తయారుచేసెను. సంగ్ ప్రభుత్వరాయబారు లనేకులు తమయాత్రలను వర్ణించుచు పుస్తకములను వ్రాసిరి. వాటిలోనొకటి దక్షిణ, పశ్చిమఆసియా, ఆఫ్రికాలతో చైనావారిచే చేయబడిన వ్యాపారమునకుసంబంధించిన రికార్డు అంతకంటె నెక్కువ యుపయోగకరమైన ముఖ్యమైనరికార్డులను "చౌ-చు-ఫె" (1178) "చౌ-జూ-క్వా" (13 వ శతాబ్దము) గార్లు భద్రపరచియుండిరి. ఇండోనీషియా, సింహళము, దక్షిణయిండియా, అరేబియా, సోమాలిలాండ్, సిసిలీ దేశ వాసులు ఆయాదేశములలో నుత్పత్తియగువస్తువులు; వాణిజ్యములనుగురించి సిసలైన విలువగలసమాచారమును మన కందజేసిరి. 12 వ శతాబ్దము మొదలు నాటకరచన ఉన్నతస్థితినిపొందెను ఈకాలమునుండి వ్రాయబడిన సుమారు వేయినాటకములపేర్లు తెలియజేయబడినవి. "సంగ్" ప్రభువుల కాలపు నాటకములలో కొలదిమాత్రమే శేషించియుండుటచేతను, ఆ కాల దియు తిరిగి వ్రాయబడియుండుటచేతను ప్రసిద్ధిగాంచలేదు.

శాస్త్రవిజ్ఞానాభివృద్ధి స్పష్టముగా విదితమగుచుండెను. గణితశాస్త్ర

ములో "షావ్-యంగ్" (1011-1077) సాయన వర్షముయొక్క మదింపు నాలుగు సెకండులేయని ధృవపరచెను. హిందువులచే కనిపెట్టబడిన "సున్న" ప్రయోజనమును గుర్తించుటలో "చి-యున్-చి-యు-చావ్" (1247) మొదటి వాడు. అరబ్బులు చైనాలో బీజగణితమును ప్రవేశపెట్టియుండవచ్చును. మశూచివ్యాధికి టీకాలువేయుట వైద్యశాస్త్రములలో ప్రవేశపెట్టబడిన ముఖ్యాంశము.

లలితకళలలో కీటకములు, పక్షులు, చేపలు, జీవజంతువులు, కల్పిత జంతువులు, పుష్పములు, వెదుళ్ళు, కుటీరములు, భవనములు, మానవులు, యోగీశ్వరులచిత్రములు, వీటినధిగమించిన ప్రకృతిదృశ్యములును *చిత్రించు చిత్రకారులు "సంగ్" కాలములో ప్రసిద్ధికెక్కిరి. పర్వతశిఖరములు ఉత్తర, పశ్చిమదిశలయం దత్యంత వరువడితో ప్రవహించువాగులు; వెడల్పైన గొప్పనదులు, తూర్పుదిశయందు మంచుతోకప్పబడియుండు కొండలు మొద లగు రకరకముల స్థలవర్ణన చిత్రకారుల కనుల్లంఘనీయమైన నుత్తేజమును గలిగించుచుండెను. దేదీప్యమానమైన దృశ్యములతోగూడిన యేకాంతవాసాభి లాష చిత్రకారులకు మనోద్రేకమును గలిగించుటలో బౌద్ధ, టాయిస్టుమతము లెంతయో ప్రోత్సాహమును గలిగించెను. మానవశక్తి, వాయువు, మంచు, ఉన్నతశిఖరములు, వడిగలప్రవాహములు మొదలగు పంచభూతములశక్తి మధ్య ఆకర్షణభావ మీశ్వరప్రేరితమని "బినియన్" వక్కాణించెను. ఆస్థాన చిత్రకారులు గొప్పచిత్రములను చిత్రించిరనుట యదార్థమే కాని అంతకంటె యెక్కువ సంఖ్యగలచిత్రములు మఠములగోడలమీదను, పట్టుగుడ్డమీదను

* సొగసైన సంగ్‌చిత్రముల అపారసంఖ్యగల దృష్టాంతములు అమెరికన్ ప్రదర్శనశాలలో, ప్రత్యేకముగా బాస్టన్‌నగరములోని లలితకళలప్రదర్శన శాలలో నున్నవి.

ఆస్వాల్డ్ సిరెన్‌చే వ్రాయబడిన "ఏ హిస్టరీ అఫ్ యర్లీ చైనీజ్ పెయింటింగ్సు" అను గ్రంథము 2వ సంపుటము (లండన్ 1933) లోను "కె. టోమిటా"చే వ్రాయబడిన "పోర్టుఫోలియో ఆఫ్ చైనీజ్ పెయింటింగ్సు బాస్టన్ లలితకళలప్రదర్శనశాల (బాస్టన్, 1933 చూడుడు)

చిత్రములను చేర్చియుంచు పుస్తకములలోను స్వల్పపరిమాణముగలవైనను నత్యంతసుందరముగ చిత్రించిరి.

మరి, శిల్పశాస్త్రములలో "సంగ్" పాలన ప్రసిద్ధిగాంచెను. బౌద్ధ, కన్ఫ్యూషియన్ మతసిద్ధాంతములలో కొంత యేకీభావముగలుగుట చైనా దేశీయులలో జీవితములలో నత్యంత ఆవేశపూరితమైన ప్రాబల్యమును గలిగించిన యున్నతస్థానమునుండి క్రమక్రమముగా బౌద్ధమతము ప్రాముఖ్యతను గోల్పోవుచుండెను.

బౌద్ధమతప్రాబల్యము పూర్తిగా తగ్గిపోవుట కనేక సంఘటనలు కలిసి తోడ్పడెను.

ముస్లింమతప్రాబల్యము యుండియూను, బౌద్ధమతప్రచారకులకు మూలస్థానముగాను, చైనాయాత్రికుల గమ్యస్థానముగాను కాకుండాచేయుట ప్రథమసంఘటన. బౌద్ధమతము విజ్ఞానమును పెంపొందించునని యాశించినట్టియు బౌద్ధమతాచార్యులు గ్రహించుచుండిన శోభాయమానమైన అసంఖ్యాకములగు కానుకలను చూచి, నిరాశచెందినట్టియు తమపూర్వీకుల యనుభవమును గుర్తించిన వివేకవంతులగు చైనాప్రజలు, బౌద్ధమతము భావోద్రేకమునుమాత్రమే తృప్తిపరచునని గ్రహించుట రెండవసంఘటన. అందుచేత వారు బౌద్ధ-టాయిస్టుమతసిద్ధాంతములలో తమకు అంగీకారమైనటువంటియు, కన్ఫూషియన్ మతములో చెప్పబడినట్టియు సిద్ధాంతములనుమాత్రము స్వీకరించి, తక్కినవాటిని త్రోసివేసిరి. సృష్టిలోని సర్వసాధారణత్వసిద్ధాంతమును తమలో లీనముచేసుకోగలిగినంతగా వారినైతికశక్తి విస్తరించెను.

ఈ సూత్రములన్నియు అనుకోకుండానే వేరొక ప్రత్యేకమతముగా ఏర్పడెను. ఆ మతమునే నూతన కన్ఫూషియన్‌మతమని ఆధునికచరిత్రకారులు పేర్కొనిరి. బౌద్ధమతము సత్వరక్షీణతచెందలేదు. కాని, ఆ మతముయొక్క జీవితశక్తి స్పష్టముగా క్షీణదశకువచ్చుచుండెను. * ఆకర్షణీయమైన నవీనతత్వశాస్త్రజ్ఞానము యెట్టి హింసకు పాల్పడకుండానే బౌద్ధమతప్రాబల్యమును క్షీణింపచేసెను.

---

* 1269-71 సంవత్సరములమధ్య ప్రచురింపబడిన "ది ఫో-ట్సు-టాంగ్-చి" అను నిఘంటువును చూడుడు.

చైనా జీవితచరిత్రలో వివేచనాయుతయుగకాలములో నవీన కన్ఫ్యూషియన్ మతము వెలుపడెను. విద్యాభ్యాసము వ్యాపారకరముగ వ్యాప్తమగుచుండెను. దానికితోడు కడుయుత్సాహవంతుడగు మంత్రి, "వాంగ్-అన్-షి" సంస్కరణయుగమును ప్రారంభించెను. ప్రభుత్వఆదాయము, న్యాయశాస్త్రము, సైన్యము, ప్రభుత్వము, విద్యావిషయములలో ప్రభుత్వము అవలంబింపవలసిన రాజనీతిమార్గమును నిర్ణయించుటకు, ఆలోచనాపరుడగు ప్రతివ్యక్తిని ప్రోత్సహించు సంస్కరణలు ప్రారంభించిరి. ఆయన ప్రతిపాదనలు క్రొత్తవికాకపోయినను, అకాలమున కవి గొప్పమార్పులుగానే కనబడెను. ఆ మార్పులు ప్రజాజీవితములో ప్రతిభాగమును కలియచేసెను. దీనినిసాధించుటకు, ప్రభుత్వమే నిర్ణయింపబడిన విద్యావిషయిక సంస్కరణలను ఆయన ప్రవేశపెట్టెను. "చౌలి" "చరిత్ర" "గీతములు" అను పేర్లుగల మూడు మతగ్రంథములపై వ్రాయబడిన వ్యాఖ్యానమును నూతన విమర్శలతో తిరిగి వ్రాయించెను. చక్రవర్తి ప్రోద్బలము కలిగియుండియు, ఆయనసంస్కరణ లప్పుడప్పుడు భంగమగుచునేయుండెను. అయినప్పటికిని, దానివలన నొక ముఖ్యమైన ఉపఫలము కలిగెను. కొందరిప్రజల దాక్షిణ్యబుద్ధినిపారద్రోలి, సమస్యలను ఐహికదృష్టితో నెదుర్కొనుటకుప్రోత్సహించెను.

1050—1200 సంవత్సరముల మధ్యకాలములోనూ తనకన్ఫ్యూషియన్ మత మొకరూపమును పొందెను. దానిలో చురుకుగా పనిచేయువారు వేర్వేరువిధములగు శిక్షణ, అనుభవము కలిగినటువంటివారు కొందరు

---

1037 సంవత్సరానంతరం రెండున్నరశతాబ్దములకాలములో 415 అధ్యాయములుగల 20 గ్రంథములుమాత్రమే భారతదేశ పావనమతగ్రంథములనుండి అనువదింపబడెను.

982-1011 సంవత్సరముల మధ్యకాలములో సామ్రాజ్యాధిపతుల పోషణక్రింద ముగ్గురు హిందువులనాయకత్వముక్రింద అనువాదకుల సంఘము 484 అధ్యాయములుగల 201 గ్రంథములను అనువదించిరి. అంతియేగాక బౌద్ధమతలెక్కలపట్టీలననుసరించి 1021 వ సంవత్సరములో 3, 97, 615 సన్యాసులు: 61, 240 సన్యాసినులు పనిచేయగా, 1068 వ సంవత్సరములో 2,20,660 సన్యాసులు, 34,030 సన్యాసినులు పనిజేసిరి.

ఉన్నతపదవుల నధిష్ఠించి, గొప్పపలుకుబడిని కలిగియుండిరి. కాని వారం దరు "సుమా-కు-అంగ్" సాంప్రదాయపద్ధతులనే అవలంబించు పూర్వాచారపక్షమువారే. కన్ఫూషియన్ గ్రంథములపై వారుచేసిన, విమర్శలలో వారిభావములను సూచించిరి. కన్ఫూషియన్ మతముపై వారుచేసిన విమర్శలలో సర్వసమానత్వభావమును దృఢపరచిరి. ప్రతివిషయమును పరిశోధన చేసి, యీ పరిశోధనలను సమన్వయముచేయుటవలననే ఈ వాదన అంగీకృతమగునని, "వ్యాంగ్" (033-1107) వక్కాణించెను. ఈ భావ మందరికంటె గొప్ప అధ్యాపకుడు, పండితుడు నగు "చు-సి" యొక్క ఉత్సాహమును ప్రజ్వలింపచేసెను. "ప్రతిమానవహృదయములోను వివేచనా శక్తి యున్నది. ప్రతినిర్ణయములోను న్యాయముకూడా యున్నది. విషయ నిరూపణ పరిశోధనలో తగినంత వివేచనాశక్తి లేకుండుటయే మన అసంపూర్ణ విజ్ఞానమునకు హేతువు. తనకు తెలిసినవిషయముల నాధారభూతములుగచేసికొని, ప్రపంచములోని అన్నివిషయములను తెలుసుకొనుటకు విద్యార్థి సర్వప్రయత్నములు చేయవలెను. అవిధముగ తగినంత శ్రమపడిన పిదప, వెంటనే నన్నివిషయములు స్పష్టముగాను, విశదముగాను తెలుసుకొనదగు దినము వచ్చును. *

క్రైస్తవమతబోధకుడు "లు చియు యాన్" (1139-1193) బోధించుచుండిన చింతన, పరిజ్ఞానము మొదలగు "చాన్" భావములను ఆయన యెదుర్కొనవలసివచ్చెను. "చింతన" "విమర్శన" లనుగురించి, "చు సి" విఖ్యాతయుతములగు విషయములను ప్రకటించినను, ఆయనగాని, ఆయనశిష్యవర్గముగాని చారిత్ర్యవిషయములు, నీతిశాస్త్రమునకు అనుగుణ్యముగానుండునట్లు మభ్యపరచుటకు వెనుకాడలేదు. నూతన కన్ఫ్యూషియన్ మతము, ప్రాచీనతత్త్వశాస్త్రసిద్ధాంతముల నధిగమించెను. కాని అభ్యాసయుక్తమైన నైతికధర్మములుగల చిన్నపుస్తకమును రూపొందించుటకు సత్యమును మభ్యపరచినవ్యక్తిచే నిది ప్రారంభింపబడెను. దానిలోని మూడువిష

---

* చైనాదేశచరిత్రలో మతము, "వేదాంతము" అను పేరుకలిగి "హూషి" చే, అనువదింపబడిన **Sym Tosisum on Chaineas culture** అను గ్రంథములో 58 పేజీ చూడుడు.

యములు సమన్వయము కొజాలసట్లుగా నుండెను. ఈ సంగ్రహచరిత్రను ముగించుచు, పదకొండు పన్నెందవశతాబ్దములలో చైనానాగరికత ప్రపంచ మంతటి నాగరికతనుమించియుండెననువిషయమును మనము మరువగూడదు.

## "ఖితాన్" "తాంగట్" జర్చెన్ వంశములు

పదిమొదలు పదమూడవశతాబ్దమువరకునుండుకాలములో తూర్పు ఆసియాచరిత్రను తెలిసికొనుటకు, ఉత్తర, పశ్చిమప్రాంతములను జయించిన వారినిగురించి, మనము కొంత విచారించవలసియున్నది. వారినాగరికతస్థితి చైనావారికంటె చాలా తక్కువ. చైనావారితో కలిసిమెలిసియుండి, వారితో వైవాహికసంబంధములను కలిగించుకొనుటవలన, క్రమముగా వారి నాగరికత అభివృద్ధిగాంచెను. ఏదెట్లున్నను, తాము జయించిన రాజ్యములలో తమ సహజస్వభావములను వ్యాప్తిచేసిరి. సమీప దూరదేశ విభేదములు లేకుండా ఆ రాజులందరిచే కప్పముకట్టించుకోగల శక్తివంతులుగా నుండిరి. వీరిలో మొదటివారు "ఖితానులు" లేక "చితానులు". వీరు ప్రాచీన మంగోల్ జాతికిచెంది, మంగోలుభాషను మాట్లాడుచుండిరి. వీరు ఆగ్నేయ మంగోలియానుండి పదవశతాబ్దప్రారంభములో తండ తండాలుగ వెలువడివచ్చి, 926 సం.లో "లియాటంగ్" రాజు "పొ-హె"ను ఓడించిరి. తరువాత స్వల్పకాలములోనే చైనాచక్రవర్తులతో సమానస్థాయిలో వ్యవహరించు చుండిరి. తుది చిన్‌వంశీయులు (936-946) ఖితానులసహాయముతో నిల బడగలిగిరి, కాని, తరువాత బుద్ధిహీనులై వారిని యెదిరించిరి. అందువలన ప్రస్తుత "కెయిఫెంగ్" రాజధానిపై దాడిచేసి, రాజసభికులందరను తూర్పు మంగోలియాలోని ప్రధాన రాజధానినగరమునకు తీసికొనిపోయిరి. అంతటితో నా వంశ మంతమొందెను. *

మరియొక చైనావంశము ఖితానులను యెదుర్కొనుటకు "చావ్—కె

---

* ఈసంగతులు లియోచరిత్ర నాలుగవఅధ్యాయములో నున్నది. ఖితానులను గురించి ఎక్కువ వివరములు తెలుసుకొనుటకు, చైనాసొసయిటీవారిచరిత్రను, లియో (907-1125) కె. ఏ. విట్టుఫోగల్, ఫెంగ్ చి యా షంగ్" లచే వ్రాయబడినదానిని చూడుడు.

యాంగ్-యిన్" అనుపేరుగల ప్రధానసేనాధిపతిని పంపిరి. లోగడ చెప్పినట్లు ఆ సేనాధిపతి అధికారమును తానే స్వీకరించి, సంగ్‌వంశమును స్థాపించెను. కాని, ఖితాన్‌రాజ్యము "లి-యో" మాత్రము యోడింపబడలేదు.

ప్రారంభదశలో ఖైతానులు పశువులకాపరిజాతికి చెందినవారు. పశువులకాపరితనము, గుర్రపుసవారీ, చేపలవేట మొదలగువృత్తులపై వారాధారపడి యుండిరి. వారితెగనిర్మాణము మిశ్రితమైనది. వారి న్యాయశాసనములు, మతాచారములు ప్రాచీనమైనవి. వ్రాత వారికి తెలియదు. ఉత్తరచైనా మైదానములలోనికి వారిరాక తప్పనిసరిగా కొన్నిమార్పులను కలిగించెను. తమ ఆధీనములోనుండిన చైనాదేశస్థులను వారు వ్యవసాయముచేసుకొననిచ్చిరి. క్రమముగా వారుకూడ వ్యవసాయమును ప్రారంభించిరి. వారు రెండువిధములగు వ్రాతలను వాడుకచేయుచుండిరి. మొదటిది "యుగర్" లిపితో వ్రాయబడినది. రెండవదానిలో చైనాఅక్షరములు వాడబడెను. బౌద్ధ టాయిమతములవ్యాప్తి అధికమాయెను. కడుభాగ్యవంతములైన, కొన్ని అధిక భాగ్యవంతములైన కొలది మతములపలుకుబడి మతసంబంధముకంటె రాజకీయవ్యవహారములం దెక్కువగానుండెను.

"లియో"కు చెందిన ఖితానురాష్ట్రము కొంతకాల మత్యంత ప్రబలమైనదిగా నుండెను. సంగ్‌చక్రవర్తులనొద్దనుంచి కప్పమును తీసుకొనుటతోపాటు, వారి పరిసరప్రాంతములలోని రాజులనందరను తమసామంతులుగ భావించుచుండిరి. అత్యున్నతదశలో లియోసామ్రాజ్యము "పెచిలి" సింధుశాఖనుండి మధ్యాసియాలోని "టియాన్-షాన్" పర్వతశ్రేణులవరకు విస్తరించియుండెను. కాని యీ సామ్రాజ్యము శతృరాష్ట్రములచే చుట్టబడియుండి తన సరిహద్దులలోని శతృరాజ్యములలో చొచ్చియుండెను. ఖితానుసామ్రాజ్యాధికారులు తమలోతాము పోరాడుకొనుచుండిరి. 1102 సం.లో ఒక రాకుమారుడు బందిపోటుదండుల సహాయముతో తుదిచక్రవర్తిని యెదిరించెను. ప్రకృతివుత్పాతములు, వరదలు, దుర్భిక్షములు, మిడుతలదండులు సామ్రాజ్యమునంతను అల్లకల్లోలముచేసెను.

"లియో" సామ్రాజ్యమునకు జర్చెన్లు గర్భశత్రువులుగా నుండిరి, ఖితానురాజ్యపు సరిహద్దులలో వారు యుద్ధసన్నాహములను చేయుచుండిరి.

వారు 1114 సం.లోను, 1124-1125 సంవత్సరములలోను వారిదాడులను అధికముచేసి, చైనావారితో సంపూర్ణముగా, ఐక్యముకాజాలని తుది ఖితాను రాజును తరిమివేసిరి. తప్పించుకొనిపోయిన ప్రముఖ "లియో" రాకుమారుడు "యె-లు-టా-షి" (1087-1143) ఒక్కడే.

1124 సం.లో పశ్చిమదిశవైపు పారిపోవుచుండిన ఆయన, కొలది మందిఅనుచరులు, గొప్ప అశ్వికదళము మధ్యఆసియావాసులును, లోగడ ఖితానుసామంతులునగు "యుగర్"లచే వాహ్వానింపబడిరి. వారందరు కలసి, అనేక తుర్కీరాజ్యములను వడివడిగా గెల్చిరి. తరువాత "కారాఖితాయి" (అంటే నలుపుఖితాయీలు లేక పశ్చిమలియోలు) అనుపేరిట నొక నూతన సామ్రాజ్యమును స్థాపించిరి. ఆ రాజ్యము పామీరుపర్వతముల కిరుపార్శ్వములవరకు వ్యాపించియుండెను. "యే-లు," అనుపేరుగల యీ రాజు, ఆయన వుత్తరాధికారులు రాజాధిరాజులు అను గంభీరబిరుదములను వహించిరి. ఈ సామ్రాజ్యము 1211 సం.లో, అనగా జంఘీస్ అధికారమునకు వచ్చినవెంటనే అతాత్తుగా తుదముట్టెను.

చైనాదేశమును జయించిన రెండవతెగవారు టాన్‌గట్టులు. వారు టిబెట్టుదేశీయులు. వారిలో సగము దేశద్రిమ్మరులు, వారిలోసగముమంది స్థిరవాసులుగాను నుండిరి. 990 సం.లో గొప్పగోడకు చేరువగానున్న "కాన్సు" రాష్ట్రములోని కొంతభాగమునకు రాజ్యాధికారులుగా ఖితాను రాజులు వారిని గుర్తించిరి. వారు సియా అనుపేరుతో, వింగ్-సియాను రాజధానిగా చేసుకొని, 1032 సం.లో తమరాష్ట్రమును సామ్రాజ్యమని ఎక్కాణించుచుండిరి. మధ్యఆసియాలోని "యుగర్"లు ఉత్తరచైనాలోని ఖితానులను, పసుపునదీముఖద్వారవాసులు చైనావారల నధిగమించి తమ సామ్రాజ్యమును పాలించుచుండిరి. 1043 సం.లో సంగ్‌రాజులతో యెక్కువ నష్టదాయకముగ సంధిచేసుకొన బలవంతపెట్టబడిరనుసంగతి మనకు తెలిసియే యున్నది. తరువాతసంవత్సరములో వారు ఖితాన్‌రాజ్యముపై దండెత్తుటకు యత్నించిరి.

ఈనాటికి మిగిలియుండినగ్రంథములు కొలదిమాత్రమే యుండగా, -ంగట్‌గ్రంథములు వేలకొలది నిలచియుండెను. ఆ గ్రంథములలో

1132-1190 సంవత్సరములమధ్యకాలములో వ్రాయబడిన రెండు నిఘంటువులును, రెండు ద్విభాషాగ్రంథములును ముఖ్యమైనవి. "త్రిపేటిక" టాంగిట్ భాషలోని కనువదింపబడి ముద్రింపబడెను. తదితర బౌద్ధమతగ్రంథములు కూడ ననువదింపబడెను. టాయిస్టుమతగ్రంథములలో కన్ఫ్యూషియస్‌చే వ్రాయబడెనని చెప్పబడునవి యుద్ధవ్యూహవివరణగ్రంథములు.

ప్రఖ్యాతపురుషులయుపదేశములు, సామెతలు వ్రాయబడిన పుస్తకములు, ధర్మశాస్త్రములు, పద్యకావ్యములుకూడ ననువదింపబడెను. కడు చిక్కులతోగూడిన వారిలిపి ఖితానులద్వారా చైనాభాషనుండి తీసుకొనబడెను. బౌద్ధమతము రాజమతముగానుండి, రాజభవనములో నెక్కువ ప్రాబల్యము గలిగియుండెను.

చైనాదేశములోని పాఠశాలలమాదిరి పాఠశాలలు వ్యాపారపట్టణములలో స్థాపింపబడెను. ఆ పాఠశాలలలో కన్ఫ్యూషియన్‌మతము ప్రబలముగానుండెను.

టాంగట్‌ప్రజలలో నిర్ణీతసంఖ్యాకులగు చైనీయులు, టిబెట్టుదేశీయులు, తార్తాలు తదితరజాతులప్రజలు కలిసియుండిరి. 13 వ శతాబ్దపు ప్రారంభదశలో వీరు సంగ్‌ప్రజలతో సమానమగు నాగరికతను పొందగలిగిరి. దురదృష్టవశమున వారిరాజ్యము మంగోలులమార్గములో నుండెను. మంగోలునాయకుడగు చంఘీస్‌ఖాన్ 1205–1207 సంవత్సరముల మధ్యకాలములోను, తరువాత 1209 వ సంవత్సరములోను వారిపై దాడిజేసెను. తమచక్రవర్తి చంఘీస్‌కు లోబడి, రాజభక్తిని ప్రకటించి, తనకుమార్తె నాయనకు కానుకగా నిచ్చినపుడు మాత్రము వారికి కొంతవిరామము గలిగెను. కాని 1227 వ సంవత్సరములో "ఖారిజ్మ" యను దూరదేశముపై దాడిచేసిన చంఘీస్‌ఖానుకు "టంగట్" రాయబారి సహాయముచేయ నిరాకరించినందున కృద్ధుడై చంఘీస్ తూర్పుననున్న "సి-యా" రాజ్యమును విధ్వంసముచేసెను. ఆ రాష్ట్రి రాజధానినగరము "నింగ్సియా" లొంగిపోవనున్నసమయములో చంఘీస్‌ఖాన్ చంపబడెను.

ఆయనమరణసమయమున ఆయనసేనాని యొకడు ఆ దేశపుప్రజలనందరను నరికివేసి, వారిదేశమును విధ్వంసముచేసి, దానిని గుఱ్ఱములు,

ఒంటెలమేతకు పచ్చికబయళ్ళుగా చేయబడవలెనని యిచ్చిన సలహా నిరాకరింపబడెను. పన్ను అధికముగా విధింపబడుట యుచితమని యీయబడిన నొకచైనాముని మంచిసలహా అంగీకరింపబడెను.

ఉత్తరచైనాను జయించినవారిలో జర్చిన్లు మూడవతెగవారు. వీరు దూరోత్తరమునందుండిన "అమూర్" పరిసరప్రాంతములలో నివసించుచుండిన టంగుట్ప్రభువులు. ఉత్తరచైనా రాజాధిరాజు లను బిరుదుతో ఖితానుల తరువాత రాజ్యమునకువచ్చిరి. ఖితానులనుమించి జర్చిన్లు దూర దక్షిణప్రదేశముల నాక్రమించిరి. వారిసామ్రాజ్య మత్యంతోన్నతస్థితిలో నుండినప్పుడు సామ్రాజ్యములో నుత్తరచైనాదేశము స్వల్పముగా నుండెను. ఖితానులు యెల్లోనదిని దక్షిణసరిహద్దుగా నిర్ణయించుకొనిరి. కాని జర్చినులు దక్షిణమున "హాం-యె" "యాంగ్ట్జి" నదులవరకునుండుదేశము నాక్రమించిరి.

ఖితానులలో నానాటికి పెరిగిపోవుచున్న అనైక్యత, అసంతృప్తివలనను, జర్చిన్లు చైనావారినుంచి పొందుచున్న సహాయమువలనను, జర్చినులు ఖితానులను జయించగలిగిరి. జర్చిన్వంశపాలన "చిన్" (కిన్-బంగారము) 1234 వ సంవత్సరములో నంతమొందెను. మొదటి కొలదిసంవత్సరములు సంగ్రాజ్యముపై దండయాత్రలుచేయుటలో గడచిపోయెను. ఆ దాడులలో నొకటి 1130 వ సంవత్సరమున దక్షిణప్రదేశమునన్న "నింగ్-పో"పై చేయబడెను. 1142 వ సంవత్సరములో జరిగిన యొడంబడికలో చైనావారు జర్చినులకు సామంతులుగానుండుట కంగీకరించిరి. అప్పటినుంచి ప్రతి సంవత్సరము నధికమగుకప్పమును చెల్లించుచుండిరి. కాని నానాటికి క్షీణించిపోవుచున్న తమ సామ్రాజ్యముపై చేయబడుచుండిన దండయాత్రలను వారు నిరోధించుచునేయుండిరి. 1161 వ సంవత్సరములో "యాంగ్ట్జి"నదిని దాటుటకు చిన్ప్రభుత్వము ప్రయత్నముచేసెను కాని,600 యోడలుగల తమ నావికాదళము"సంగ్"ప్రభుత్వరక్షకసేనతుపాకులచే ధ్వంసముచేయబడుటచే వారిప్రయత్నములు నిరర్థకమాయెను.

తమనాగరికతను, ప్రభుత్వనిర్మాణమును కాపాడుటకు జర్చినులెంతయో ప్రయత్నముచేసిరి. ఉత్తరచైనాలోని రాష్ట్రప్రభుత్వమును స్వీకరించుటతో జర్చిన్ప్రభుత్వవిధానము 1115 మొదలు 1182 సంవత్సరముల

మధ్య మార్పుజెందెను. 1132 వ సంవత్సరము తరువాత కేంద్రప్రభుత్వము క్రమక్రమముగా చైనాప్రభుత్వవిధాన మవలంబించెను. 1120 వ సంవత్సరములో రాజవంశీయులలో నొకడు జర్చిన్ "లిపి"ని సృష్టించెను. ఖీతాన్, చైనీయుల "లిపి"ల యాధారముతో నది నిర్మింపబడెను. 1138 వ సంవత్సరములో చక్రవర్తి ఆ లిపిని సుకరముగావించెను. చైనా సారస్వతకావ్యములు జర్చిన్‌భాషలోనికి తర్జుమాచేయబడెను. ప్రథమమున "షామనిస్టు" మతావలంబకులుగానుండిన ప్రజలు 8 వ శతాబ్దమునాటినుండి బౌద్ధమతపరిచయమును గలిగియుండిరి. ఉత్తర రాజధానీనగరములోను, ముఖ్యపట్టణములలోను కన్‌ఫ్యూషియస్ స్మారకచిహ్నముగా భవనములు నిర్మింపబడెను. నెస్టోరియన్‌మతముకూడ కొంత ప్రాముఖ్యతనువహించెను. జర్చినులు ప్రశస్త మతసిద్ధాంతావలంబకులై యుండియు నున్నతమతముపట్ల నెక్కువ ఆసక్తిచూపలేదు.

"లియో" ప్రభుత్వపాలనలో జరిగిన యుద్ధములలో అగర్తలు, ఆనకట్టలు, కాలువలకు గలిగిన చెరుపును మరమ్మతుచేయుట ప్రారంభించిరి. ఈవిధముగా వ్యవసాయము, వాణిజ్యము వర్ధిల్లెను. ఉత్తరచైనా సామంతరాజ్యముగా నున్నకాలములో నాటకప్రదర్శనములు ప్రజాదరణమును పొందెను. 690 నాటకములు ప్రదర్శింపబడెను. విద్వాంసులు చురుకుగా గ్రంథములను వ్రాయుచుండిరి. గణితశాస్త్రము దక్షిణచైనాలోనున్నంత యున్నతస్థితిలోనే ఉత్తరచైనాలోకూడ నుండెను. ఉత్కృష్టమైన రెండు నిఘంటువులు తయారుచేయబడెను. 53525 అక్షరముల విడిభాగము లొక నిఘంటువులో నుదహరింపబడెను.

—:0:—

ఆరవ అధ్యాయము

# మంగోలులు

## యు - ఆన్ వంశము - 1260—1368

మంగోలులుకూడ హైతాన్, జర్చన్ తెగలవంటివారే. కాని, ప్రపంచచరిత్రలో వా రెక్కువ ప్రసిద్ధిగాంచిరి. మొదట వీరు పశువులకాపర్లు. గుర్రములను సంపాదించినపిదప వారు దేశద్రిమ్మరులుగా మారిరి. వారి మతము విశేషముగా విషయాసక్తితో కూడియుండెను. తమ పరిసరప్రదేశములయందున్న శత్రువుల నోడించు వుద్దేశ్యముతో చిన్నచిన్న తెగలుగా విడిపోయియుండిన వీరందరు, వారికి సంపూర్ణ విశ్వాసముగల ఒక నాయకునిఆధిపత్యముక్రింద ఒకేతెగగా కలసిపోయిరి. ఈకార్యమును నిర్వహించినవాడు ముప్పదిసంవత్సరముల వయస్సుగలిగి, వడిగా గుర్రముపై సవారీ చేయగలిగిన గొప్పరౌతు. ఆయన చనిపోవునప్పటికి ప్రపంచంలో సగ భాగము ఆయనఆధీనములో నుండెను. ఆయనే * "తెముజిన్" "జన్‌హిస్" "చంఘిజ్"ఖాన్ (1167 ?—1227) క్రీ. పూ, 1206 సం లో ఆయన సాగరచక్రవర్తి అను బిరుదువహించెను.

12 వ శతాబ్దాంతములో మంగోలులు సర్వాధికారప్రాప్తికి వారిలో వారు పోరాడుకొనుచుండిరి. 1204 సం.లో చంఘీస్‌ఖాన్ మంగోలియాదేశమునకంతకు సర్వాధికారియాయెను. 1206 వ సం.లో "కారకోరమ్"లో సమావేశమైన అఖిలతెగల మహాసభలో ఆయన సర్వాధికారము యేకగ్రీవ

---

* ఆయనబాల్యమునాటి చరిత్రవివరములు యెక్కువగా తెలియవు. ఆయన జన్మదినముగూడ యిదమిత్థమని చెప్పసాధ్యముకాదు. పరిష్యాచరిత్రకారులు 1155-56 సంవత్సరములమధ్యనని నిర్ణయించిరి. చైనాప్రభుత్వ చరిత్రకారులు 1162 లో ననియు, చైనాఅనధికారఆధారములనుపట్టి 1167 అనియు నిర్ణయించిరి.

**Cf: "Grousset, L'Empire Des Steppes"**

ముగా నంగీకరింపబడెను. 1205 సం.లో "తాంగట్" పైనను, నాలుగు సంవత్సరములపిదప "జర్చైన్"పైనను దాడిజేసెను. మంచూరియాదేశము పైనను, పసుపునదీమైదానప్రదేశముపైనను అయన అనేకపర్యాయములు దండయాత్రలుచేసెను. ఇన్ని దండయాత్రలుచేసియు "చిన్"దేశమును ఆయన స్వాధీనపరచుకొనజాలకపోయెను. బహిరంగయుద్ధములలో ఆయనకు యెట్టి ఓటమిలేకుండినను ప్రహరీగోడలలోనుండిన పట్టణములను స్వాధీనపరచుకొనుట దుస్సాధ్యమాయెను. 1215 వ సం.లో ఆనాడు "యం చింగ్" అని పిలువబడుచుండిన నేటి "పెకింగ్" రాజులు కొందరు జర్చిన్‌విద్రోహులవలన దుర్బలులై ఆయనకు లొంగిపోయిరి. "చిన్" రాజధానినగరము కొల్లగొట్టబడి తగులబెట్టబడెను. ఆ నగరవాసులు హత్యచేయబడిరి. "చిన్" రాజ్యచక్రవర్తి "కెయిఫింగ్"కు పారిపోయెను.

ఆ సమయములో తుర్కిస్థానములో జరుగుచున్న భయంకరసంఘటనలను తెలుసుకొని, తన సైన్యములో సగభాగమును ఉత్తరచైనాలో సమర్థుడగు తన సహాయసేనానిఅధీనములో నుంచి, తాను పశ్చిమప్రాంతములకు వెడలెను. ఆయనసహాయసేనాని 8 సంవత్సరములకాలము చైనాయుత్తరభాగమును కొల్లగొట్టియు, ధ్వంసముచేసియు తనస్వాధీనముచేసుకొనెను, ఇంతజేసియు నచటిప్రజల అవరోధమునుమాత్ర మాపజాలకపోయెను. ఇదే సమయములో మరియిద్దరు మంగోలుసేనానులు కొరియాదేశములో ప్రవేశించిరి. 1223 సంవత్సరముపిదప తూర్పుప్రాంతములలో జరుగుచున్న యుద్ధములలో కొంత యుపశమనము గలిగెను. కాని 1227 సం.లో "తాంగట్" విషయము తేల్చుకొనుటకు చంఘిస్ తిరిగివచ్చెను. ఆ దాడిలోనే ఆయన తన ప్రాణముల గోల్పోయెను. ఆయన యుత్తరాధికారి "ఒగోడే" 1231 సం.లో తిరిగి యుద్ధముచేయ మొదలిడెను. సైన్యములోని కొంతభాగమును పసుపునదిదిగువభాగమునకు చేర్చెను. ఆయన సోదరుడు మరికొంతసైన్యమును"జెచ్-అన్"లోని సంగ్‌రాష్ట్రములోనికి పంపెను. ఈ విధముగా వారు చక్రవ్యూహమునుపన్ని పిదప దక్షిణ "హొనాన్"లో ప్రవేశించిరి. మంగోలుసైన్యములో నత్యంత నిపుణుడగు "సుబొటాయి" 1233 సం.లో "కెయిఫెంగ్"ను స్వాధీనపరచుకొనెను. 1234 సం.లో చైనాసైన్య

ములు, మంగోలుసైన్యములు కలసి "చిన్" చక్రవర్తిని యోడించిరి. "చిన్" చక్రవర్తి తూర్పుప్రాంతములకు పారిపోయెను.

కొందరు సంగులమూర్ఖసలహానుగుణ్యముగా వర్తించకుండినచో తూర్పుఆసియాలో మంగోలులదాడులు తుదముట్టియేయుండును. వారి దయానుగ్రహములకు పాత్రులైయుండుటకుమారుగా చైనీయులు మంగోలులతో యుద్ధమునకు తలపడిరి. ఈపని ఆత్మహత్యాకరమగు రాజనీతిగా పరిణమించెను. దీనికి నిదర్శనము వారిమధ్య జరిగిన ఘోరయుద్ధములే. ఈ యుద్ధములు చైనా అగ్నేయప్రాంతమునందును, మధ్యభాగమునందును, నైఋతిప్రాంతములలోను 45 సంవత్సరములకాలము కొనసాగెను. యూరోపులోను ఆసియాలో జరిగిన యితరపోరాటములలోను గాంచనటువంటి తీవ్రఅవరోధమును రక్షణప్రయత్నములను చైనాలో జరిగిన పోరాటములలో వారెదుర్కొనిరి. ఆకాలములో అమలులోనుండిన యంత్రసాధనములను వ్యూహములను వాడవలసిన ఆవశ్యకత వారి కెక్కువగానుండెను. తమ గుర్రముల స్వారీ కనువుగాని మెట్టభూములలోను, తమ సైనికులలో యెక్కువమంది మరణమునకు హేతుభూతములగు రోగప్రదేశములలోను, తమ కలవాటులేని నావలలోను పోరాడవలసివచ్చుటయే దీనికి కారణము. వారు స్వాధీనపరచుకొనిన ప్రతి యుద్ధఖయిదీని, వేర్వేరువిషయములలో ప్రత్యేక నైపుణ్యముగలిగిన ప్రతిమిత్రుని వారిస్వలాభమున కుపయోగించుటయే వారివిజయమునకు కారణము.

1227 సం.లో తాము గెలిచిన ప్రదేశములలోని ప్రజలను సమాధానపరచుట, ప్రభుత్వయుద్ధములకు వలయు ఖర్చులను వారియొద్దనుండి వసూలుచేయవలసిన అవసరమును వారు గ్రహించిరి. ఖైతానుమిత్రుడు "యె-లు-చుత్సై"ను (1199-1244) తాంగట్ప్రజలయొద్దనుంచి పన్నులు వసూలుచేయమని కోరుటయే "చంఘీస్" చేసిన తుదికార్యము. చైనాలో స్వాధీనపరచుకొనిన ప్రదేశములు 1230 సం.లో రెండుభాగములుగా విభజింపబడినపుడు వాటిని "యేలు" స్వాధీనములో నుంచెను. పరిపాలనను నిర్వహించుటకు మంగోలుఅధికారులు, చైనానిరంకుశాధికారులు అల్పసంఖ్యాకులుగా నుండుటచే, ఆయన యుత్తరచైనాలో చాలా శిక్షణశాలలను

స్థాపించి, పరీక్షల నేర్పాటుచేసెను. ఆ పరీక్షలో నుత్తీర్ణులైన 4030 మంది ప్రభుత్వపదవులలో నియమింపబడిరి, 1231 సంవత్సరములో మంగోలులు కొరియాను స్వాధీనపరచుకొని, దానిని 72 మంగోల్ స్థానికపర్యవేక్షణ దారుల అధికారముక్రింద (రక్షణరాజ్యము) అధీనరాజ్యముగా నేర్పాటుచేసిరి. 1232 వ సంవత్సరములో అతాత్తుగా పితూరీ బయలుదేరెను. దానినణచివేసి యథాప్రకారము పాలన కొనసాగింపబడెను. యుద్ధములలో గెలిచిన ప్రదేశ ములపై మంగోలులే సర్వాధికారులుగా నియమింపబడిరి, కాని, వారిలో చైనీయులు, టాంగట్లు, పరిష్యనులు, యుగురులుకూడ నుండిరి. వాటిలో "యుగురు" శాఖ ప్రధానమైనదగుటచే ఆ భాషాక్షరములే మంగోలుభాషకు కూడ వాడుచుండిరి. *

ఈయనపాలనలో చైనా, పరిష్యా, రష్యాదేశములను కలుపు సామ్రాజ్యరహదారులనిర్మాణము కడు ముఖ్యమైనది. పశ్చిమఆసియావైపు ప్రథమ రహదారి 1219 సంవత్సరములో చంఘీస్‌ఖాన్‌చే వేయబడెను. ఆయనపిదప రాజ్యమునకువచ్చినవారు రీ కార్యమును కొనసాగించిరి. ఈ బాటలలో నచటచట తపాలా, సైనికస్థావరములను నిర్మించిరి. వాటిపోషణ కవసరములగు ధాన్యపుగిడ్డంగులు, పచ్చికబయళ్లు నిర్మాణముచేయబడెను. ఆసియాఖండమంతటిలోను చలామణిపత్ర (Currencynots) ప్రమాణ మును సుస్థిరముచేయుటకు మంగోలులు చైనాకాగితపునోట్లవిధానము నవ లంబించిరి. అచ్చొత్తింపబడిన ఆ చలామణిపత్రములు విరివిగా చలామణి యగుచుండెను. అందువలన ద్రవ్యోల్బణ మధికమాయెను. • అందుచే 1311 సంవత్సరమునుండి కాగితపునోట్లు జారీచేయుట నిలుపుదలచేయబడెను.

---

* మంగోలులయుత్పత్తినిగురించి తెలియజేయు ప్రాచీన స్మారక చిహ్నము "యుగర్" లిపిలోనుండిన మంగోలుభాషలో 5 పంక్తులలో వ్రాయబడియుండెను. క్రీ. పూ. సుమారు 1220 మొదలు 1255 సంవత్సర ములమధ్య నది వ్రాయబడియుండెను.

• సి. యస్. గార్డ్‌నర్ అనువాదములపై నాధారపడిన యీ కథను రాబర్ట్ బ్లేక్ (హార్వర్డు జర్నల్ ఆఫ్ ఏషియాటిక్ స్టడీస్, II 291-328

చైనానుంచి వెండి యెక్కువగా పశ్చిమదేశాలకుపోవుటయే, తూర్పు పశ్చిమఆసియాదేశములు గమనించదగిన ముఖ్యవిషయము. మంగోలుల ప్రభుత్వమువలన చైనా అనేకలాభములనుపొందెను. రాకపోకలకు రహదారులు నిర్మింపబడెను. నీటివసతికి, ప్రయాణసౌకర్యములకు కాలువలు త్రవ్వబడెను. వేగముగా స్వారీచేయగల రెండులక్షల అశ్వములు అంచెల క్రింద విశ్రాంతిభవనములయొద్ద నుంచబడెను. 1260 సంవత్సరములో పెకింగ్ నగరము (ఖాన్ బాలిక్) శీతకాలపురాజధానిగా నిర్ణయింపబడెను. తరువాత ముప్పది సంవత్సరములకాలములో ఆ నగర మొక మునల్మానుచే పునర్నిర్మాణముచేయబడెను. గొప్పకాలువ పెకింగ్‌నగరమువరకు త్రవ్వబడెను. 1260_1294 వరకు ఖాన్‌గానుండిన "కావ్ షౌ-చింగ్ (1231-1316) చంఘీస్థాన్‌మనుమడు "కొబిలేఖాన్‌చే" గొప్ప బాధ్యతాయుతమగు వ్యవహారము లొప్పగింపబడిన కొలదిమంది విదేశీయులలో నీయ నొకడు. చైనాపాలకులలో యీయన చాల ఘనుడు. ఈయనఆధిపత్యముక్రిందనే గొప్పకాలువ పునర్నిర్మాణముచేయబడెను. 1264 సంవత్సరముపిదప ననేక దండయాత్రలఫలితముగా విచ్ఛిన్నమైన "కాన్సు" కాలువవ్యవస్థ తిరిగి నిర్మాణముచేయబడెను. 11 శతాబ్దములోరాజకార్యనిపుణుఁడు "వాంగ్-అన్-షి" గారిచే ప్రారంభింపబడిన దుర్భిక్షనిరోధకవిధానము తిరిగి ప్రారంభింపబడెను. ప్రభుత్వముచే ధాన్యగిడ్డంగులు కట్టబడెను. పంట విశేషముగా పండినసంవత్సరములలో ధాన్యమును కొని, పంటలేనిసంవత్సరములలో బీదల కుచితముగా పంపిణీచేయుతలంపుతో ప్రతిసంవత్సరము సామ్రాజ్యాధికారులచే పైరు తనిఖీచేయబడుచుండెను.

---

డిసెంబర్ ∙ 1937 యీవిధముగా వ్రాసెను. "1260 సంవత్సరములో జారీ చేయబడిన నాణెములు 1287 సంవత్సరములో ఐదింటికి ఒకటిచొప్పునను, 1309 లో జారీచేయబడినవి ఐదింటికి ఒకటిచొప్పునను మార్పుచేయబడెను." ఈవిధానము ఆసియాలోని పాశ్చాత్యదేశసలహాదారుల నిర్ణయానుసారముగానే చైనాఆర్థికశాఖవారు వర్తించిరనువిషయమును బ్లేక్‌గారు గుర్తింపలేకపోయిరి.

మంగోల్‌సామ్రాజ్యము వ్యాప్తిగాంచుచుండెను. అత్యంత ముఖ్యము లైన నైఋతిప్రాంతప్రదేశములు చైనాలో చేర్చబడెను. తరువాత నా ప్రదేశమే "యునాన్" రాష్ట్రముగా పేర్కొనబడెను. "టియాంగ్" కాలములో యీ రాష్ట్రము "తాయి" రాజుల రాజ్యభాగముగా నుండెను. ఈ నూతన రాష్ట్రమును మంగోలుఅధికారులే పాలించుచుండిరి. తాయిరాజుయొక్క అధికారము నామమాత్రముగా నుండెను.

1257-1258 సంవత్సరములమధ్యకాలములో "యురియాంగ్‌కాయె" అన్నాంరాష్ట్రముపై దండెత్తి ఆ రాజును తనతాబేదారుగా చేసుకొనెను. అటుపిమ్మట "కుబిలె" తనదృష్టిని జపాన్‌దేశముపై మరలించెను. దానిని స్వాధీనపరచుకొనుటకు రాయబారులద్వారా జరిపిన రెండుప్రయత్నములు విఫలముకాగా, 1274 సంవత్సరములో కొరియా, చైనాఅధికారుల ఆధిపత్యముక్రింద 150 నౌకలుగలిగిన దళమును జపానుపైకి పంపెను. కాని ఆ దళాధిపతులు నిరుత్సాహవంతులగుటచే నా ప్రయత్నముకూడ మొదటి రెండుయత్నములవలెనే విరర్థకమాయెను. 1279 సం.లో "యాంగ్‌చౌ" "చు అన్ చౌ" నగరములతోపాటు నాలుగుపట్టణములలో నౌకానిర్మాణస్థావరములను నిర్మాణముచేయవలెననియు, రెండుసంవత్సరముల పరిమితికాలములో 600 యుద్ధనౌకలు తయారుకావలెననియు నాయన ఆజ్ఞాపించెను. 1281 సం.లో రెండు యుద్ధనౌకాదళములు తయారుకాగా, నొకటి కొరియా తీరమునను, రెండవది చైనాఅగ్నేయకోస్తాతీరమునను నుంచబడెను.

మంగోలుపాలెగాండ్రలో పట్టుదల, యుత్సాహము లేకపోవుట, జపానువారు ధైర్యసాహసములతో నెదుర్కొనశక్తివంతులగుట, భగవత్ప్రేరితముగా సంభవించిన తుపాను యీ మూడవయోగములు ఒకటికి మరొకటి తోడై, నావికాసైన్యమును విధ్వంసముచేసెను. వేలకువేలు సైనికులు ఆ ద్వీపవాసుల వశమైరి.

తరువాత యిరువదిసంవత్సరములకాలము మంగోలులు ఆసియా ఖండమున కాగ్నేయదిశనుండిన యితరరాజ్యములలో ప్రవేశించిరి. కాని వారియాక్రమణ అచట నస్థిరముగనే యుండెను. వ్యాధులు, గెరిల్లాదాడులు, సంపూర్ణఅపజయములు మొదలగు కారణములచే వారు "చంపా అన్నాం"

జావాదీవులను వదలివేసిరి. బర్మాదేశములోమాత్రము వారు విజయము గాంచిరి. ఈ రాష్ట్రములలో కొన్నిప్రదేశములుమాత్రము కొంతకాలము వరకు వారిఅధిపత్యము నంగీకరించి "పెకింగ్"కు కప్పములను పంపుచుం డిరి. 1294 సంవత్సరములో "కుబిలె" మరణించగానే ఆయనవెనుక నధి కారమునకువచ్చిన "తైమూర్" వారందరిని మన్నించిన ట్లుత్తరువులను పంపెను.

ప్రపంచ మానాటి కెంత విస్తృతమైనదో పైన వ్రాయబడిన యధ్యా యములలో వివరింపబడియున్నది. పశ్చిమఆసియా, ఐరోపాలనుండి చైనా రాజ్యము రాజకీయముగా ప్రత్యేకింపబడిలేదు. కొరియాదేశముమొదలు డాన్యూబ్‌నదివరకు వ్యాప్తిగాంచిన నొకమహాసామ్రాజ్యముగా నుండెను. అరబ్బులు, వెనీషియనులు, రష్యనులు చైనా కోస్తారేవుపట్టణములలో వర్త కముచేయుచు, మంగోలురాజ్యములో ప్రవేశించుచుండిరి. చైనావారు, మంగో లులు పరిష్యాలోనికిని, ఐరోపాలోనికిని చొచ్చుకొనిపోవుచుండిరి.

సంక్షిప్తముగా వ్రాయబడునట్టి యీ చరిత్రలో ఆకాలపు భావపరి వర్తనములు, విజ్ఞానము చూచాయగా తెలుపుటకుమాత్రమే సాధ్యమగును. సైనికావసరములకు కావలసిన మందుసామాను, అది వ్యాప్తమైనవిధాన మిదివరలో వ్రాయబడియుండెను. "పెకింగ్"లోనేకాకుండా 1294 వ సంవ త్సరమునుంచి "టేబ్రిడ్జిలో"కూడ ముద్రింపబడిన కాగితపు కరెన్సీనోట్లను గమనించి, యూరోపియనులుకూడ అచ్చువేయుట నేర్చుకొనియుండ వచ్చును.

మతరక్షణయుద్ధములు (Crusades) * జరుగుచుండిన కాలములో చైనా, మధ్యఆసియాదేశములలో వాడబడుచుండిన నమూనాలననుసరించి

---

* అచ్చునుగురించి పాశ్చాత్యులచేసీయబడిన ప్రథమవివరములు యూరోపియన్‌గ్రంథాగారములలో ఖ్యాతిగాంచి, "రషిదుద్దీన్"చే వ్రాయబ డిన ప్రపంచచరిత్రలో నుదహరింపబడినవి.

ఈ నూతనవిషయమును కనిపెట్టిన చైనాదేశమునకు ఐరోపాఖండ మెంతయో ఋణపడియున్నదని ప్రథమ యూరోపియన్‌చరిత్రకారుడు "పౌలస్ జోవియస్" సూచించెను.

ఈజిప్టులో తయారుచేయబడుచుండిన అద్దకపువస్త్రములను, అక్షరములు చెక్కబడిన కర్రదిమ్మలను జూచియైనను యూరోపియనులు దానిని నేర్చుకొనియుండవచ్చును. నాడినిగురించి వ్రాయబడిన చైనా వైద్యశాస్త్రము పరిష్యన్ భాషలోని కనువదింపబడెను. తదితరచిత్రకళలలో ప్రసిద్ధిగాంచిన చైనాప్రభావము పరిష్యాప్రతిమలలో, భవనములలో, పింగాణీపాత్రలపై వ్రాయబడిన వన్నెచిన్నెలలో, సంగీతశాస్త్రములోను పొడకట్టుచుండెను. ఇటలీ, మధ్యయూరప్ దేశములలోని మతాధికారులు చైనాదేశపువస్త్రములను ప్రీతిపూర్వకముగా ధరించుచుండిరి. *

"సొరగమ్"అని పిలువబడు ఆహారధాన్యము చైనాలో పండింపబడుచుండెను. ప్రథమమున నీ ధాన్యము అబ్సీనియాదేశములో నుత్పత్తియాయెను. 13 వ శతాబ్దములో హిందూదేశముద్వారా యీధాన్యము చైనాకు తేబడెను. ఉత్తరచైనా, మంచూరియాదేశములలో పండింపబడు జొన్నలవలె నిదియు విరివిగా పండుచుండెను. పచ్చిముల్లంగి, బాదం, ద్రాక్షరసపానీయములు చైనావారి కాహారపదార్థములు. సయాందేశపు చెట్టునుండి తయారుచేయబడిన "చైలామూగ్ర" తైలము, చైనాదేశములో నత్యంత ప్రాముఖ్యత గాంచిన నూతన యౌషధము. "చూ-చెన్-హెంగ్" (1281-1358) దానిని కుష్టుజాడ్యనివారణౌషధమని ప్రకటించెను. పశ్చిమదేశపు సంగీతవాయిద్యములు కొన్ని యీదేశములో వాడుకజేయబడెను. మంగోలులపాలనలో నావాయిద్యములు ప్రాముఖ్యతగాంచెను. పశ్చిమ, మధ్యయాసియాప్రదేశముల నుండి పలురకములగు సంగీతవాయిద్యములను ముసల్మానులు చైనాలో ప్రవేశపెట్టిరి. అవి చాలకాలమువరకు తుర్కీ, పరిష్యా, అరేబియా దేశముల కృత్రిమనామములతో వాడబడుచుండెను.

పరిసరదేశములవారు చేసిన నూతనపరిశోధనలతో చైనాశాస్త్ర విజ్ఞాన మభివృద్ధిగాంచెను. 1267 సంవత్సరములో పరిష్యాదేశపు జ్యోతిష, భూగోళశాస్త్రజ్ఞుడు "కుబిలే" యుపయోగార్థము సంవత్సరసాంఖ్యానిక శాస్త్ర విధానము, పరిష్యాదేశపుభూగోళము, వాటితోపాటు నక్షత్రశాస్త్రమునకు సంబంధించిన ఆరుసాధనములనుకూడ కానుకగా సమర్పించెను. ప్రముఖ

* ఒట్టోవాన్ ఫాల్కీచే వ్రాయబడిన "డకరేటివ్ సిల్క్స్" పే. 30.

జలయంత్రశాస్త్రజ్ఞుడు "కావ్-షౌ-చింగ్" (1276-1279). వీటిప్రోత్సాహముతోడనే "కుబిలె" నిమిత్తము 17 సాధనములను తయారుజేసెను. ఆకాలపు చైనాదేశపు గణితశాస్త్రవిజ్ఞానము "కావ్"ను విదేశములపై నాధారపడవలసిన ఆవశ్యకతలేనంతటి తృప్తికరముగా నుండెను. "కావ్-షౌ-చింగ్"చే తయారుచేయబడిన 17 పనిముట్లు పోతలోగాని, కచ్చితముగా నుండుటలోగాని ఆనాటిప్రపంచములో వేనికిని తీసిపోనంతటి సున్నితముగా నుండెననుట నిర్వివాదాంశము. చైనాదేశపు ప్రధాన కళావాహినులు చరిత్రానుగుణ్యములగుప్రవాహములలో ప్రవహించుచుండినను, పశ్చిమదేశముల శిల్పకళలపైనను, గృహనిర్మాణములపైనను చైనాప్రభావము వెల్లడియైనట్లుగానే, టిబెట్టు, మంగోలియా దూరపశ్చిమదేశములు చైనాదేశముపై తమ ప్రాభవమును నిరూపించుచుండెను.

రూపములోను, అలంకరణలోను పింగాణీ, కంచువస్తువులపై పరిష్యాదేశపు చిత్ర శిల్పప్రతిభ గోచరమగుచుండెను. పలుచటి గాజుపలకలు నవీనముగా తయారుజేయబడెను. "ఓజన్‌హైర్" కళాకారు లవలంబించిన నూతన విధానానుసారముగా నీ గాజుపలకలు తయారగుచుండెను. ఈ విధానము కనిపెట్టబడినకాలము యిదమిత్థమని చెప్పసాధ్యముకాదు. ఇరాన్‌దేశములో తర్ఫీదుపొందినటువంటి ముస్లిమ్ తాపీపనిహెంద్రచే మంగోలియాదేశములో "కుబిలె"చే కట్టింపబడిన ఉదారంగుగల ప్రఖ్యాతబురుజు ఆనాటి వాస్తుశాస్త్రనైపుణ్యమును వెల్లడిచేయుచుండెను. చైనాదేశమంతటిలోను మసీదులు విరివిగా కట్టింపబడెను. బౌద్ధమతములవలెనే యీ మసీదులుకూడ దేశీయనిజస్వరూపమును ప్రతిబింబించుటయేగాక, చైనాదేశపు లక్షణములనుకూడ మూర్తీభవింపజేయుచుండెను. టిబెట్టు లామామతస్థుల రాకతోపాటు కొన్ని లలితకళానైపుణ్యముకూడ యీదేశమునకు తేబడెను. టిబెట్టు, మంగోలియాదేశములలో సర్వవ్యాప్తమైన ప్రార్థనావిధానము చైనా, కొరియా, జపాన్‌దేశములలోకూడ నవలంబింపబడెను.

"యూన్" పాలనలో నవలంబింపబడిన అనేకమతములు ఆత్మవికాసముమాత్రము గలుగజేయజాలకుండెను. "టియాంగ్" పాలనలోవలెనే మతములన్నియు పరస్పరానుభూతిగలవై యుండెను. "యూ ఆన్" కాల

ములో యిస్లామ్, నెస్టోరియన్, రోమన్‌క్యాథలిసిజమ్ మొదలగు మతము లన్నియు చైనాలో ప్రవేశించెను. * 1368 సంవత్సరములో కడపటి రెండు మతములు క్షీణించిపోయెను. మధ్యఆసియాలోను, చైనా పశ్చిమ పరిసరసీమ లలోనుండిన జన్మస్థావరములు సుస్థిరముగానుండుటచే యిస్లామ్‌మతము సజీవముగానుండెను.

పదమూడవశతాబ్దమునకు పూర్వము టిబెట్టుదేశములోని "లామా (బౌద్ధమతము) మతము మంగోలియాలోగాని, చైనాలోగాని యెట్టి ప్రాబల్యమును గాంచకుండెను. మంగోలుచక్రవర్తుల ప్రోద్బలముతో నీ మతము మంగోలియాలో స్థావరమేర్పర్చుకొనెను. లామా ఆశ్రమములు, చైనాలోని కొన్నిప్రదేశములలో ప్రత్యేకముగ పశ్చిమభాగములో రాజధానినగరములోను కట్టబడెను. "సాంగ్-ఖా-పా", అయన (1357-1419) వంశీయులచే సంస్కరింపబడిన యీ లామామతము మింగ్‌పాల నాంత్యకాలములో మతసంబంధముగానేగాక, రాజకీయముగాకూడ వృద్ధిగాంచెను. చంఘీస్‌ఖాన్ 1219 సంవత్సరములో ఆక్సస్‌నదీతీరముననుండిన తన నివాసమునకు షాన్టంగులో యేకాకిగా నివసించుచున్న "చియు-చు-చి"అను పేరుగల టాయిస్టుమతసన్యాసిని ఆహ్వానించి గౌరవించెను, 1224 వ సంవత్సరములో చైనాకు తిరిగిరాగానే యీ పుణ్యపురుషుడు బౌద్ధమతమునకు నష్టదాయకముగా టాయిస్టుమతాభివృద్ధికి నెక్కువగా కృషిచేసెను. జర్చెన్-మంగోలుయుద్ధములలో పాడుపెట్టబడిన ననేక బౌద్ధదేవాలయములను టాయిస్టు లాక్రమించుకొనుట కనువగు యుత్తరువులను అధికారులపై తనకుగలపలుకుబడిని యుపయోగించి జారీచేయించెను. బౌద్ధమతస్థులను

---

* సంగ్‌వంశపాలనలో యూదియామతము అస్థిరమైనస్థితిలో "కెయిఫింగ్" చుట్టుపట్లనుండు యూదుమతచర్చిలలో నుండెను. మింగ్ వంశీయులపాలన ప్రారంభదశలో నీ మత మమలులోనుండిన సముద్రతీర ప్రదేశములలో పూర్తిగా నిర్మూలింపబడెను. 845 సంవత్సరములో గుప్తముగా నుండిన "మాణిక్యమతము" "యు-ఆన్" ప్రభువుపాలనలో "ఫూకియన్" రాష్ట్రములో కొలదిదశాబ్దములపర్యంతం వెలువడెను, కాని "మింగ్" వంశస్థాపకునిచే తీవ్రముగా నిరోధింపబడెను.

నిందించుచు రెండుగ్రంథములనుకూడ నాయన వ్రాసెను. కాని, బౌద్ధమత మాహాత్మ్యమునకే తిరస్కరింపబడలేదు. 1255 సంవత్సరములో బౌద్ధ, టాయిమతసిద్ధాంతముల యుచితానుచితములను చర్చించుటకు బహిరంగ సమావేశము ఏర్పాటుచేయబడెను. ఆ చర్చలలో బౌద్ధులే విజయముగాంచి నట్లు నిర్ణయింపబడినను, టాయిస్టులుమాత్రము తమ విరుద్ధప్రయత్నములను విరమింపకుండిరి. 1227 సంవత్సరమునకుపూర్వ మాక్రమింపబడిన ఆస్తి పాస్తులనన్నిటిని వారికి తిరిగియిచ్చివేయమని "కుబిలె" యాజ్ఞాపించెను. 1258 సంవత్సరము ఆగస్టులో తనసోదరునిసలహాతో టాయిమతగ్రంథము లను ప్రభుత్వము వశముచేసుకొని, వాటిని తగులబెట్టమని ఆజ్ఞాపించెను. చైనాదేశమునంతను గెలిచినపిదప 1281 సం.లో పైయుత్తరువులనే మరి యొకమారు ప్రకటించెను. టాయిస్టుమతగ్రంథములన్నియు తగులపెట్ట బడెను. పదిశతాబ్దములపాటు వ్యాప్తిలోనుండిన టాయిస్టుమతసాహిత్య మింతటితో నాశనమగుటవలన ఆ మతమునకు తీరనినష్టము వాటిల్లెను. టాయిస్టుసాహిత్యము పోయినను, టాయిస్టుమతము నిలచియేయుండెను. ఈ మతము మంగోలుప్రభుత్వపతనమునకును మంగోలుప్రభుత్వసర్వనాశ నమునకు యితరమతములతోపాటు తానుకూడ రహస్యముగా యత్నించెను.

బౌద్ధమతము మతవిషయికముగా తనప్రాబల్యమును గోల్పోయి నను, రాజకీయముగా తనఆధిక్యతను చూపుచునేయుండెను. "వెయి తా ర్తార్లు"ను, వారితరువాతవచ్చిన ఉత్తరదోపుడుదార్ల ఆదరణమును బొందుటచే మూడవతరపు మంగోలులు యీ మతమునం దెక్కువ అభిమానమును జూపిరి. మంగోలువంశాంత్యకాలమువరకు యీ మతము రాజాదరణమును పొందుచుండెను. బుద్ధదేవుని అస్థికలు దెచ్చిన సింహళదేశపురాయబారులను "కుబిలె" రాజు మర్యాదలతో నాహ్వానించెను. ఈవిధముగా చైనాలో బౌద్ధ మతమును; టిబెట్టు, మంగోలియాలలో లామామతమును బలపరచుచుండుట వలన, యిస్లాంమతముతో పెద్దపెట్టున పోరాటమురాకుండా చైనాను కాపా డెను. ఆకాలమునుండి అయిదుశతాబ్దములవరకు చైనాదేశములో ముస్లిం మతవిద్వేషములు లేకుండుటయే దీనికి గొప్పనిదర్శనము. శవములను తగులపెట్టు భారతదేశపుటాచారమును వ్యాపింపజేసిరి. తిరిగి యున్నతస్థితికి

వచ్చుచుండిన "మింగ్" వంశీయులు యీ శవదహనాచారమును తుదముట్టించెను. పరదేశీయులజాడలు యీషన్మాత్రము లేకుండాచేయుకోరికతో యీయన యీ పద్ధతి నవలంబించెను. బౌద్ధమతస్థులుమాత్రము యీ దహనసంస్కార సంప్రదాయముల నవలంబించుటకు అనుమతింపబడిరి. *

కైతాన్, జర్చిన్‌పాలన మూడుశతాబ్దములకాలములోను ఉత్తర చైనాలో అనేక కష్టనష్టములకు గురియైన కన్ఫ్యూషియన్‌మతము యీకాలములో తిరిగి కొంత బలమును సమకూర్చుకొనగలిగెను. 13 వ శతాబ్దార్ధములో నెట్టియలజడి లేకుండుటయే దీనిఅభివృద్ధికి కారణము. కన్ఫ్యూషియన్‌మతముపట్ల మంగోలుప్రభువులు కొంత ఆదరణను చూపిరి. కైతాను ప్రభువు, "యె-లు-చుటె" సలహానుగుణ్యముగా "ఒగొదె," కన్ఫ్యూషియన్ కళాశాలలను పునర్నిర్మాణముచేసెను. ప్రముఖమతవాది "చు-సి" కళాశాల నిర్వాహకుడుగా "కుబిలె"చే నియమింపబడెను. "చాంగ్-యన్"లో రెండవ కళాశాలకూడ ప్రారంభింపబడెను. "కుబిలె" పెకింగ్‌నగరములో కన్ఫ్యూషియన్‌పేర ఒకదేవళమును నిర్మాణముచేయించెను. కన్ఫ్యూషియస్‌కు నూతనబిరుద మొసంగబడెను. కన్ఫ్యూషియన్‌యోధులకు నూతనమర్యాదలొసంగబడెను. "యశోమందిరము" (Hau of fame) లో తొమ్మిదిమంది సంగ్‌కన్ఫ్యూషియనులకు స్థావరములొసగబడెను.

ప్రభుత్వములో కొందరు మతోద్ధారకులకు యున్నతపదవు లొసగబడెను. నిలుపుదలచేయబడిన పోటీపరీక్షలు తిరిగి ప్రారంభింపబడెను. ఆ పరీక్షలలో చాలమంది చైనీయులు యుత్తీర్ణులైరి. ఒకవిదేశీయుడుకూడ ఆ పోటీపరీక్షలలో నెగ్గెను. 1330 సం॥నాటికి కన్ఫ్యూషియనులు ప్రధాన న్యాయస్థానములలోను, రాష్ట్రీయప్రభుత్వకార్యాలయములలోను శిస్తువసూలు శాఖలలో అధీనయుద్యోగులుగా నియమింపబడిరి. వారిప్రజ్ఞ, తర్ఫీతు, అవ

---

* సామాన్యమానవుని దహనక్రియల తుదివివరములకు "షు-హు-చు ఆన్" అనుగ్రంథమును చూడుడు. ఈగ్రంథమును పెరల్‌బక్ "ఆల్ మెన్ ఆర్ బ్రదర్సు" అనుగ్రంథముపేరిట అనువదించెను. ఆగ్రంథములో 444-445 పేజీలు చూడుడు.

సరమైనపదవులలోను, వారిపలుకుబడిని నిరోధింప వీలగు పదవులలో మాత్రమే వారు నియమింపబడిరి.

"యూయాన్" కాలములో సాహిత్యగ్రంథరచనాప్రవాహము స్వల్పముగా సాగుచు, సంగ్‌సాంప్రదాయము కొనసాగుచుండెను. పదమూడవ శతాబ్దమునాటి బాటసారులు, వ్యాపారులు, చారులు తమ ప్రయాణవివరములను పుస్తకరూపముగా వ్రాయుచుండిరి. పసుపునదముయొక్క అసలు జననస్థానము నన్వేషించుట కపూర్వ ఆసక్తిగల "కుబిలె" 1280 సంవత్సరములో పరిశోధనసంఘమును పంపెను.

1311-1320 సంవత్సరముల మధ్యకాలములో దేశపటములపుస్తకము (Atlas) "చు-స్సు-పెన్" అనుపేరుగల చైనా భూగోళశాస్త్రజ్ఞుడు తయారుచేసెను. కొంతకాలము గడచినపిదప టిబెట్టుదేశపటములు, గ్రంథములను చైనాభాషలోని కనువదించెను. 1300 సంవత్సరములో తయారుచేయబడినదిగా చూపట్టు మరియొక ప్రపంచపటములో ఆసియా, యూరోప్, ఆఫ్రికాఖండములు నిరూపింపబడెను.

పదివందలఅధ్యాయములతో 1303 సంవత్సరములో ప్రచురింపబడిన సామ్రాజ్యభూగోళము చైనారికార్డులోనున్న గ్రంథములలో నుత్కృష్టమైన గ్రంథము.

నాటికలు, కల్పితగాధలపట్లనున్నంతశ్రద్ధ ఆదరణ యీశకములో గోచరముకాలేదు. చిన్‌కాలపునాటి నాటకములజాతికే యీనాటికలుకూడ చెందియుండెను.

నేటివరకు నిలచియున్న 116యు-అన్*నాటకరచయితలలో 61మంది చైనాదేశీయులే. ఒకరుమాత్రము జర్చిన్‌దేశస్థుఁడు. ఈ నాటకరచయిత

---

* క్రీ. పూ. 1300 సంవత్సరప్రాంతములో వ్రాయబడిన వేరొక నాటకభాగములు "కరఖోటో" అను ప్రదేశములో "కర్నల్‌కాజ్‌లావ్" అను రష్యాదేశపు పురాతనవస్తుశాస్త్రజ్ఞునికి 1908 వ సంవత్సరములో దొరికెను. పునర్నిర్మాణముచేయబడుటకు వీలుగానంత చిన్నాభిన్నముగాకున్న ఆ నాటకము నేటికిని నిలిచియున్న అనేక తదితరనాటకములవలెగాక, యెట్టిమార్పులు జేయబడనందున, ప్రాముఖ్యతవహించుచున్నది.

లందరు ఉత్తరచైనాదేశమునుండి వచ్చినవారే. వారిలో నెక్కువమంది రాజధానినగరవాసులే. మంగోలుల సర్వాధిపత్యప్రారంభదశయందే (1235-1280) యీ రచయితలు ఉత్తరచైనాలో వర్ధిల్లుచుండిరి. తరువాతదశాబ్దములలో సామాన్యప్రావీణ్యతగల నాటకరచయితలు "హాంగ్-చౌ" పట్టణపరిసరప్రాంతములో బయల్వెడలిరి. వీరి సామాన్యరచనలు, వారియొక్క అనుభవములతో వ్రాయబడినను, అవి వారియజమానుల యాదరణను పొందజాలకపోయెను. నాటకరంగము ప్రాచీన సాంఘికసంప్రదాయములను ప్రదర్శించుట కుపయోగపడెను. "యు నాన్" ప్రభువులపాలనలో నాటకములతోపాటు కల్పితకథలకును ప్రత్యేకప్రాముఖ్యత యుండెను. కథలయొక్క యెత్తుగడలు -కథావస్తువులు-(Plots) ఒకేవిధముగానుండెను. ప్రయాణీకులకు అనాగరికులకు నింపుగానుండునట్లు భాష మొరటుగానుండెను.

—(....)—

# ఏడవ అధ్యాయము

# చైనా రాజవంశములు

## (మింగ్ వంశము : 1368-1644)

నీటిపారుదలశాఖ, పరిపాలనాశాఖ, న్యాయశాఖ, వలసరాజ్యములు, సాహిత్యము, లలితకళలు, మింగుప్రభువులకాలములో గణుతికెక్కెను.

నిర్వీర్యులగుచున్న మంగోలులనుండి అధికారమును హస్తగతము జేసుకొనుటకు ప్రయత్నించిన దక్షిణ, మధ్యచైనాదేశీయులలో పలువురు "మింగ్"వంశప్రముఖులు. వీరు మంగోలులపరిపాలనాంతమున రాజ్యమును స్వాధీనపరచుకొనిరి. 14 వ శతాబ్దమధ్యకాలములో సముద్రతీరప్రాంతముల లోను, నదీలోయలలోను తిరుగుబాట్లు అధికమగుచుండెను అల్పవంశసంజాతుడు, కురూపి, * అతీత మేధావి, క్రూరుడు, గొప్పనాయకుడగు నొక సన్యాసి "చు-యు అన్ చంగ్" (1328-1398) 1356 సంవత్సరములో నాన్కింగ్‌నగరమును స్వాధీనముచేసుకొనెను. 1368 సం.లో మంగోలు

---

* పెకింగ్ రాజభవనములో భద్రపరుపబడిన ఆయనచిత్తరువులలో నొకటి ఆయన దయార్ద్రహృదయుడగు ముదుసలిగా నిరూపించుచున్నది. మరియొక చిత్తరువుననుసరించి చైనీయులనుకొనినట్లు పందిముట్టెవంటి మొగముగల వాడుగా నిరూపింపబడెను. తైమూరురాజసేవకులుకూడ ఆయనను "వరాహ చక్రవర్తి"గా వర్ణించుచుండిరి. సింధూరమనుఅర్థముగల ఆయనవంశనామమునకు పంది (చు) అను వేరొక అర్థముండుటచే సందర్భానుసారముగ ఆయన ఆవిధముగా పిలువబడుచుండెను.

ఆకాలములో సామర్కండునగరములో తైమూరుఆస్థానములో క్యాస్టెయిల్ మూడవహెన్రీ రాయబారిగానుండిన "క్లావిజో"రికార్డును చూడుడు. ఆ రికార్డు Bretsahneider : Mediaveal Reserches II P, 145 లో నున్నది.

అను "పెకింగ్" నగరమునుంచి; 1371 సం లో అసలు చైనాదేశమునుంచి;* 1382 సం.లో "యునాన్" రాష్ట్రమునుంచి ఆయనసైన్యములు తరిమి వేసెను. "టీ-యన్-షన్" పర్వతప్రదేశమువరకు దాడిచేసి, ఉత్తరసరిహద్దు ప్రాంతదేశమునంతను సమర్థుడగు ఆయనసేనాని స్వాధీనపరచుకొనెను. "కారకోరమ్"నుకూడ మంగోలులు వదలుకొనవలసివచ్చెను. వారు కొరియా దేశమును మంచూరియాదేశమునుకూడ వదలి "హామి" "తర్ఫాన్" రాకుమారులు చైనాచక్రవర్తిసర్వాధికారమును అంగీకరించిరి. 1404 సం.వరకు పశ్చిమాసియాలోని మంగోలులు "మింగు" ప్రభువులపై తిరిగి దాడిచేయ జాలకుండిరి. 1405 సం.లో "అత్రార్"వద్ద తైమూరుమరణముతో యీ దాడిప్రయత్నములు నిష్ఫలమాయెను. తరువాత రెండుశతాబ్దములలో తమ అధికారమును తిరిగి సంపాదించుకొనుటకు మంగోలులుచేసిన ప్రయత్నములనన్నిటిని "మింగ్"వంశపు మూడవచక్రవర్తి అణచివేసెను. "హామి" యొద్దనుంచి "సుంగారి" నదీగర్భమువరకు తాను గెలిచినరాజ్యమును సుస్థిరముచేసుకొనెను.

అంతర్దేశపునర్నిర్మాణము, రహస్యవిప్లవసంఘనిర్మూలనము, నవీన ధర్మశాస్త్రప్రచురణ; పరిసరప్రాంతరాజ్యములతో సఖ్యతయేర్పాట్లు, దేశరక్షణసైన్యనిర్మాణము, నీటిపారుదలశాఖాభివృద్ధిచేయుట మొదలగు సంస్కారణలతో ప్రథమప్రభుత్వకాలము గడచిపోయెను. చు-అన్ యొక్క సంపూర్ణబలమునకు స్థావరమై, అధికజనసంఖ్యగల ప్రదేశములకు కేంద్రముగా నుండిన "నాన్కింగ్" పట్టణమును రాజధానినగరముగా నిర్ణయించెను. ఆయనమరణానంతరమున ఆయనమనుమడు రాజ్యమునకువచ్చిరి. చక్రవర్తికిని ఆయన పినతండ్రి "చు-టె"కిని మధ్య జరిగిన పోరాట మాయన ప్రభుత్వస్వల్పకాలములో గమనింపదగువిషయము. ఆ పోరాటములో

* క్వేయిచో, కాంగ్సిలతోకూడిన యీప్రదేశము ఒకరాష్ట్రముగా నిర్ణయింపబడినను, గడచిన కొలదిసంవత్సరములవరకు స్పష్టమైన స్వజాతిఆకృతి వ్యక్తమగుచుండెను.

cf. K. A. Willfogel, Wirtschaft and Gesellschaft Chinas; P. P. 219 (1931).

"చూ-టు" జయించెను. ఆయనపాలన "యంగ్-లో" 1403-1424) చైనా చరిత్రను ఖ్యాతివంతముగా జేసెను. శాంతి తిరిగి స్థాపింపబడెను, గత కాలమునాటియొక్కయు, ఆకాలమునాటియొక్కయు చైనాసాహిత్యములోని శ్రేష్ఠతను తెలుపుటకును 120 మంది సంగ్ తత్వవేత్తలతలంపులను సంగ్రహించుటకును విద్వాంసులు నియమింపబడిరి. 1408 లో అధికారపదవులలో నుండిన కొజ్జాలు టిబెటు, జావా, సయాం, బెంగాలుదేశములకు రాయబారులుగా పంపబడిరి. 1405 సంవత్సరములోను, పిదపనంతరమునను దక్షిణ సముద్రప్రాంతములు, హిందూదేశము, పర్షియాసింధుశాఖలపై దండయాత్రలుచేయుటకు సైన్యములను పంపెను. మంగోలియాదేశముపై మూడు పర్యాయములు దాడిచేసిరి 1421. సం.లో రాజధాని "పెకింగ్" నగరమునకు మార్చబడెను. అప్పటినుండి "నాన్కింగ్" అధీనరాజధానినగరముగా నుండెను. "యంగ్-లో"పాలనలో చేయబడిన ఘనకార్యములలో నావికాదండయాత్రలపరంపర ప్రాధాన్యము గాంచెను. ఈవిషయము విదేశీయ ప్రముఖులను ఆశ్చర్యచకితులను గావించెను. ఈ దాడులు వ్యాపారరీత్యా అమూల్యములై, చైనా కగణితఖ్యాతిని గలిగించెను.

చక్రవర్తియుద్యోగీయులలో "చెంగ్‌హో" * అను కొజ్జానాయకుడు "సూ-చౌ" రేవునందు నావికాదళమును సమకూర్చి, 1405 సం.లో దక్షిణ దిశనుండినరాజ్యములపై ప్రథమదండయాత్రను కొనసాగించెను. ఆయన "పాలంబాంగ్" రాజును నిర్బంధించి "నాన్కింగ్" నగరమునకు తెచ్చెను. ఆయన మూడవ సముద్రదాడిలో తనను తీవ్రముగ యెదిర్చిన సింహళ దేశపురాజును అదేవిధముగా నిర్బంధించితెచ్చెను. 1405-1431 సంవత్సరములమధ్య జావా, సుమత్ర, సిలోన్, ఇండియా, అరేబియా, ఆఫ్రికాలపై 7 దాడులు చేయబడెను. వారు తిరిగివచ్చినప్పుడు ఆయాప్రభువులు పంపిన

* మంగోలు అరబ్‌వంశీయుడగు "చంగ్-హో" యునాన్‌దేశము నకుచెందిన మహమ్మదీయుడు. ఆయన దాడిచేసిన దేశములలో అనేకచోట్ల "ఇస్లామ్" రాజమతముగానుండుటయే యీయననాయకత్వముక్రింద యీ దండయాత్రలుచేయబడుట కారణమైయుండవచ్చుననువిషయము గమనార్హము.

రాయబారులు కట్నములతోపాటు, సముద్రమార్గములు, నావికాశాస్త్రవిషయములు, నౌకాశయములు, విదేశాచారములు మొదలగువానినిగురించి అనేక వివరములను గొనివచ్చిరి. 1415 సం.లో మలాకానుండి "హోర్ముజ్" వరకునుండిన 16 రాష్ట్రములప్రభువులు కప్పములను సమర్పించిరి. 1433 సం.లో ఐదవచక్రవర్తి పదకొండుగురు విదేశరాయబారులను రాజమర్యాదలతో ఆహ్వానించెను. వీరందరు 1436 సంవత్సరమువరకు "పికింగ్" లో నుండిరి.

చైనీయుల నావికాయాత్రలు, ఓడలనిర్మాణము యీకాలములో అత్యున్నతస్థితినిగాంచెను, ఓడలు సాధారణముగా సముద్రకోస్తానే అంటిపట్టుకొని ప్రయాణముచేయుచుండెను. దూరసముద్రములో గంటకు $6\frac{1}{4}$ మైళ్ళవేగముతో అవి నడచుచుండెను. ఆనాటిస్థితిగతులనుబట్టి నావికాప్రయాణము కడు సౌఖ్యదాయకముగానుండెను. నావికాదాడులు యెంత స్వల్పవ్యవధిలో ప్రారంభమాయెనో అంతస్వల్పకాలములోనే ఆగిపోయెను. చైనా ఓడలు కోస్తానువదలి దూరముగా ప్రయాణముచేయగూడదను ఉత్తరువులు తిరిగి అమలులోనికివచ్చెను. సముద్రతీరమును కాపాడు ప్రధానవిధిని ప్రభుత్వమే వహించెను, ఆసియాఖండవాసులతో పరిచయముగలిగిన చైనీయులు దేశమునువదలిపోగూడదనియు, విదేశీయులతో నుత్తరప్రత్యుత్తరములు నడుపరాదనియు యివ్వబడిన నిషేధపుఉత్తరువులవలన చైనాచరిత్రదృక్పథము మారిపోయెను, నావికాబలముగలిగి సామీప్యముననున్న జపానుదేశపు దాడులకు చైనా గురియాయెను. హిందూమహాసముద్రముపైనున్న చైనా అధికారము అరబ్బులహస్తగతమాయెను. 25 సంవత్సరముల పిదప పోర్చుగీసువారు ఆ అధికారమును హస్తగతముజేసుకొనిరి. విదేశవ్యాపార మాగిపోవుటయు, దానివలన సామ్రాజ్యసుంకములద్వారా వచ్చు ఆదాయము తగ్గిపోయెను. యూరోపియనులు ప్రపంచమునంతటిని ఆక్రమించుకున్నకాలములో చైనా యేకాకియైపోయెను.

అప్పటినుండి చైనావారి దేశాంతరసంబంధములుగాఢ విషాదపూరితముగా నుండెను. "అనం" రాష్ట్రము 1431 సం.లో స్వాతంత్ర్యమును సంపాదించి, 1788 సంవత్సరమువరకు దానిని నిలుపుకొనగలిగెను. 1350

నుండి జపాన్ సముద్రపుదొంగలు "షాంటంగ్" ద్వీపకల్పముయొక్క దక్షిణమున చైనాకోస్తాను దోచుకొనుచుండిరి. ఈ దోపుడులు క్రమక్రమముగా అధికమాయెను. ఆ ప్రాంతపుప్రజలు కోస్తాతీరమునువదలి నడిదేశములోనికి పోవలసివచ్చునంత తీవ్రముగానుండెను. ఈ దోపిడిగాండ్రు జపానీయులే గాక కోస్తాప్రాంతమంతటిలోను నుండెడి దోపిడికారులుకూడ వారితోకలసి యుండిరి.

"సాంగ్-ఖా-సా" (1357-1419) ఆధిపత్యముక్రింద ప్రవర్ధమానమగుచుండిన టిబెట్టుదేశము "యంగ్-లో" చక్రవర్తిని జయప్రదముగా యెదుర్కొనగలిగిన ప్రథమరాజ్యము. మంగోలులు 1449 సంవత్సరములో నొక అసమర్థుని (బలహీనుని) ఆధిపత్యమునముండిన 50 లక్షల చైనా సేనావాహిని నోడించి, చక్రవర్తిని నిర్బంధించి, యొకసంవత్సరము ఖైదీగా నుంచిరి. ఒకశతాబ్దము గడచినపిదప వారు ఉత్తరచైనాదేశముపై దాడి వెడలిరి.

"మింగ్" వంశీయులపాలనలో యూరోపియనుదేశీయులుకూడ చైనాస్థితిగతులను గమనించుచుండిరి. 1514 సం.లో పోర్చుగీసులు చైనా తీరమును చేరిరి. కాని వారు వచ్చినపిదప పదిసంవత్సరములలో వారినడవడిక అసంతృప్తికరముగానుండినందున 1522 సం.లో వారు దేశమునుండి వెడలగొట్టబడిరి. కొంతకాలము గడచినపిదప వారు తిరిగివచ్చి 1553-54 సంవత్సరములో "మాకావ్"లోను 1544 (?) సంవత్సరములో "అమావ్"లోను నివాసములను యేర్పాటుచేసుకొనిరి. 1565 సంవత్సరములో స్పెయిన్ దేశస్థులు "ఫిలిప్పైన్" దీవులను ఆక్రమించుకొనిరి. 1622 సంవత్సరములో డచ్చిదేశీయులు ఫార్మోజాలంకకు పోయి అచటను, పెస్కడోర్యలోను "మింగ్"వంశపాలనాంతమువరకు యుండిరి. 1637 సంవత్సరములో అయిబాంగ్లేయయోడలు క్యాంటన్‌రేవుకు వచ్చి వాటిలోనిసరుకు నమ్ముకొనిరి. కాని వారచట నివాస మేర్పాటుచేసుకొనలేదు.

16 వ శతాబ్దపు తుదికాలములో జపాను, మంచూరియాదేశములలోని కొన్ని జర్చిన్‌తెగలవైరుధ్యము చైనాప్రభుత్వమునకు క్లిష్ట విదేశీయ సమస్యగా నేర్పడెను. "మింగ్" ప్రభుత్వము తమరాజధానిని "పెకింగ్"కు

మార్చినప్పుడు చైనాకులోబడియున్న కొరియాదేశముపైనను, యునాన్ రాష్ట్రమునుండి "మింగ్"వంశపు తుదిప్రభువు వెడలగొట్టబడినపుడును జపానువారు 1659 సంవత్సరములో దక్షిణచైనాపై దండెత్తిరి.

"మింగ్" పాలనలో జాతీయసంస్కృతి తిరిగి పూర్వోన్నతస్థితిని పొందుటయే చైనాదేశచరిత్రలోని ముఖ్యవిషయము. రహదారులు, వంతెనలు, దేవళములు, మఠములు, స్థూపములు, సమాధులు, స్మృతిచిహ్నములు, ఉద్యానవనములు విరివిగా నిర్మింపబడెను. దేశపునరోద్ధారణపథకములు అసంఖ్యాకములుగ తయారుచేయబడెను. 564 నగరపు కోటగోడలలో 432 తిరిగి కట్టబడెను. (Grand Canal) పెద్దకాలువను మరమ్మతుజేసి దానినెక్కువలోతుగా త్రవ్వించిరి. ప్రథమచక్రవర్తి 1394 సం.లో వరదనివారణ, కాలువలమరమ్మతుల ఆవశ్యకతను గుర్తించి, ఆ కార్యనిర్వహణకు నిపుణుల నన్నిరాష్ట్రములకు పంపెను. కొలదిమాసములలోనే 40,987 పథకముల నిర్మాణము పూర్తియైన ట్లీ కార్యనిర్వహణసంఘనిపుణు లాయనకు తెలియజేసిరి యుద్ధములవలన గలిగిన నష్టములనుండి కోలుకొనిన నాయకోట్లప్రజలు పాతసరిహద్దులను దాటి, నైఋతిప్రాంతములకు పోయి మంగోలియా, లయోటాంగ్‌లలో ప్రవేశించిరి. ఈ ప్రభుత్వపాలన తుదికాలములో వేలాదిప్రజలు "మణిల" దానిసమీపముననున్న విదేశీయరేవుపట్టణములలో నివాసముల నేర్పాటుచేసుకొనుచుండిరి. వారివాణిజ్యాధిక్యత యిటీవలశతాబ్దములలో తూర్పుయిండియాదీవులు, మలేషియా "ఫిలిప్పైన్" దీవుల చరిత్రలలో స్పష్టముగా నుదహరింపబడియుండెను. శవదహనాచారము తొలగింపబడెను. మింగ్ చక్రవర్తు లవలంబించిన మంగోలాచారములు, బానిసలను, ఉంపుడుకత్తెలను బలియిచ్చుఆచారమును నిషేధించుచు 15 వ శతాబ్దమధ్యకాలములో ప్రభుత్వము శాసించెను.

నూతననియమావళితో తయారుజేయబడిన న్యాయచట్టమును ప్రచురించిరి. దానికనుగుణ్యముగా సహజపద్ధతులపై పరిపాలన సంస్కరింపబడెను. సామాన్యోద్యోగులకు సైనికోద్యోగులకు పరీక్షలు యేర్పాటుచేయబడెను. ఈ విధానమువలన పాలకోద్యోగులందరు యేకమార్గానుగాములై

నను, సారస్వతాభిలాష యెక్కువగానుండినను, అత్యంత నిర్భాగమాట ముగనుండు ప్రశస్తపాలకులను యీవిధానము తయారుజేసెను.

మింగుపరిపాలన తుదిదశాబ్దములలో ప్రభుత్వపరిపాలన రెండుదోషములకు లోనై యీ వంశపతనమునకు దారితీసెను. కొజ్జాలు ప్రభుత్వవిషయములలో తమపలుకుబడి నెక్కువగా నుపయోగించుచుండిరి. అందువలన శ్రేష్ఠులగుయుద్యోగులు తమపదవులలోనుండుటకు నిరాకరించిరి. మరికొందరు దేశరక్షణను సక్రమముగా చేసుకొనకుండా నిరోధింపబడుచుండిరి. కొందరు తమప్రాణములనుకూడ కోల్పోవలసివచ్చెను. దుర్భరమగుపన్నులు విధింపబడుచుండుటచే, వేలకువేలు ప్రజలు ఆస్తులను పోగొట్టుకొనవలసివచ్చెను. పన్నులనేకరెట్లధికముచేయబడెను. రాజానుగ్రహమును పొందిన సభికులకు, రాజకుటుంబమునకుచెందినవారికి రాష్ట్రాధికారములను ప్రసాదించుట రెండవదోషము. తమభూములనుండి వెడలగొట్టబడిన కృషికులు అసంతృప్తులై దేశమునువదలి బందిపోటువృత్తి నవలంబించుచుండిరి. క్రమముగా వీరు ఉత్తర, మధ్యచైనాప్రదేశముల నాక్రమించిరి. "జెచుమాన్"లోని వేలకువేలప్రజలను హింసించి చంపిరి. ఈ రాజవంశములో మార్పులుగలుగవలసిన పరిపక్వదశ వచ్చునప్పటికి మంచూలు 1644 సంవత్సరములో బయలుదేరి యీ అల్లరులను అణచివేసిరి.

"మింగ్" వంశస్థాపకుడు బౌద్ధమతావలంబకుడైనను, తనమతముపట్ల యితరమతములకంటె యెక్కువ ఆదరణను చూపలేదు. మంగోలులపై తిరుగుబాటుచేయువారిని ప్రోత్సహించుచుండిన ఈ బౌద్ధమతస్థులను ప్రథమచక్రవర్తి దేశమునుండి వెడలగొట్టెను. వారు తనదేశభద్రతకే భంగముగలుగజేయుదురనుభావమే దీనికికారణము. *

ఆయన రాజమతము సభివృద్ధిగావించెను. కన్ఫ్యూషియన్‌గ్రంథములు, ఆచారములు, బలిదానములు మొదలగువానిలో నెక్కువ శ్రద్ధవహించి, తనసభకు పండితులను ఆకర్షించుటకు యత్నించెను. పితృదేవత

---

* మైత్రేయునిరాకను ప్రకటించిన నౌకనాయకుడు 1355 సం.లో చక్రవర్తిబిరుదమును తానే వహించెను. 1367 సంవత్సరములో ఆయన "నాన్కింగ్"లో మరణించెను.

లకు, భూదేవులకు బలిదానములిచ్చుటకు అనువుగానుండు పెద్దభవనమును 1420 సంవత్సరములో "పెకింగ్"లో నిర్మాణముచేయించి, కన్ఫ్యూషియన్ మతమునందు తనకుగల భక్తివిశ్వాసములను తెలియజేసెను. "సంగ్" తత్త్వవేత్త "చు-సి" ఆయనపూర్వీకులచే రచింపబడిన గ్రంథమును ప్రభుత్వ పదవులను వాంఛించు అభ్యర్థులందరకు ప్రమాణగ్రంథముగా నిర్ణయించెను. విద్వాంసులయెడల నధికాభిమానమును గలిగియుండెను. విరుద్ధాభిప్రాయము గలవా రల్పసంఖ్యాకులుగా నుండిరి. ఉన్నతస్థానములలో యీ ప్రభుత్వము ఎక్కువ పలుకుబడిగలిగియుండినను, బౌద్ధ, టాయిమతములు సామాన్య జనానీకముయొక్క ఆదరణను పొందుచుండెను. అత్యంత ధనవంతులగు కొజ్జాలు ప్రకృతిరామణీయకదృశ్యములుగల ప్రదేశములలో బౌద్ధదేవళ నిర్మాణమునకు తమధనమును వెచ్చించిరి. పుణ్యక్షేత్రములున్నచోట్లకూడ యీ దేవళములు కట్టబడెను. 1506_1521 సంవత్సరములమధ్య టాయి మతమునకు సంబంధించిన గొప్పగ్రంథసముదాయమును ప్రకటించి"కుబిలే" చక్రవర్తిచే నిషేధింపబడిన తమసాహిత్యమును పునరుద్ధరించి విజయమును చాటిరి. "చియా-చాంగ్" (1522-1566) కాలములో చక్రవర్తి టాయి మతముపట్ల ప్రత్యేకాదరణనుచూపి ప్రోత్సహించెను.

"మింగ్" రాజ్యపాలనలో చైనీయవిజ్ఞానాభివృద్ధియు నూతన వస్తు సంపాదనయు విశేషముగా లభించెను. వానిలో మొదటిది కంటిఅద్దములు. 7 వ శతాబ్దములోనే యీ సులోచనములు గ్రీసుదేశమునుంచి తూర్పు రోమన్, యిండియాదేశములద్వారా చైనాదేశమునకు తేబడెను. అయినను "మింగ్" పాలన ప్రారంభకాలమువరకు ఈ కంటిఅద్దములు వాడుకలోనికి రాలేదు. తుదకు చదువగలిగినవారందరు వాటి నుపయోగించుచుండిరి.

"మింగ్" పాలన ప్రారంభదశాబ్దములలో గుర్తించదగిన మొదటి విషయము విస్తారపు ప్రత్తిపంట. దానితో నూలువస్త్రములు దేశమంతటా తయారుచేయబడుచుండెను.

నూతనప్రపంచములో ముఖ్యమైన క్రొత్తవస్తువులు అనేకములు ప్రారంభింపబడెను. అమెరికను లిచ్చిన నమూల్యమగు కానుక మొక్క-జొన్న లేక యిండియాదేశపుధాన్యము, చైనాసరిహద్దుప్రదేశములలో ఈ

పంట సుమారు 1550 సంవత్సరములో ప్రథమముగా పండింపబడెను. ఆనాటి యూరోపియన్ దేశస్థులకంటె ముందుగా దానివిలువను గుర్తించి, ఉత్తర చైనాలోని వేలకువేలురైతులు ఈ పైరునుపండించుచుండిరి. "మింగ్" వంశాంతకాలమునాటికి జొన్నలు; గోధుమలకంటె మొక్కజొన్న సుస్థిర మగుపంటగా పోటీచేయగలిగియుండెను. స్పెయిన్ దేశమునుండి ఫిలిప్పైన్ దీవులకు, అచటనుండి సముద్రతీరప్రదేశమగు "ఫూకియన్" రాష్ట్రమునకు చైనీయవర్తకులచే తేబడిన, చిలకడదుంపలు, బఠాణీలు, మొక్కజొన్న కొంతకాలమునకు వ్యాప్తిగాంచెను. చైనాలో 1590 సం.లో ప్రప్రథమమున చిలకడదుంపలపంట ప్రారంభమాయెను. ఈ పైరు తక్కినపైరులకంటె తక్కువసారవంతమైననేలలో పండింపవచ్చునని, ఆహారపదార్థముగా వీటిని యుపయోగింపవచ్చుననియు చైనీయులు గ్రహించిరి. పైన నుదహరింప బడిన మూడుపైరులు భూమిని ఫలవంతముగాచేయుట, ఆహారపు టలవాట్లను పెంపొందించుటయేగాక, జనసంఖ్యాభివృద్ధికికూడ విశేషముగా తోడ్పడెను.

ఏడవశతాబ్దప్రారంభమునుంచి పొగాకుఉత్పత్తి ప్రారంభమాయెను. జపాను, కొరియా, మంచూరియాదేశముల పొగాకు దక్షిణ, ఉత్తరచైనాదేశ భాగములకు "మణిలా" వర్తకులద్వారా తేబడెను మింగ్ వంశపాలనాంతము లోగా ఈదేశములో బ్రహ్మజెముడుమొక్క నాటబడెను. పోర్చుగీసులు మొదలగువారు దీనిని తమనివేశనములచుట్టును కంచెగా నుపయోగించు చుండిరి.

"మింగ్" ప్రభువులచే ఆనాటివృత్తులు పునరుద్ధరింపబడెను. విగ్రహాదులనుచెక్కు శిల్పమునకు ప్రత్యేకప్రాముఖ్యత యుండెను. నీటిరంగులతో తయారుచేయబడు చిత్తరువులను వ్రాయు నూతనపద్ధతి మనోహరముగా నుండెను. పచ్చనిపువ్వములరంగువేయబడిన కుండలు, పింగాణీవస్తువులు నీలము తెలుపురంగుగల పాత్రలు అద్భుతముగా తయారగుచుండెను. తక్కినశిల్పకళలు ఆనాటి శిల్పనైపుణ్యమును వెల్లడిచేయుచుండెను. "మింగ్" పాలనాంతకాలములో యీ సరుకులు విశేషముగా యూరపునకును, స్పెయినువారిఆక్రమణలోనుండిన నమెరికాకును యెగుమతిచేయ బడెను. పాశ్చాత్యదేశములలోని అభిరుచులు, పరిశ్రమలఅభివృద్ధి అనేక

మార్పులకు లోనగుటవలన చైనాలోని శిల్పకళానైపుణ్యము తన ప్రాముఖ్యతను గోలుపోయెను.

"మింగ్" పాలనలో అనేకవిషయములలో ప్రోత్సాహకరములగు ప్రయోజనములు సాధింపబడెను. ఈసంగతి చైనాసాహిత్యగ్రంథములలో ద్యోతకమగుచుండెను. "మింగ్" పాలనకాలపురచయితలు ప్రాచీనరికార్డులను, భావములను సంపాదించి భద్రపరచిరి. నూతనవిధానముల నుపయోగించుచుండిరి. నూతనవిషయములను పరిశీలించిరి. పాశ్చాత్యదేశముల నుండి గ్రహించిన నూతనవిజ్ఞానమును సదుపయోగముచేసుకొనుచుండిరి.

"యంగు-లో" పాలనకాలములో సర్వసమాచారనిధి అనదగు "యంగ్-లో-టా-టిన్" ముఖ్యమైనగ్రంథము. ఈ గ్రంథములో ప్రాచీన విజ్ఞానమంతయు తెలియజేయబడెను. అవశేషమైన చైనాచరిత్ర, నీతిశాస్త్రము, ప్రకృతిశాస్త్రములు, పరిశ్రమలు, శిల్పకళ, భూగోళము, పరిపాలనావిధానము, మతము, జ్యోతిషము — వేయేల, క్రీ. వె. 1400 సంవత్సరమువరకు చైనీయ మానవవిజ్ఞానమంతను తెలియచేయు "సర్వవిషయసంక్షిప్తసమాచార" * గ్రంథమని "స్వింగిల్" అనుపండితుడు వక్కాణించెను. దీనిపద్ధతిలోనే అంతవిస్తృతముగాని తదితరపాండిత్యగ్రంథములు తదనంతరము రచియింపబడెను.

"చ-యన్-టి" శబ్దోత్పత్తిశాస్త్రమును అభ్యసించుటకు నూతనమార్గములు నిర్ణయింపబడెను. గీతములలోని అంత్యప్రాసగా వాడబడిన కొన్ని శబ్దముల అసలుఉచ్చారణను తెలుసుకొనుటకు ఆయనచేసిన పరిశీలన సాంకేతికవిద్యలో ప్రాముఖ్యమైనది. ప్రేరేపకవిధానమును క్రమానుసారముగా ప్రయోగించుపద్ధతి వర్ణింపబడుటచేతను పాశ్చాత్యదేశములలోనిపద్ధతి పోల్చదగిన పరిభాషనే వాడుటచేతను ఆ గ్రంథ మంత అగ్రస్థానమును పొందగలిగెను.

భూగోళశాస్త్రగ్రంథములు దినదినవిస్తృతమగు ప్రవాహమువలె వెలు

---

* 1923 సం.పు కాంగ్రెస్ లైబ్రేరియన్ రిపోర్టు పే 188.
1940 సం.పు కాంగ్రెసు లైబ్రేరియన్‌వార్షికసంచిక పే 170.

వడుచుండెను. అనేకరాష్ట్రీయముల మండలప్రభుత్వశాఖలయొక్క జిల్లానిఘంటువులు వెలువడెను. సర్వసామాన్యముగా పలకనమూనాలతో చిత్రరూపముగా చూపబడిన పర్వతములు, సెలయేళ్ళు, విద్యాసంస్థలు, దేవళముల చరిత్రలు వాటిలో చూపబడెను. వీటి నిట్లు తయారుచేయుటకు ప్రభుత్వముయొక్కయు, ప్రత్యేకవ్యక్తులయొక్క చొరవయే కారణమైయుండెను. ఆర్థిక, సాంఘిక, పారిశ్రామిక మొదలగు విషయములనుగురించి నిర్దుష్టసమాచారమును అందచేయుటచే నా గ్రంథము లమూల్యములుగా నెన్నబడెను. సాహసవంతుడు, పరిశోధకుడు, దినచర్యలేఖకుఁ డయిన "సుహాంగ్-ట్సు" భూగోళవిజ్ఞానమును మరియొకవిధముగా తెలియజేసెను. ముఖ్యపర్వతశ్రేణులు, ప్రకృతిసౌందర్యప్రదేశములను పరిశీలించుటలో శ్రద్ధవహించి, తానుచేసిన పరిశోధనలను దినచర్యపుస్తకములో వ్రాయుచుండెను. నైఋతిదిశప్రదేశముల పరిశీలనకై ఆయన నాలుగుసంవత్సరములకాలము దీర్ఘప్రయాణములుజేసెను. ఆవిధముగ ఆయన ప్రముఖవిషయములను కనిపెట్టగలిగెను. పశ్చిమ (సీ) యాంగ్ట్జీనదుల ఉత్పత్తిస్థానములను, "మెకాంగ్" "సాల్వీన్"లు వేర్వేరునదులవిషయమును ఆయన కనిపెట్టిన ముఖ్యవిషయములు.

"మింగ్" వంశస్థాపకుని ఐదవకుమారుఁడు ఆయనమిత్రునిచే ప్రారంభింపబడి 1406 సంవత్సరమున సమాప్తిచేయబడిన "క్షామనివారణ మూలిక" యనునది వృక్షశాస్త్రమునుగురించివ్రాయబడిన గ్రంథములలో శ్రేష్ఠమైనది. వరదలకాలములోను, వర్షాభావకాలములోను ఆహారమున కుపయుక్తములగు పైరులనుగురించి సంపూర్ణసమాచారమును రైతులయొద్దనుండి సేకరించిరి. ఆమొక్కలను పొలములలో నాటిరి. వాటిపెరుగుదలలో వేర్వేరు స్థాయిలనుగురించి వారు వర్ణించిరి. వాటిరూపములను ప్రతిమలద్వారా కర్రపలకలపై చెక్కించిరి. *

---

* ఈ గ్రంథము "బుచ్ డర్ నాటర్" (ఆగ్స్బర్గు—1475) అను గ్రంథముతో పోల్చదగినదని "స్వింగ్లీ" అభిప్రాయపడెను.

ఈ మూలిక యుటీవలనే రీడ్ చే సంక్షిప్తముగా తెలుపబడినది.

1578 వ సంవత్సరములో సమాప్తిచేయబడిన "వస్తుగుణదీపిక" (Materia - Medica) చిత్రములతో ప్రకటింపబడెను. ఈగ్రంథము వైద్య శాస్త్రమున కెక్కువ ఖ్యాతిని సమకూర్చెను. మశూచినిరోధకటీకాలు, అంటుజాడ్యములచికిత్స, కొన్నిరోగములనివారణకు వాడబడు కౌలిన్, స్ట్రామోనియం, చాలమూగ్రాత్తైలం, ఎఫెడ్రిన్, ఐయోడైన్ మొదలగు వానిగుణములు చర్చింపబడెను.

ఆకాలములో ప్రచురింపబడిన సర్వవిషయసంగ్రహగ్రంథము లన్నిటి లోను మూడుగ్రంథములు ప్రధానమైనవి. "మింగ్" వంశపాలనాంతదశాబ్ద ములలోనే యివి కూర్చబడినవి. అన్నిటిలోను ప్రతిమలు ప్రచురింపబడెను. 1609 సంవత్సరములో వెలువడిన ప్రథమనిఘంటువు "సాంట్సు-యె-టు హ్యా"లో 106 అధ్యాయము లుండెను. దుస్తులు, ఆటలు, పనిముట్లు, గృహ నిర్మాణశాస్త్రము, వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము మొదలగు అనేక వివిధ విషయములనుగురించి చిత్రింపబడిన పలకప్రతిమ లుండుటయే దానిప్రాధా న్యతకుకారణము. "ఉ-పె-చి" యనునది రెండవది. దానిని 1628 సంవత్స రములో చక్రవర్తికి బహూకరించిరి. దానిలోని 240 అధ్యాయములలో యుద్ధములలో వాడబడు ఆయుధములు, కవచములు, సైనికవ్యూహములు, కోస్తాపటములు మొదలగువానినిగురించి తెలియచేయబడెను. "టి-యన్-కంగ్-కెయె-ఉ" మూడవనిఘంటువు. పైనచెప్పబడిన రెండునిఘంటువుల కంటె నిది చిన్నది. దీనిలో 18 అధ్యాయములుమాత్రమే యుండెను. ఇది 1637 సంవత్సరములో వెలువడెను. ధాన్యములు, వాటిని పిండిచేయుట, దుస్తులు, రంగులు, అయిదులోహములు (అసలు ఆరు), ఉప్పుఉత్పత్తి, చక్కెరనుశుభ్రపరచుట, మట్టిపాత్రలనిర్మాణము, లోహములపోత, పని తనము; ఓడలు, చక్రములబండ్లను తయారుచేయుట; రాక్షసిబొగ్గును గనుల నుండి త్రవ్వుట,యుద్ధపరికరములు, ఆవిరిమంటలు, సిరా, పిండి, ముత్య ములుపట్టుట, జాడీతయారు మొదలగువిషయములు ఆ నిఘంటువులో తెలుపబడెను.

---

Famine Foods (Shanghai, 1946) గ్రంథములో పేర్కొన బడిన 414 ఓషధులలో అయన 358ని మాత్రమే గుర్తింపగలిగెను.

ఒకనిఘంటువును, అనేక శబ్దసంగ్రహగ్రంథములును తయారుచేయ బడుట ఆనాటివారికి భాషయందలి అభిమానమునకు నిదర్శనము. "ట్జు-హాయి" అను నిఘంటువు "మె-యింగ్‌ట్సో"చే తయారుచేయబడెను. ఇది 1615 సంవత్సరములో వెలువడెను. దానిలో 33,179 అక్షరము లుండెను. రెండవ, ఆరవ, పదునొకండవశతాబ్దములలో చైనాభాషలో 540, 542 అక్షరములు, 544 గుర్తులు యుండగా అవి యీకాలములో 214 గుర్తులకు నిర్దాక్షిణ్యముగా తగ్గింపబడినవిషయము గమనించవలసియున్నది. * 17వ శతాబ్దముమొదలు చైనాదేశ తదితరవిదేశీయనిఘంటువుల రచయితలు ఈ 214 గుర్తులనే వాడుచుండిరి. ప్రతిఅక్షరములోనున్న గీతలసంఖ్య ననుస రించి ప్రాతిపదికశబ్దములను, అక్షరములను "మె" యేర్పాటుచేసెను. అప్పటినుండి యీపద్ధతియే చిన్నపుస్తకములలోను, ఆధారగ్రంథముల లోను నవలంబింపబడెను. రాజధానినగరములోని దుబాసీసంఘసభ్యుల యుపయోగార్థము శబ్దసంగ్రహపుస్తకములు తయారుచేయబడెను. • రాజ్య సభలోని కొందరువిద్యావేత్తలు వేర్వేరుభాషలను కొంతవరకు నేర్చుకొని యుండిరని గ్రహింపనగును. ఆ శబ్దసంగ్రహపుస్తకములు వ్రాతపుస్తకములు గానే యుండెను. పరిచయముగలిగిన రెండుమూడుభాషలలోని రహస్యము లను వెదకి తెలుసుకొనుటకు యీ పుస్తకములు ఆధునికవిద్వాంసులకు సహాయపడెను.

"టి-యాంగ్" ప్రభువులనాటికాలములో పద్యకావ్యములు; "యు-

---

* 997 వ సంవత్సరములో శైతాన్ బౌద్ధమతాచార్యునిచే ప్రచురింపబడిన నిఘంటువుననుసరించి యీ సాంకేతికములు 242 కు తగ్గింపబడెను. కాని "సంగ్ లియో" సరిహద్దుకు దక్షిణదేశములోనుండిన చైనాపండితు లీ మార్పున కంగీకరింపలేదు. 14 వ శతాబ్దములో మరియొక నిఘంటుకారుడు యీసంఖ్యను 360 సంకేతములకు తగ్గించెను.

• క్రీ. పూ. రెండవశతాబ్దమునుండి యీ ప్రభుత్వశాఖ అప్పుడప్పుడు పని చేయుచుండెను.

క్రీ. వె. 1407 వ సంవత్సరప్రారంభమున యీశాఖ పునర్నిర్మాణము చేయబడెను.

యా"నాటికాలములో నాటకములు, యెంత ప్రఖ్యాతిగాంచినవో "మింగు" కాలములో (కల్పనాకథలు)నవల లంత ప్రసిద్ధిగాంచెను. పదునాలుగవశతాబ్దములో రచియింపబడినదని చెప్పబడు "సాన్-కౌ-చి-యన్-ఐ" అను దీర్ఘ చరిత్రాత్మకనవల వాటిలో నొకటి. ఈ నవల 17 వ శతాబ్దమువర కనేక పాఠాంతవిభేదములతో వెలువడెను. ఈ నవల క్రీ. వె. మూడవశతాబ్దప్రారంభమునాటి స్థితిగతులను వివరించుటతో ప్రారంభింపబడి, మూడురాజ్యముల మధ్యను చెలరేగిన అంతర్యుద్ధములలో పాల్గొన్న వీరులచరితముల నుదహరించెను. "ఉ-చి యాంగ్-యన్" (cc. 1505—1580)చే వ్రాయబడిన "సి-యు-చి" యనునది మరియొక కల్పనాకథ. ఈ కల్పితకథలోని ప్రధాన పాత్ర యొక కోతి. ఇది టాయిస్టుమతము వదలి, బౌద్ధమతమును స్వీకరించి ఏడవశతాబ్దము బౌద్ధయాత్రికుఁడు "హు-యన్ ట్సాంగ్"కు ఆయన స్వర్గయాత్రలో సహాయపడెనట. 14 వ శతాబ్దపు తుదికాలపు రచయిత "షి-నె-యన్"చే వ్రాయబడిన "షుయి-హు-చు-యన్" అనునది మరియొక నవల. రెండుశతాబ్దములు గడిచినపిదప యీ నవలకు మరికొంతకథ చేర్పబడెను. తమసంఘీయులవలన గలిగిన అక్రమబాధలకుగాను ప్రభుత్వముపై కసితీర్చుకొనుటకు "షాన్‌టంగ్" పర్వతములలోని తమ యునికిపట్టును వదలిన పంద్రెండవశతాబ్దపు బందిపోటులనుగురించి యీకథ వ్రాయబడినది. పదునారవశతాబ్దపునాటి యొక శృంగారపురుషుని ప్రేమవిషయములను గురించి వర్ణించు శృంగారకావ్యమొకటి వ్రాయబడెను. దానిని వ్రాసిన గ్రంథకర్త యెవరో తెలియదు. చిన్నచిన్నకథలు చేర్చబడిన యితరపుస్తకము లనేకములుకూడ వ్రాయబడెను. కాని పైన నుదహరింపబడిన పుస్తకములు యెక్కువ ప్రజాదరణనుపొందెను. వారివీరులు చైనాచరిత్రలో నుదహరింపబడిన ప్రముఖులకంటె, ఖ్యాతివంతులుగను. ప్రేమపూరితులుగను యుండిరని చెప్పుటలో యెట్టి యతిశయోక్తియును లేదు. ఆ వీరాగ్రేసరులలో నొకరు 1594 సం.లో దేవుడుగా భావింపబడెను. *

---

* కన్ఫ్యూషియన్‌తత్వశాస్త్రము, పద్యకావ్యములు, చరిత్రలకూడిన సారస్వతయోగ్యతలే ఈకల్పనాకావ్యములకుకూడనుండెనని నిశ్చలమనస్కుఁడు కానట్టి "చిన్-షెంగ్-టి-యాన్" అను పండితుడు నిర్ధారణచేసెను. ఈ విషయ

ఈకాలములో నాటకరచన యభివృద్ధిగాంచి పరిపక్వస్థితినిగాంచెను. అదేకాలపు కథలనుండి తీసుకొనబడిన కథావస్తువులనేగాక, అసలైన అత్యంత నూతనమైన కథావస్తువులనుకూడ తీసికొని వారు నాటకములను రచియించిరి. 15 వ శతాబ్దములో "కె-అన్-చి-యు" అనుపేరుతో నొక రకమగు నాటకశాల ప్రారంభింపబడెను. "సూ-చౌ"కు చేరువగానుండిన కేంద్రస్థలముపేరిట నదీ యట్లు పిలువబడెను. "యు-యన్" నాటకముల కును దీనికిని గల వ్యత్యాసము దానికుండిన అధికస్వాతంత్ర్యమే నాలుగు అంకములనాటకములు; నాయికానాయకులకుమాత్రమే పాటలు నిర్ణయించు అలవాటు తొలగింపబడెను. ఈ నాటకములు తక్కువప్రాముఖ్యతగల ప్రదేశముల ప్రదర్శింపబడుటకు నిర్ణయింపబడుటచే సంగీతము సున్నితముగను శ్రావ్యముగను యుండెను. కాని, యిట్టినాటకములు ప్రజాదరణను పొంద జాలకపోయెను. పాడవలసినపద్యములలో సాహిత్యప్రాభవమునకు మితి మీరిన ప్రాముఖ్యత యివ్వబడుటయే దీనికికారణము. పదునెనిమిది పందొమ్మిదిశతాబ్దములలో దానిపలుకుబడి క్రమముగా క్షీణించి, యిరువదవశతాబ్దములో నశించిపోయెను.

16 వ శతాబ్దములో యూరోపియనులు వారిలో ప్రత్యేకముగా వైజ్ఞానికులరాకవలన చైనాసాహిత్యము మార్పుజెందెను.

పాండిత్యము భక్తిగలిగి జూసస్‌మతప్రచారకులద్వారా యూరోప్ లోని నూతనవిజ్ఞానము చైనాలో వ్యాపించెను. జూసస్‌చరితమును విశద పరచుటతో తృప్తిగాంచక, అనువాదము, వ్యక్తిబోధ స్వకీయప్రయత్నముల ద్వారా ఈ జూసస్‌మతప్రచారకులు యూరోపియన్ నవీనవిజ్ఞానమును చైనాలో వ్యాపింపజేసిరి. విశాలహృదయము, పరిపూర్ణశిక్షణ అవసరమగుటచే ఈ కార్యనిర్వహణకు తగినవారు కొలదిమందిమాత్రమే లభించిరి. ఈ

---

మును సమర్థించుచు ఆయన 1641 వ సంవత్సరములో "షుయి-హు-చు-ఆన్" గ్రంథమును ప్రచురించెను. 1641 వ సంవత్సరములో "సాన్-కావ్-చి-యన్-ఐ" అనెడి గ్రంథమునకు దీర్ఘ ఉపోద్ఘాతమును వ్రాసెను. పైన నుదహరింపబడిన "లి-చి" ఈ కల్పితగ్రంథములను "నాలుగు అద్భుత గ్రంథము"లని పేర్కొనెను.

ప్రచారముపట్ల ప్రభుత్వము వ్యతిరేకభావమును ప్రదర్శించినను, నీతిశాస్త్రము, గణితశాస్త్రము, జ్యోతిషశాస్త్రము, భూగోళశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, తర్కశాస్త్రము, ఉపయోగాత్మకమైనశాస్త్రములను ప్రతిభావంతులగు చైనీయులకు బోధించి వారిని ప్రోత్సహించిరి.

ఈ మతబోధకులలో "మట్టియోరిక్కి" యనువాడు ప్రముఖుడు. ఈయన 1552 వ సంవత్సరములో యిటలీలో జన్మించెను. చైనాభాషను అభ్యసించి, ఆయన అద్భుత ప్రజ్ఞావంతుడాయెను.

వ్యాఖ్యానసహితమగు మూలగ్రంథమునకు అనుగుణ్యముగా తాను తయారుచేసిన ప్రపంచపటము గణితశాస్త్రము మొదలగు శాస్త్రములను గురించి తాను చేసిన ప్రసంగములద్వారా చైనాప్రముఖవిద్వాంసులమన్ననలను పొందెను. ఆయనప్రపంచపటము అనేకమారులు ప్రచురింపబడి, చైనా జపానుదేశములలో గొప్ప ప్రాముఖ్యతనుపొందెను.

—:0:—

ఎనిమిదవ అధ్యాయము

# చెయాంగ్ (లేక) మంచూవంశం

## 1644 — 1912

దేశీయస్వపరిపాలనలోనున్న చైనావిషయమేగాకుండా విదేశీయులగు మంచూల అధీనములోనున్న చైనానుగురించి తెలుసుకొనవలసియున్నది. అనామకులుగానుండిన జర్చిన్‌వంశస్థులు మంచూలు పదునారవశతాబ్దము లోని తుది రెండుదశాబ్దములలోను బహిర్గతమైరి. తరువాత శతాబ్దములోని మధ్యకాలములో మధ్యచైనాలోని అసమర్థపరిపాలనవలనగలిగిన అవకాశ మును పూర్తిగా వినియోగించుకొనిరి.

మంచూవంశీయులలో* "నుర్-హా-చి" ప్రథముఁడు. అయన ఉన్నత కుటుంబములో జన్మించి, అకుంఠితసాహసము అద్భుతమగు మేధాశక్తి గలిగియుండెను. తన అనుచరుల స్వభావమును సంపూర్ణముగా గ్రహించి వారిద్వారా విజయములను సాధించుటలో కడునిపుణుడు. చైనాదేశములోను, తదితరశత్రురాజ్యములలోను తానుగెలిచిన ప్రదేశములను బలపరచుకొని 1616 సంవత్సరములో తాను ఖాన్ (రాజు)గా ప్రకటించుకొనెను. 1625 సంవత్సరములో "ముక్డెన్"ను రాజధానిగాచేసుకొనెను. 1601 సంవత్సర ములో మంగోలులు, కొరియనులు, చైనీయులు తనదేశీయులుగల తనసైన్య మును నాలుగుశాఖలుగా వారివారి పతాకములననుసరించి విభజించెను. 1615 సంవత్సరములో దీనినే 8 శాఖలుగా విస్తరింపజేసెను. ఈశాఖలన్ని టికి మంచూ అధికారులే సేనాధిపతులుగానుండిరి. చైనా విధానానుసార ముగానుండిన ప్రభుత్వసైన్యము ఈ ఎనిమిదిశాఖలపై ఆధిపత్యము వహించెను.

---

* మంచు అనుపదము "నుర్-హా-చి" మరణాంతమువరకు వాడబడలేదు. అందువలన ఈ పదము యిచట పొరపాటుగా వాడబడినది.

1599 సంవత్సరములో మంచూభాషకు మంగోలుఅక్షర క్రమాను గుణ్యమైన లిపిని పొందుపరచుటకు తనయుద్యోగులలో యిద్దరిని నియమించెను. ఈ లిపిని యెక్కువ వాడుకలోనికితెచ్చుటకు ద్వంద్వార్థచిహ్నములు, ఎనిమిది నూతనఅక్షరములు చేర్చబడెను. "నుర్-హా-చి" తనవంశమునకు "చిన్" (బంగారము) వంశమని పేరిడెను. కాని 1636 సం.లో యిది "చి-యాంగ్"గా మార్చబడెను.

మహాయోధుడు చంఘీస్‌ఖాన్ యొక్క ఉత్తరదిశవైపుపోవుమార్గమును చిన్ వంశీయులు అవరోధించి వారివ్యాప్తిని దక్షిణదిశవైపు మరలించిరని యిప్పటికిని ఈర్ష్యవహించిన మంగోలుల క్రోధమునకు గురికాకుండా ఈ పనినిచేసెను.

1629 వ సంవత్సరములో మంచూలు గొప్పగోడను దాటి పికింగ్ మొదలగు నగరములను సమీపించిరి. 1633 లో వారు మంగోలుల వద్ద నుంచి "చా-హార్"ను; చైనావారినుంచి "లి-యొ-టంగ్"ను స్వాధీనపరచుకొనిరి. 1637 సంవత్సరములో కొరియావారి రాజ్యములో చేర్చబడెను. 1627 లోను 1642 లోను "మింగ్" వంశప్రభువులు మంచూలతో రాజీచేసుకొనదలచియుండిరి. తమ దేశస్థితి చాల క్లిష్టముగా నుండుటయు, తమ ఉద్యోగీయులలో చాలమంది మంచూసైన్యములో చేరుటయే దీనికి కారణము. మంచూలు ఈసమయమున కెదురుచూచుచు కాలమును గడపుచుండిరి. చైనాలో ప్రభుత్వముపై తిరుగుబాటుచేసిన సైన్యము రాజధానినగరము "పికింగ్"ను ముట్టడించినపుడు గొప్పగోడను రక్షించుకొనుచుండిన చైనాసేనాని మంచూలసహాయము కోరెను. అప్పుడు 1644 సం.లో వీరు యెదురుచూచుచుండిన అవకాశము లభించెను. చైనా మంచూసైన్యములు కలసి గొప్ప దుమారపుగాలి తమకు తోడ్పడగా, తిరుగుబాటుదారుల నోడించిరి. పికింగ్‌నగరములో ప్రవేశించిన పిదప మంచూలు తిరిగి వెడలిపోవుటకు తిరస్కరించుటయే గాక తమ చక్రవర్తిని యీ నగరమున కాహ్వానించి యీ నగరమును తమ రెండవ రాజధానిగా యేర్పాటుచేసుకొనిరి. 1912 సం.వరకు "పికింగ్" నగరము సామ్రాజ్య కేంద్రనగరముగా నుండెను. 1659 సంవ

త్సరములో మింగ్ చక్రవర్తులలో తుదిచక్రవర్తి రాజ్యమునువదలి పారి పోవుటతో చైనా పూర్తిగా ఓడింపబడినట్లు తలపబడెను. 1674_1681 సంవత్సరముల మధ్యకాలములో ముగ్గురు చైనా రాజప్రతినిధులుచే దక్షిణ భాగములో లేవదీయబడిన తిరుగుబాటు అణచివేయబడి, "చెంగ్" వంశము లోని నలుగురుప్రముఖుల ఆధిపత్యముక్రిందనున్న నావికా సైన్యము నిర్మూలింపబడుటతో, మంచూప్రభువులపాలన ప్రారంభమాయెను. సుమారు నాలుగుదశాబ్దములపర్యంతము ఫార్మోజా మంచూరాజ్యములో కలపబడుటయే యీ దండయాత్రఫలితము.

ఒకటి రెండు మార్పులతో చెయాంగ్ప్రభువులు మింగుప్రభుత్వ పాలనావిధానమునే అనుసరించి. 1631 సంవత్సరములో రెండవ ఖాన్ చైనా పాలనాపద్ధతిలోనే "ముక్డెన్"లో ఆరుగురు మంత్రులను నియ మించెను. 1634 సంవత్సరములో మంచూలో యుద్యోగులకు పరీక్షలను నిర్ణయించెను. 1636 సంవత్సరములో తాను చక్రవర్తి బిరుదమును వహించెను. సైనికబలమును హెచ్చుచేసి, క్రొత్తగాజేరినవారిని సైన్య ములో కలుపుకొనుటకు ఎనిమిది మంగోలు, ఎనిమిది చైనా సైనికవిభా గములను యేర్పాటుచేసెను.

క్రొత్తగా స్వాధీనపరచుకొనినప్పుడు యీ సైనికశాఖలు ప్రధాన మైన రక్షణప్రదేశములలో రక్షణసైనిక దండుగా వుంది. కొంతకాలము గడచినపిదప ప్రభుత్వసహాయముతో కొన్ని చైనానగరములలో ప్రత్యేక ప్రదేశములలో నివాసములను యేర్పరచుకొనుచుండిరి. స్వాధీనపరచు కొనుట, నివాసములను యేర్పాటుచేసుకొనుటతో ప్రారంభించిన యీ సైనికపటాలములు చైనాప్రజల విద్వేషమునకు గురియగుటచే ప్రభుత్వ కోశాగారమునుండి విశేషధనము వ్యయమగుచుండెను. * ఆకారణముచే

---

* గిబర్టుగారిచే రచియింపబడిన గ్రంథములో 721 వ పేజీలో యీ విధ ముగ వ్రాయబడెను:

1810 సం.లో మంచూ పటాలములో 2,20,960: మంగోలు పటాలములో 55,639; చైనాపటాలములో 1,43,893 గురు సైనికులుండిరి. వారికుటుంబములతోసహా వారిమొత్తపుసంఖ్య 15,00,000 యుండెను.

వారిలో కొంతమంది మంచూరియాలో నివసించుటకు చక్రవర్తి యేర్పాటు చేసెను, 1803 సంవత్సరములో నింతవరకు తదితరుల ప్రవేశము నాపుదల చేసినవారి స్వదేశభాగములలోనికి చైనాజనులుపోవుటకు అనుమతి యొసంగబడెను. ఈవిధముగా అందరును కలసిపోవుటచేతను, చైనావారి ఉత్కృష్టనాగరికత వారిని అధికముగా నాకర్షించుటచేతను. మంచూలు వారి దేశీయ ఆచారములు, భాష, యుద్ధనైపుణ్యమును మరచిరి.

పికింగునగరమును ఆక్రమణచేసికొనినపుడు మంచూలు, చైనా వారి మధ్య జరిగిన షరతులలో య్యేకొలదియో మినహాయించగా, మంచూ పాలకులు చైనాప్రజలజీవితములలో యేవిధమైన గొప్ప ఆర్థిక, సాంఘిక మార్పులను చేయలేదు. ఈ ఒడంబడికలో యీ దిగువ నుదహరింపబడిన షరతులు కలవు,

1. చక్రవర్తి రాణివాసములోనికి చైనాస్త్రీలను తీసుకొనకూడదు.

2. సివిల్ పరీక్షలలో మంచూలకు మొదటితరగతి యివ్వకూడదు.

3. చైనాజాతి పురుషులు తమ తలలను గొరిగించుకొని తలకు వెనుక భాగమున జుట్టుంచుకొనవలెను. మంచూలు ధరించుమాదిరిదుస్తులనే ధరించవలెను. చనిపోయినవారిని మింగుదుస్తులతో పూడ్చవచ్చును.

4. చైనా వనితలు మంచూదుస్తులను వాడవలెననెడి నిర్బంధము లేకుండినను, వారిపాదములను కట్టకూడదు.

ఈ షరతులను అమలుపరచుట సాధ్యమైనందున నవి యుపసంహరింపబడెను. (1568) రాణివాసములోనికి ప్రవేశించు చైనాబాలికలు, దక్షిణచైనాలోని కొంతమందిస్త్రీలుమాత్రము పాదములను కట్టకుండుటకు అంగీకరించిరి.

ఖితానులు, జర్చినులువలెగాక, మంచూలు చైనాఆర్థికసౌష్ఠవమును తలక్రిందుచేయు మార్పులేమియు చేయలేదు. సుమారు ఒకటిన్నరశతాబ్దముల కాలము దేశములో శాంతిని సమకూర్చుటయే వారుచేసినఘనకార్యము. స్వాతంత్ర్యసంపాదనకు జరిగిన దీర్ఘపోరాటము ముగియగనే "పూర్వపు

మాదిరి" విధానమే అమలుపరుపబడెను. శాంతిదాయకమగు సీకాలములో ప్రజోపయోగములగు కార్యములకు మరమ్మతులుచేయుట, ఉన్నసౌకర్యము లను విస్తరింపచేయుట, పోషించుట మొదలగుపనులను-మంచూలు నిర్వ హించిరి దక్షిణభాగమున, నైఋతిభాగమున తరచుగా చెలరేగుచున్న అల్ప సంఖ్యాకులగు ఆదిమవాసులతిరుగుబాట్లను వారు నిర్దాక్షిణ్యముగా అణచి వేసిరి. అటవీ ప్రదేశములు నివాసయోగ్యములుగ చేయబడెను. కరవు ప్రాంతములలో వసూలుచేయబడిన పన్నులను తిరిగి ముదరా యిచ్చిరి. ఉత్తరభాగమంతటిలోను, పశ్చిమసరిహద్దు ప్రదేశములపైపునుంచి వచ్చు దాడుల భయమును తొలగించిరి.

క్రమక్రమముగా పశ్చిమదిశ బాల్కాష్ సరస్సువరకు వారి అధికార మును విస్తరింపజేసిరి. ఈకార్యములను నిర్వర్తించుటవలన ననేక దశాబ్ద ములనుండి వేధించుచున్న పోరాటములనుండి అంతర్దేశపు బాధలనుండి దేశము విముక్తినందెను. తరువాత నాగరికతాభివృద్ధికై ప్రయత్నములను చేయుటకు అవకాశము లభించెను.

జపానీయులు, హిందూదేశస్థులు, అరబ్బులు, పోర్చుగీసులు, డచ్చి వారలతో వ్యాపారము విరివిగా చేయుచుండిరి. గతించిన కాలముకంటె హిందూమహాసముద్రములోను, ఆ ప్రాంత సముద్రశాఖలలోను అసంఖ్యాక ములగు ఓడలు ప్రయాణము చేయుచుండెను. అరబ్బులయొద్దనుంచి యీవాణిజ్యమును పోర్చుగీసువారు లాగుకొనినపిదప వారు డచ్చివారి బాధల నుండి రక్షించుకొనవలసివచ్చెను. కాని 1641 సంవత్సరములో డచ్చివారు, బటేవియా ఫార్మోజాలలో స్థిరనివాసముల నేర్పర్చుకొనిరి. తుదకు పోర్చు గీసువారు మలాకానుండి తరిమివేయబడిరి. 1664 సంవత్సరములో ఇంగ్లీషు వారు క్యాంటన్‌నగరముతో వ్యాపారముజేయ మొదలిడిరి. ఈ వ్యాపారము నిబ్బరముగా కొనసాగి 1689 సంవత్సరాంతమునకు డచ్చివారి వ్యాపారమును మించిపోయెను. ఫ్రెంచివారి వర్తకము సదా స్వల్పముగానే యుండెను.

అమెరికా విప్లవానంతరము హిందూమహాసముద్రము, గుడ్‌హోప్ అగ్రముద్వారా యునైటెడ్‌స్టేట్సుతో వ్యాపారము ప్రారంభింపబడెను. లోగడ కొరియా, జపాన్, టిబెట్టు, మధ్యఆసియాలతో సాగుచుండిన వర్తకముతో

పాటు యీ నూతన దేశాంతరవ్యాపారముచేయ మొదలిడుటవలన చైనా వ్యాపారకేంద్రము ఉత్సాహముతో నిండియుండెను.

విశేషభూప్రాంతము నుపయుక్తముగా చేసుకొనుమార్గము తెలుసుకొనజాలకుండిరి. కాని తెలిసినంతవరకు చైనీయులు చెయాంగ్‌వంశ ప్రభువులద్వారా మంచూ, మంగోలు రాజ్యములను ఆక్రమణచేసుకొనుచు, దక్షిణమున, నైఋతి ప్రదేశములోని ఆదిమవాసులను, పర్వతములలోనికి, నిస్సారవంతములగు ప్రదేశములలోనికి నెట్టివేయుచుండిరి.

ఎన్నియో శతాబ్దములనుండి అడవులతో నిండియుండిన ప్రదేశముల లోని అడవులను తొలగించి అచటి ఏటవాలు ప్రదేశములలో గృహములను నిర్మించిరి. ప్రపంచములోని పుష్టికరమైనట్టియు, సులభముగా విక్రయింపబడునట్టి మొక్కలు సేద్యమునకు విరివిగా లభ్యమగుచుండెను. పదమూడు పదునేడవ శతాబ్దములమధ్య కాలములో Sorghum (సోర్ఘం) మొక్క-జొన్న, చిలకడదుంప, బటాణీగింజలు, పొగాకు * మొక్కలను చైనావారు సంపాదించిరి. ఇతర రకములగు మొక్కలు 1644 వ సంవత్సరము తరువాత చేర్చబడెను, కాని యివి అంత ముఖ్యమైనవిగావు.

సేద్యమునకు యుపయుక్తమగు యెన్నియో యకరముల భూములలో నీ పంటలు పండింపబడి, ప్రజల ఆహారదినుసులను అధికముచేసి కృషీవలులకు, మధ్యవర్తులకు యెక్కువ ఆదాయమును పెంపొందించెను.

నూతన పైరులను సాగుజేయుట కొకటి రెండు విషయములలో మాత్రము సామ్రాజ్యాధికారమును వినియోగించుకొనిరి. అన్నివిధముల గలిగిన వత్తిడివలన 1948 సంవత్సరములో ధాన్యము, చిలకడ, సోర్ఘం, గోరుచిక్కుడు, పెద్దచిక్కుడు, రేప్, నువ్వులు, జొన్నలు, బార్లీ పంటలను

---

* 17 వ శతాబ్దములో ముక్కుపొడి, ప్యారిస్‌నగరము, సెంటుపీటర్సుబర్గు, లండన్, క్యాంటన్ ప్రజలమోస్తరుగానే పికింగ్‌నగరములోని నాగరిక ప్రజలచే వాడబడుచుండెను. ఈ అలవాటు యిటీవలనే అదృశ్యమాయెను. మంగోలులు మాత్రము యిప్పటికిని ముక్కుపొడిని వాడుచున్నారు. గడచిన రెండుశతాబ్దములలోను తయారుజేయబడిన సొగసగు సీసాలవలననే యీ అలవాటు జ్ఞప్తికివచ్చుచుండెను.

పండించుటలో అన్నిదేశములలోను ప్రథమస్థానమును పొందగలిగెను. పట్టు, తేయాకు పంటలలోకూడ ప్రథమ స్థానమునే ఆక్రమించెను. ధాన్యము, పొగాకు, బఠాణీ, గోధుమ పంటలలోకూడ చైనా యెక్కువగా వెనుకబడి యుండలేదు. *

ఈకాలములోనే ప్రవేశపెట్టబడినగసగసాలపైరువలన హానికరము లగు ఫలితములు గలిగెను.

దీనిసాగువలన నెంతయో విస్తీర్ణములగు భూములు నిస్సారమగుటయు, లక్షలకొలదికుటుంబములు నాశనమగుటయు, పన్నులువసూలు చేయువారలను, దూరదృష్టిలేని అధికారులను, భూఖామందులను కడుభాగ్యవంతులుగాజేసి తుదకు 1840 సంవత్సరములో యుద్ధమునకు దారితీసెను. కొన్నిశతాబ్దములకాలమునుంచి చైనావారు నల్లమందు వాడుచుండిరి. శరీర రక్షణకుపయోగించునౌషధముగా దానిని వాడుచుండిరి. 17 వ శతాబ్దాంతమున 1689 వ సంవత్సరములో జావాలో దీని వాడకమునుగురించి "కామ్ఫియల్" ప్రప్రథమముగా తెలియజేసెను. అచటిప్రజలు పొగాకుతో నల్లమందునుకలిపి పీల్చుచుండిరి. క్రమక్రమముగా పొగాకునువదలి నల్లమందుపొగనే త్రాగుచుండిరి. ఈ దురభ్యాస మత్యధికమగుటచే నల్లమందు వాడుకను నిషేధించు వుత్తరువులు 1729 సంవత్సరములో జారీచేయబడెను. కాని యీ ఉత్తరువులు నిరుపయోగములైనప్పుడు నల్లమందుదిగుమతి నరికట్టుఉత్తరువులు 1800 సంవత్సరములో జారీచేయబడెను. ఈనిషేధపుటాజ్ఞలను సరకుగొనకుండా ప్రతిసంవత్సరము నల్లమందు దిగుమతిచేయబడుచుండెను. 1821 వ సంవత్సరములో 5 వేల పెట్టెల నల్లమందు

* ఐక్యరాజ్యసమితిచే ప్రచురింపబడిన 1950 వ సంవత్సరపు వార్షిక సంచికలోని 31-144 పేజీలలో నుదహరింపబడిన ఆహార వ్యవసాయపు లెక్కల ననుసరించి తెలుపబడినవి. ఈలెక్కలలో యు. యస్. యస్. ఆర్. దేశపు వివరములుకూడ జేర్చబడినవి. కాని చైనాదేశములో పండింపబడిన తేయాకు, పట్టుపరిశ్రమములనుగూర్చిన వివరములు తెలుపబడలేదు. ఏదెట్లున్నను, 1930 ప్రాంత సంవత్సరములలో యీరెండు సరుకుల పంటలలోను చైనా అగ్రస్థానమును వహించెను.

క్యాంటన్‌నగరములోనికి దిగుమతిచేయబడెను. ఈసరుకు విశేషముగా బ్రిటిషు ఓడలలోను, కొంత అమెరికా, తదితర దేశపుటోడలలోను దిగుమతి యగుచుండెను. మంచూప్రభుత్వము జోక్యముగలిగించుకొని యీ నల్లమందును దగ్ధము చేయించెను. బ్రిటీషువారు యిందులకంగీకరింపక వాణిజ్యపు కట్టుబాటులననుసరించి తమకు కొన్నిహక్కులు గలవనియు, వాటి ననుసరించి క్యాంటన్‌లోని అధికారులచే జారీచేయబడిన నిర్బంధపుటుత్తరువులను తాము మన్నించనవసరములేదనియు, వాదించి చైనాతో యుద్ధమునకు తలపడిరి. ఆ యుద్ధములో బ్రిటీషువారు సునాయాసముగా గెలిచిరి. 1911 సంవత్సరములో బ్రిటీషు పార్లమెంటువారు చైనాకు నల్లమందు యెగుమతిచేయకూడదను వుత్తరువుల నిచ్చునంతవరకు నల్లమందు ఆదేశమునుండి యెగుమతిజేయబడుచుండెను. ఇంతలో చైనాలోనే యెక్కువ విస్తీర్ణమగు భూమిలో గసగసాలపైరు పండించబడుచుండెను. మారుమూలలలోను, సివిల్ సైనికోద్యోగుల ప్రోత్సాహముండిన ప్రదేశములలోను యీపైరు విరివిగా వర్ధిల్లుచుండెను. ఇందువలన నెన్నియో చెడుఫలితములు సంభవించెను. నల్లమందు నిషేధపు ప్రయత్నము లనేకసంవత్సరములు జరిగినపిదప, గసగసాలపంట; నల్లమందు తయారు; రవాణా, అమ్మకము నరికట్టుటకు చేయబడిన నిర్బంధపుటుత్తరువులు నిరవశేషముగా తొలగింపబడినవనియు, దేశములోని అంతర్పోరాటములవలన తగుచర్యలు జయప్రదముగా కొనసాగుటలేదనియు 1948 వ సంవత్సరములో చైనా జాతీయప్రభుత్వము పంపిన రిపోర్టులో నుదహరింపబడెను - కమ్యూనిస్టు ప్రభుత్వాధిపత్యములోనున్న ప్రదేశములలో యేమిజరుగుచున్నది యింతవరకు వెల్లడికాలేదు.

19 వ శతాబ్ది ప్రారంభములోనే "చియాంగు" వంశము పతనమాయెను. దేశములోను, వెలుపలనుకూడ వారి అధికారము తిరస్కరింపబడెను. ప్రభుత్వవర్గము, వారిసలహాదారులుయెట్టిజోక్యమును గలుగజేసుకొనకుండిరి. సరుకుల యెగుమతి దిగుమతులు క్యాంటన్‌రేవుద్వారానే జరుగుచుండెను. విదేశవ్యాపార సర్వాధికారము హాంగువర్తకప్రముఖులతో కూడిన చిన్నసంఘమున కీయబడెను. ఈ సర్వాధికారమును విచ్ఛిన్నము

సేయుటకు యత్నించిన పాశ్చాత్యదేశములలో మొదటిదగు బ్రిటన్‌దేశము హాంకాంగును దేశీయప్రభుత్వాధిపత్యములో చేర్చవలెననియు, వ్యాపారమును కొనసాగించుట కయిదు రేవుపట్టణములను నిర్ణయించవలెననియు కోరెను. తక్కిన పాశ్చాత్యరాజ్యములుకూడ యీ పద్ధతినే యనుసరించుచు 5 మొదలు 11 వరకు రేవుపట్టణముల నిర్ణయించవలెననియు, తమదేశప్రజలకు ( **Extra Territorial** ) రాజ్యక్షేత్రాతీతహక్కులను ప్రసాదించవలెననియు, పాశ్చాత్యుల అధికారముక్రింద సుంకమువసూలుచేయుశాఖను నిర్మించవలెననియు, రాజధానినగరములో రాయబారకార్యాలయములు నెలకొల్పవలెననియు, నల్లమందుదిగుమతి శాసనపూర్వకముగ నంగీకరింపవలెననియు, క్యాతలిక్కు, ప్రొటెస్టెంటు మతప్రచారకులపట్ల సమరసభావము చూపవలెననియు, దేశములో సంచరించుటకు, చైనాభాషనభ్యసించుటకు ననుమతినొసంగవలెననియు వారు కోరిరి. చైనాఉత్తరసరిహద్దులలోని కొంతప్రదేశమును తమకు దత్తముచేయవలెనని రష్యావారుకూడ కోరిరి. ఈవిధముగా తమ సర్వాధికారహక్కులను పోగొట్టుకొనుటయేగాక మంచూప్రభుత్వము చైనాప్రజల అలజడులనుకూడ యెదుర్కొనవలసివచ్చెను. 1774. 1813 సంవత్సరములమధ్య ప్రజలలో తిరుగుబాట్లు తరుచుగా చెలరేగుచుండెను. ఈ శతాబ్దమధ్యకాలములో ఆరు తీవ్రములగు తిరుగుబాట్లులేచెను. ఒకటి 1850-64 మధ్యకాలములో మధ్య, దక్షిణ, ఉత్తరభాగములలో టి-ఐ-పింగ్‌లు లేవదీసిరి. 1853-1868 సంవత్సరములమధ్య ఉత్తర, మధ్యరాష్ట్రములలో ఒక రహస్యసంఘీయులు "ని-యన్-ఫె"వారును; 1855-1873; 1862-1873 సంవత్సరముల మధ్యకాలములో "యునాన్" "షెన్సి" "కాన్సు"లోని ముస్లిములును; 1862-1876; 1866-1878 సంవత్సరకాలమధ్యమందు మధ్యఆసియాలో నాలుగు తిరుగుబాట్లను ఆ ముస్లిములే లేవదీసిరి. ఈ తిరుగుబాట్లనన్నటిని చైనాప్రభుత్వాధీనములోనుండిన సామ్రాజ్యసేనలు, పాశ్చాత్యులసహాయముతో అణచివేసినను పర్యవసానముమాత్రము కడుభయంకరముగానుండెను.

1870 సంవత్సరమునకు పిదప చైనాప్రభుత్వముపై చాలాదాడులు చేయబడెను. అనేక రేవుపట్టణములు నిర్మాణముచేయబడెను. నల్లమందు

తిరుమతి అంగీకరింపబడెను. నష్టపూర్తిధనము నిర్బంధముగా వసూలు చేయబడెను. ఇండోచైనా, బర్మా, ఫార్మోజా, పెస్కడోరుదీవులాక్రమింప బడెను. పరదేశీయులపట్ల విద్వేషముతోపాటు మంచూప్రభుత్వపాలనపై నసంతృప్తి పెరిగిపోవుటచే 1900 సంవత్సరములో మరియొక తిరుగుబాటు ప్రారంభమాయెను. దానివలన చాలామంది మరణము, దేశవిధ్వంసము గలిగెను. ప్రభుత్వము అధికనష్టమును చెల్లించవలసివచ్చెను. కొంత మాత్రమే చెల్లింపబడెను. తమ అపాయకరపరిస్థితులను ప్రభుత్వము గ్రహించి, అనేకసంస్కరణలను చేయమొదలిడిరి. కాని యీ సంస్కరణలు విప్లవకారులను తృప్తిపరుపజాలకపోయెను. 1867-1925 సంవత్సరములమధ్య టోకియో, లండన్, పారిస్, కాంటన్‌నగరములలో సిద్ధమగుచున్న విప్లవకారులు "సన్-యట్-సేన్" నాయకత్వముక్రింద 1911 సంవత్సరములో గొప్పవిప్లవమును లేవదీసిరి. ప్రభుత్వము కూలిపోగా, చైనా దేశములో ప్రజారాజ్యము ప్రారంభమాయెను.

మంచూప్రభుత్వపాలనలో చైనా వైజ్ఞానికచరిత్ర 19 వ శతాబ్దము వరకు మింగ్‌సాంప్రదాయములనే యనుసరించెను. శాంతిసౌభాగ్యముల ప్రోత్సాహముతో నెప్పటికిని అధిగమింపబడని ఆధిక్యతతో శిల్పవిద్య వర్ధిల్లెను. యూరోపియనులు, అమెరికనులచే చిరకాలము కొనియాడబడు నంతటి సొగసుగా పింగాణీపాత్రలు తయారుచేయబడెను. గృహనిర్మాణ నైపుణ్యము ప్రాచీనకాలపుటాధిక్యతతో తులతూగుచుండెను. పాండిత్యము, నవలారచనలలోను చియాంగులు ప్రాముఖ్యతగాంచిరి. రహస్య, బహిరంగవ్యవహారములలో విద్వాంసులు కడు చాకచక్యముగా పాల్గొనుచుండిరి. ప్రొటెస్టెంటు మతవ్యతిరేకులు కథలను, నవలలనువ్రాసి వాటిలో ఆనాటిభావములను, స్థితిగతులను చూచాయగా విమర్శించియుండిరి.

గత కొలది దశాబ్దములలోని చరిత్ర నిస్సారమైనదైనను మింగు ప్రభువులపాలనను పండితులు యెక్కువగా బలపరుచుచుండిరి. స్వదేశ ప్రభుత్వాభిమానమే దీనికి కారణము. మింగువంశము పతనమై విదేశ మంచూప్రభుత్వ మా స్థానమునాక్రమించినప్పుడు పండితులకొలది యీ పండితులు నిరాధారులైపోయిరి. కాలముగడచినకొలది అవిధేయతతగ్గిపోయెను.

రెండవచక్రవర్తి వివేకయుతమగు పరిపాలనావిధానము; నిస్సంశయమైన మంచూప్రభుత్వపు సైనికశౌర్యగుణమే దీనికిహేతువు. మంచూపాలకుల నాటి సాహిత్యము ప్రాచీనగ్రంథసాహిత్యమునుండి యెక్కువగా మార్పు చెందుటచే గొప్పప్రాముఖ్యతవహించెను. ప్రతిసాహితీగ్రంథములోను, పరిశీలన, నిదర్శనము, నవీనకల్పనాశక్తి అవశ్యముగానుండవలసిన ఆవశ్యకతను "కు-యన్-ఉ" (1613-1682) నొక్కివక్కాణించి ఆ కాలపునాటి భావములను వెల్లడిజేసెను. స్థానికాచారములు, రాజకీయ, సాంఘికసంస్థల స్థితిగతులనుగురించి తెలుసుకొనుటకు యీ మూలసిద్ధాంతములే యెక్కువగా తోడ్పడెను.

చైనా పుస్తకభాండాగారముల కత్యంత అవసరములగు ఆదర్శ గ్రంథములు (Reference Books) సర్వవిషయసంగ్రహ నిఘంటువులు, శిల్పాగారములు, సామ్రాజ్యాధిపతులఆధ్వర్యమున ఆ శతాబ్దాంతమున ప్రచురింపబడెను. భద్రపరుపబడదగిన సంగ్రహవచనపద్యకావ్య సంపుటములు సారస్వతగ్రంథములు, చరిత్రలు, గణితశాస్త్ర, జ్యోతిషశాస్త్ర, వృక్షశాస్త్ర, భూగోళశాస్త్రములనుగురించి వ్రాయబడిన నూతనగ్రంథములపై విమర్శనగ్రంథములు వెలువడెను. సారస్వతాభివృద్ధిప్రయత్నములు నిర్విరామముగా కొనసాగుచుండెను. మితిమీరిన భావస్వాతంత్ర్య మంగీకరింపబడకుండెను. ఐశ్వర్యము తదితరవిషయములను సుసాధ్యముజేయుచుండెను. తత్వజ్ఞానభావములను, రాజకీయ, ఆర్థికస్థితిగతులనుగురించి చర్చలుచేయ సాధ్యముగాకుండెను. కాని, చారిత్రాత్మక విషయములపై విమర్శన లుచ్చస్థితినిగాంచెను. శబ్దోత్పత్తిశాస్త్రము; స్వరశాస్త్రము (ఉచ్ఛారణశాస్త్రము) న్యాయశాస్త్రము, స్థానికదేశీయచరిత్ర, భూగోళము, గణితశాస్త్రము ప్రాచీన విషయములు, మూలగ్రంథములపై విమర్శ, మతసిద్ధాంతములపై వ్యాఖ్యానములు, విశేషప్రజాదరణను పొందుచుండెను. ఈ గ్రంథములకు సొగసుగా నకళ్ళనువ్రాయుటకు 15 వేలమంది లేఖకులు నియమింపబడిరి. గ్రంథములకు నామములు నిర్ణయించుట, అపసవ్యముగానుండినవాటిని త్రోసివేయుట, సుమారు 10 వేల గ్రంథములలో ప్రతిగ్రంథమునకు సంక్షిప్తవర్ణనము, వెలనిర్ణయము మొదలగు కార్యములనిర్వహణకు 361 మంది

సంపాదకులు సుమారు 20 సంవత్సరములకాలము పనిచేసిరి. చేసినశ్రమకు జరిగినవ్యయమునకు తగినంతఫలితము చేకూరుటయేగాక నంతవరకు అసంపూర్తిగానుండిన ప్రైవేటుప్రచురణలకుకూడ నా ఫలితమునంద జేసెను. దీనివలన నొక దుష్ఫలితము చేకూరెను. తనప్రజలకు వారిపూర్వీకులు ఖితాన్, జర్చిన్, మంగోలులకు విరుద్ధముగా నుండినట్టియు, రాజద్రోహకరముగను, అయుక్తమని తనకు తోచినట్టియు, విషయములనన్నింటిని చైనాసారస్వతమునుండి తొలగించుఅవకాశము "చి యన్ లంగ్" చక్రవర్తికి లభించెను.

19 వ శతాబ్దపు మధ్యకాలమునాటి విద్వాంసులు చాలమంది తిరుగుబాటుదార్లు "టి-ఏ-పెంగ్" పక్షముననుండక మంచూలపక్షమున నేలచేరిరో పైనసుదహరింపబడిన విషయములు కొంతవరకైనను తెలియజేయగలవు. ఇరువదవశతాబ్దప్రారంభకాలములో అనేకులు విద్వాంసులు మంచూప్రభువులపాలనలోనేనుండుటకు యిష్టపడి విప్లవకారుల నెదిరించిన కారణము పైవిషయములద్వారా తెలియుచున్నది. పైనసుదహరింపబడిన విధముగా గ్రంథనిర్మాలముకాగానే ప్రజాబాహుళ్యముయొక్క ఆదరణనుపొందిన రెండు కల్పనాగ్రంథములు వెలువడెను. వానిలో "జు-లిన్-వె-షి" అనున దొకటి. సివిల్ఉద్యోగుల పరీక్షలనుగురించి వ్రాయబడిన అవహేళన కావ్యమది. తమజీవితకాలములో అధికభాగమును తమఅక్కరలను తృప్తిపరచుకొనుటకు సంసిద్ధులైయుండిన పండితులకు యిది యోగకాలముగా నుండెను *

ఈగ్రంథకర్త "ఉ-చింగ్-ట్జు" (1701-1754) గొప్పకుటుంబమునకు చెందియుండెను. ఈయన స్వేచ్ఛాభావములుగలవాడు. మింగ్ పాలనలోని ఉపాఖ్యానములు నిందులో వ్రాయబడెను. నిర్భాగ్యజీవులగు నుద్యోగులందరకు వారిమరణానంతరము గౌరవబిరుదులనిచ్చి సత్కరించునట్లువ్రాసి ఆవిధముగ గ్రంథమును ముగించెను.

---

* ఒకేరాష్ట్రీయకేంద్రములో రెండవశ్రేణిపరీక్షలకు ఎనిమిది తొమ్మిది వేలమంది హాజరగుటయే దీనికి నిదర్శనము. వారిలో 61 మంది ఉత్తీర్ణులైరి.

1719-1764 సంవత్సర మధ్యకాలములో "టి-స్యావ్-సుహి-చి-యిన్"చే వ్రాయబడిన "హంగ్-లౌ-మింగ్" స్వీయచరిత్ర రెండవది. ఆ కాలపుఆచారములు, కల్పితవిషయములనుగురించితెలుపు యీ కథ చితికి పోయిన గొప్పకుటుంబపు దురదృష్టస్థితిని వివరించెను. లక్షలాదిప్రజలకు యీ చరిత్ర దుఃఖకరముగానుండెను.

కారుమబ్బు అధికముగానుండినను 19 వ శతాబ్దపు ప్రకృతిచరిత్ర ఎడతెగని విచారకరస్థితిలోనుండలేదు. జాతీయవిద్వాంసులు పదునెనిమిదవ శతాబ్దకాలమునాటి పద్ధతిననుసరించియే చరిత్ర, కావ్యములపై విమర్శనలను జరుపుచుండిరి.

కొలదిరేవుపట్టణములలో వార్తాపత్రికలు ప్రారంభింపబడెను. భావ గర్భితములగు యూరోపియన్ గ్రంథములు అనువదింపబడెను. ఈ అనువాదములు వేర్వేరువిధములగు భావములను ప్రోత్సహించి రచనలలో నవీన మార్గములను సూచించెను. సాంకేతికవిద్యాలయములు ప్రారంభింపబడెను. ఉత్తమశ్రేణికిజెందిన విద్యార్థులు, ప్రచారసంఘములు యునైటెడ్ స్టేట్సు, ఇంగ్లాండు, ఫ్రాన్సు, 1900 సంవత్సరానంతరము జపానుకు పంపబడిరి. * కొలదిమైళ్ళనిడివిగల రైలుమార్గములువేయబడెను. ఓడలునడుపబడెను, తంతులువేయబడెను, గనులుప్రారంభింపబడెను. రేవుపట్టణములయొద్దను, సముద్రతీరప్రాంతములలోను, దేశములోని కాలువలచెంతను, చిన్నసైనిక నిలయములయందును పనిచేయుటకు సముద్ర వర్తకసుంకములవసూలు శాఖవారిచే కొంతమందికి శిక్షణనొసంగబడెను. ప్రొటెస్టెంటు మతప్రచారకులు మతము, భావము, విద్య, సాంఘికస్థితిగతుల అభివృద్ధి, ప్రజారోగ్య

* 13 వేలమందివిద్యార్థులు 1902-1910 సం॥ల మధ్య కాలములో జపానుకు పోయిరి.

"లింగ్-చి-హాంగ్" ఎడ్యుకేషనల్ రివ్యూ. (ఏప్రియల్ 1010.)

ములనుగురించి, అత్యంతయుపయోగకరమైన విషయములను ప్రచారము చేయుచుండిరి. తమకు అనువగుకాలములో తమయిష్టానుసారముగా, నవీన ప్రపంచవిధానము, భావములను తమకుపీలుగా పొందుపరచుకొనుటకు పరిశోధనలను చేయుచుండిరి. ఈ కార్యనిర్వహణ విశేషవ్యయకారణమైనను తమభావములకు సంస్కృతికి అనువుగాని సంస్థలను వున్నదివున్నట్లుగా అనుకరించుటకంటె యిదియే మంచిమార్గమని వారు దలంచిరి.

—:o:—

# తొమ్మిదవ అధ్యాయము

చైనాప్రజాప్రభుత్వము సుస్థిరవిజయమును పొందజాలకపోయెను. "సన్-యట్-సేన్" వంటి ప్రముఖులనాయకత్వముక్రింద ప్రారంభమున తలపెట్టబడినంతటి గొప్పఆశలు, ఆ ప్రయత్నములలో యిమిడియుండిన క్లిష్టసమస్యలను యెదుర్కొనవలసివచ్చుటచే సఫలము కాలేదు. దృఢమైన ప్రజాభిప్రాయమును సాధించుటకు నూటికి సుమారు యెనుబదిమందియైనను చదువగలశక్తిగలిగియుండవలెను. దేశములో అనైక్యత ప్రబలముగనుండెను. స్వప్రయోజనపరు లెక్కువగానుండిరి. విదేశీయప్రభుత్వములవలన ననేకక్లిష్టసమస్యలు ఉత్పన్నమాయెను. వ్యక్తులయెడగల భక్తివలన సైన్యమంతయు చిన్నచిన్నవిభాగములుగా చీలిపోయెను. నదులు, కాలువలద్వారా తొల్లిటిప్రయోజనములను కొంతవరకైనను గలిగించుటకును, నౌకాశ్రయముల నిర్మించుటకును, కోస్తాతీరప్రదేశములను కాంతివంతముగాచేయుటకును, వ్యవసాయాభివృద్ధికై నూతనరాకపోకలమార్గములను నిర్మించుటకును, క్రొత్తగనులను ప్రారంభించుటకును, నగరములను నవీనపద్ధతులతో పెంపొందించుటకును, ప్రజారోగ్యమునకు సౌకర్యములను యేర్పాటుచేయుటకును, మొదలగు కార్యములను నిర్వహించుటకు వలసిన అధికధనమును, ఖాళీగాయున్న ప్రభుత్వధనాగారము అమర్చలేకపోయెను. ఏ యితరదేశములు యెదుర్కొననట్టి ఆందోళనకరమైన సమస్యలను యెదుర్కొనగలిగి చైనా కొంత జయమును సాధించుట అద్భుతకార్యమేయగును.

జపానుతో యుద్ధమువచ్చుటకుపూర్వము, చైనానాయకులు, విదేశీయులసలహా, సాంకేతిక, ఆర్థికసహాయముతో నాణ్యసంపద, ఆర్థికవిధాన పునర్నిర్మాణమును సుస్థిరముజేయమొదలిడిరి. సైన్యమునైక్యముచేసి, చిన్నఆయుధశాలలను, ఉద్యోగులకు తర్ఫీదునిచ్చు శిక్షణశాలలను స్థాపించిరి. నీటిపారుదలసౌకర్యములను అభివృద్ధిజేసిరి. బాటలనిర్మాణము; అడవులనువృద్ధిచేయుట; భూములను సాగుకులాయక్కుచేయుపథకములను తయారు

చేసిరి. వాణిజ్యము, పరిశ్రమలను ప్రోత్సాహపరచిరి. ప్లేగ్ జాడ్యనివారణకు, చికిత్సకు పురుషులను, స్త్రీలను, వైద్యశాస్త్రములోను, రోగిసంరక్షణ పద్ధతులలోను తర్ఫీదునిచ్చిరి. వీటికితోడు శాసనములను సవరించిరి. దేశైక్యతకు కృషిచేసిరి. లోగడ విదేశీయులకుకల్పించబడిన ప్రత్యేకసదుపాయములను తుదముట్టించుటకు శ్రమపడిరి. నిరక్షరాస్యతనిర్మూలన ప్రయత్నములు ప్రారంభించిరి. వేలకువేలు ప్రాథమికపాఠశాలలను, కొలది కళాశాలలను ప్రారంభించి, రాజధానినగరములో పరీక్షలను నిర్ణయించిరి. ఇవి పురాతనపద్ధతులకు తుల్యముగానుండెను. చైనాపురాతనవిషయములలో ప్రధానమైనవానిని భద్రపరుచుట, ఆధునికశాస్త్రములలో పరిశోధనాభివృద్ధి జేయుటకు విద్వత్సభను (ఎకాడిమియా-సినీకా) స్థాపించిరి. సకలశాస్త్రములలో నైపుణ్యతనుగలిగిన పండితులందరు ఆ సభలో సభ్యులుగానుండిరి. ఈ నిర్ణయములు, ప్రొటెస్టెంటు, కేతలిక్ మిషనరీలసహాయముతో సామాన్య ప్రజానీకమును విద్యావంతులుగజేయుటలోను వైజ్ఞానికవిప్లవమును ప్రేరేపించుటలోను ప్రముఖపాత్రను వహించెను. *

చైనాప్రజాప్రభుత్వ రాజకీయచరిత్రలోని తొలిసంవత్సరములు అల్లకల్లోలయుతమైయుండెను. 1917 సంవత్సరములో ఏకరాజ్యాధిపత్యమును స్థాపించుటకై చేయబడిన ప్రథమ అధ్యక్షుని నిష్ఫలప్రయత్నములు ముగియగానే, "చియాంగ్" వంశప్రభుత్వమును పునఃస్థాపనజేయుటకు నిరర్థక యత్నములుచేయబడెను. అటుపిమ్మట స్వల్పకాలములోనే ప్రారంభమైన అంతర్యుద్ధములు - కొలదివిరామములతో - నిరంతరాయముగా కొనసాగుచుండెను.

చియాంగ్-కై-షేక్ (జ : 1887) నాయకత్వముక్రింద 1926 సంవత్సరములో కొమిన్‌టాంగు ప్రభుత్వమును స్వాధీనపరచుకొనుటకు యత్నించిరి. మరుసటి సంవత్సరములో నాన్కింగ్‌నగరములో తమరాజధానిని స్థాపింపగలిగిరి. నూతనప్రభుత్వపక్షాధినేత "చియాంగ్" రాజకీయ, సైనిక

* 1937 సంవత్సరపు చైనాదేశపునర్నిర్మాణము వివరణను తెలుసుకొనుటకు - China then and now - 2 వ. భాగము (పికింగ్, 1940) లోని జయ్యూన్ ఎస్కారా చూడుడు.

వ్యవస్థలలో ప్రముఖస్థానమునువహించి నలుబదిసంవత్సరములకాలములో దేశములో కొంతఐకమత్యమును సాధించెను. తన రాష్ట్రీయప్రత్యర్థులతో సలుపుపోరాటములతోపాటు కమ్యూనిస్టులను తొలగించుటకుప్రయత్నించుట ఆవశ్యకమని ఆయనతలంచెను. ఈ ప్రయత్నములలో ఆయనవెగ్గలేదు, 1934 సంవత్సరములో కమ్యూనిస్టులను వారిదుర్భేద్యస్థావరములనుండి తరిమివేయగలిగిన విషయము వాస్తవమే, కాని వారందరు "యునాన్" పరిసరప్రదేశములలోచేరిరి. జపానోడిపోయిన తరువాత గడచిన సంవత్సరములలో చియాంగ్‌తో మరియొక విజయసిద్ధిదాయకమగు పోరాటమునకు వలయుబలమును వారచట సమకూర్చుకొనుచుండిరి.

1912 సంవత్సరమునుండి చైనీయులకు విదేశప్రభుత్వములతో ప్రతిబంధకము లధిగమగుచుండెను. జపానువారివలన వారికిగలిగిన ప్రయాసము తదితర విదేశప్రభుత్వములవలన గలిగినదానికంటె నెక్కువగానుండెను. 1915 సంవత్సరములో జపానుప్రభుత్వము చైనారాజ్యాధిపత్యము తమకులొంగియుండునట్లుచేయగల ననేకషరతులనుకోరిరి. చైనాప్రజా ప్రభుత్వమునకు ప్రతికూలములైన నొడంబడికలనేకములు చేసుకొనబడెను. వాషింగ్‌టన్‌లో సమావేశమైన తొమ్మిది ప్రభుత్వాధికార ప్రతినిధుల సమావేశఫలితముగా, చైనాస్వాతంత్ర్యము, ప్రాదేశికపూర్ణత్వము, యథాస్థితికిరాగలిగెను. అప్పుడు "షాన్‌టంగ్" ద్వీపకల్పము చైనాకు తిరిగి ఒప్పగించబడెను. 1927 సంవత్సరములో నాన్కింగ్‌ప్రభుత్వము చైనాఉత్తరప్రదేశములను లోబరుచుకొనుటకు యత్నించినప్పుడు మరియొక అంతర్యుద్ధము ప్రారంభమాయెను. 1931-1933 సంవత్సరములమధ్యకాలములో జపానువారు మంచూరియాను ఆక్రమించుకొని షాంగేనగరమును ముట్టడించి, నగరములో కొంతభాగమును తగులబెట్టి "పికింగ్"కు ఉత్తరదిశనున్న "జహాక్"పై దాడిచేయుటతో చైనాకు తీవ్రమగు యిక్కట్టులు గలిగెను. ఈ విజయపరంపర జపాన్‌సైనికాధికారులలో నత్యాశను రగులజేసెను. 1933 వ సంవత్సరములో ఉత్తరచైనాలోని మరియొక విశాలభాగమును స్వాధీనపరచుకొనుటకు జపాను యత్నించెను. కాని "ఉత్తరచహాన్"ను తూర్పు"హోపె"ను మాత్రమే లోబరుచుకొనగలిగిరి.

1937 సంవత్సరములో రెండవప్రపంచయుద్ధము ప్రారంభమాయెను. చైనాప్రజాప్రభుత్వ మత్యున్నతస్థితిలోనుండినకాలములో యీ యుద్ధము ప్రారంభింపబడెను. రాజకీయముగాను ఆర్థికముగాను, యీ యుద్ధమును గురించి ప్రశంసింపదగినవిషయము లనేకములుండెను. ఏమాత్రమాలసించి నను, సైనికచర్యలకు, యుద్ధవిరామమునకు ధనవ్యయమధికమగునని జపాను యుద్ధనాయకులు నిర్ణయించుకొనిరి. అనేకవిషయముల పునర్నిర్మాణ చర్య లను గుర్తించిరి. "యునైటెడ్ స్టేట్సు," జర్మనీవిమానకంపెనీల సహాయ ముతో ననేకవిమానమార్గముల నభివృద్ధిజేసిరి. జర్మనీపోషణక్రింద తమ సైన్యములోని కొంతభాగమునకు నవీనపద్ధతులపై శిక్షణనేర్పించిరి. 1929 సంవత్సరములో విదేశీయులపాలనలోనుండిన ననేకప్రదేశములు చైనావారికి తిరిగి నీయబడెను. మరికొన్ని నూతనప్రదేశములుగూడ నీయబడనున్న సమయంలో యీ యుద్ధ మంతరాయమును గలిగించెను.

ఒకప్పుడుమంచూరియాయుద్ధనాయకులుకమ్యూనిస్టులతోచేరి "చియాంగ్-కై-షేక్" పై పన్నుచున్నకుట్రలను జపానురాజ్యవ్యాప్తకులు గ్రహించి దిగులుబడిపోయిరి. 1936 డిసెంబరులో "చియాంగ్" "సియాన్" లో నిర్బం ధింపబడెను. కమ్యూనిస్టులను నిర్మూలముచేయు ప్రయత్నములను విర మించుకొనుటకును, దానికి ప్రత్యామ్నాయముగా, జపానుప్రభుత్వముపై చేయుదాడికి నాయకత్వమును వహించుటకును నంగీకరించినపిదప విడుదల చేయబడెను.

"పేపింగ్"కు సమీపమున వారిసైన్యము ప్రథమదాడిని ప్రారంభిం చిరి. 15 మాసములలో కాంటన్‌కు దక్షిణముననున్న కోస్తాప్రాంతమునంతను ప్రధాననగరము "హాన్‌కో"ను జపానుసైనికాధికారులు స్వాధీనపరచుకొనిరి. తమ రాజధానిని పశ్చిమరాష్ట్రము "జచుయన్"లోనున్న "చుంకింగ్"కు మార్చవలసినఅగత్యము, ప్రభుత్వఉన్నతాధికారులకుగలిగినప్పుడు, నైతిక పతనముగలిగి, నిరోధశక్తి సన్నగిలిపోయెను. అనేకులు సైన్యమునుండి పారిపోయిరి. ప్రభుత్వపక్షము, కమ్యూనిస్టుపక్షములమధ్య విభేదములు విస్తరించుచుండుట గమనించదగియుండెను.

వాయవ్యప్రాంతములోనున్న "యునాన్"ను స్థావరముగాజేసుకొని

కమ్యూనిస్టులు తమసైనికులను ఉత్తరమునను; "యాంగ్ట్జీ" నదిలోయ కును మధ్యనుండిన జపాన్‌వారి రాకపోకలమార్గములలోనికి వ్యాపింపజేసిరి. చైనావారి "గొరిల్లా"దాడులు జపానువారికి ఎడతెగని ఉపద్రవమును గలి గించుచుండెను. ఈవిధముగా లభించుచున్న సహాయమును గుర్తించకపోగా, చియాంగ్ అయనయనుచరులు దానిని భగ్నముచేయుచుండిరి. జపానువారిపై కమ్యూనిస్టులుపొందుచున్నవిజయములు (ప్రభుత్వపార్టీ) కొమిటాంగ్‌తో ఉత్తరోత్తరా పోటీయుద్ధములకు దారితీయవచ్చునని చియాంగ్ స్పష్టముగా గ్రహించెను.

1941 సంవత్సరము డిసెంబరు మాసాంతమున, జపాను అక్షరాజ్య ములతోచేరినప్పుడు బ్రిటీషుప్రభుత్వపు అధినివేశప్రాంతము (Crown Colony) జపానువారి హస్తగతమాయెను. మరికొలదిమాసములలో ఇండో చైనా, మలయా, బర్మాదేశములుకూడ నాక్రమింపబడెను. చైనాకోస్తాకు లోపలిభాగములోనుండిన ప్రదేశములకు దొంగతనముగా యుద్ధపరికరములు పంపుయత్నములు నిలచిపోయెను. ఇండియానుండి చైనాను విడదీయు పర్వతశ్రేణులమీదుగాపోవు వాయువిమానములద్వారా సరఫరాలపై చైనా వారు సంపూర్ణముగా ఆధారపడవలసివచ్చెను. ఈ మార్గముద్వారాలభించునవి కూడ కడు స్వల్పమే. ద్రవ్యోల్బణమధికమాయెను. ఉత్పత్తి క్షీణించెను. తీవ్రకాటకములు సంభవించెను, ఈ దుష్ఫలితములు ప్రజలనైతికవర్తనము నకు భంగముకలిగించి వారి బారుధ్యమును నీరసింపజేసెను. మిత్రమండలి వారిసహాయ మధికముకాగా జపానునాయకులు మధ్యదేశముపై దాడిజేసిరి. అప్పటికే కాలముమించిపోయెను. యునైటెడ్‌స్టేట్సుసైన్యము, పసిఫిక్ సముద్రములోని వారినావికాదళము ఒకదీవినుండి వేరొకదీవికి కప్పగంతుల వలెదాటి శత్రుజలాంతర్గాములను, ఓడలను నిర్మూలించెను. 1945 సంవత్స రము ఆగస్టు 14 వ. తేదీతో ప్రపంచచరిత్రలోని అమితవ్యయదాయకమగు నట్టియు, చైనావారికి ఎనిమిదిసంవత్సరములపర్యంతమునడచిన యీ తీవ్ర ప్రయాసకరమగుయుద్ధము ముగిసెను. పరిశ్రమలకు, వాణిజ్యమునకు, రాక పోకలమార్గములకు, వ్యవసాయమునకు, మూలధనాభివృద్ధికి, వైజ్ఞానిక సంస్థలు మొదలగునట్టివాటికన్నిటికిని యీయుద్ధమువలనగలిగిన నష్ట మపా

రము. తమభవిష్యత్తులో విశ్వాసముంచి, లక్షలాదిప్రజలు తమనివాసములకు తిరిగిపోయి 1937 సంవత్సరములో తెగిపోయిన సాధారణజీవితములను తిరిగి ప్రారంభించిరి.

ఆ కాలపుస్థితిగతుల పర్యవేక్షణలో కొన్నిప్రోత్సాహకరములగు విషయములుండెను. చైనాప్రజాప్రభుత్వము తనకాళ్ళపై తానునిలువబడగల స్థితినిగాంచెను. చైనాప్రభుత్వ సర్వాధికారమునకు యెట్టిఅవధులు లేకుండెను. 1943 సంవత్సరమున కెయిరోలోజరిగిన సైనికాధికారులసమావేశములలో చైనాప్రభుత్వము పెద్దరాజ్యములలో నొకటిగా యునైటెడ్‌స్టేట్సు, బ్రిటన్‌ప్రభుత్వములచే వంగీకరింపబడెను. 1945 వ సంవత్సరములో సేన్‌ఫ్రాన్సిస్కోలోజరిగిన సమావేశములో సకలప్రభుత్వముల అంగీకారమునుపొంది, తదనంతరము ఐక్యరాజ్యసమితిలో తనవిధిని నిర్వహించుచుండెను. 1945 సంవత్సరములో రష్యా, చైనాదేశములు ముప్పదిసంవత్సరములకాలము స్నేహసంబంధములను గలిగియుండునట్లు ఒడంబడికను చేసుకొనిరి. మంచూరియా ఫార్మోజాలు, విజయసూచకముగా చైనాకు తిరిగి నీయబడెను. కాని పైనచెప్పబడిన లాభములకంటె నష్టములెక్కువగా నుండెను. మంచూరియా రేవుపట్టణములు డైరన్, పోర్టుఆర్థరులను రష్యా ఆక్రమించి కొరియాఉత్తరదిశ సగభాగములోప్రవేసించిరి. రష్యన్ సేనలు తిరిగిపోవునప్పుడు జపానువారిచే యుపయోగింపబడకుండ వదలివేయబడిన యుద్ధసామాగ్రిని చైనా కమ్యూనిస్టుగొరిల్లాలకు యిచ్చిపోయినట్లు తెలియుచున్నది. అన్నివిధముల విలువైన బహుమానముగా పరిగణింపబడు ఫార్మోజాను చైనా (జాతీయప్రభుత్వము) సైనికగుంపు లాక్రమించుకొనిరి. ఉన్నదున్నట్లు బహిరంగముగాచెప్పగలిగిన యిరువురుపండితులు హత్యజేయబడిరి. 1946 సంవత్సరము జూలైమాసములో "చియాంగ్-కై-షేక్" ఆధిపత్యముక్రింద ప్రభుత్వము కొనసాగవచ్చుననుసూచనలు గోచరించెను. కమ్యూనిస్టులయొక్కయు, జాతీయప్రభుత్వముయొక్కయు సైన్యములు విరోధభావముతో ఎదుర్కొనిరి. పీడితప్రజల సహాయార్థము, ఐక్యరాజ్యములు, అనేకప్రజాసంస్థలు; ఆహారము, ప్రత్తి, ఔషధములు, పుస్తకములు మొదలగు వివిధసామాగ్రులు ఓడలపై చైనాకు పంపిరి. జాతీయపక్షము,

కమ్యూనిస్టులలో సామరస్యమును గలిగించుటకు జనరల్ జార్జి సి. మార్షల్‌ను, యునైటెడ్‌స్టేట్సు ప్రభుత్వముపంపెను. ఆయన 1947 సంవత్సరము జనవరిలో తిరిగివచ్చి, జాతీయప్రభుత్వములోనున్న కమ్యూనిస్టులను వారిప్రతీకారులను విమర్శించిరి. ప్రభుత్వపక్షములోని, మైనార్టీ పార్టీలలోని లిబరల్సు చియాంగ్-కై-షేక్ సలహాతో పరిపాలనచేసినచో చైనాకు శాంతిలభించగలదని ఆయన చెప్పెను. చైనాలో శాంతిసమకూరగ వచ్చుననియెడి ఆశలను మార్షల్ నివేదిక తుదముట్టించెను.

ఈ చరిత్రవ్రాయునప్పటికి యుద్ధము ముగిసెను. ఫార్మోజాదీవి మాత్రము జాతీయప్రభుత్వస్వాధీనములో నుండెను. మా-సె-టుంగ్, ఆయన సహకారుల నాయకత్వముక్రింద కమ్యూనిస్టులు మంచూరియానుండి జాతీయ ప్రభుత్వ సైన్యములను తరిమివేసిరి. "పిపింగ్" మొదలు క్యాంటన్‌వరకును, హెనాన్‌ద్వీపము, షాంగ్‌హైనుండి టిబెట్టు సరిహద్దువరకునునుండు అవరోధములు తొలగింపబడెను. 1950 వేసవికాలములో ఫార్మోజాదీవిపై దాడి చేయుటకు సన్నాహములు చేయబడెను. 100 మైళ్ళు వెడల్పుగలిగిన ఫార్మోజాజలసంధి రక్షణార్థము ప్రెసిడెంటు ట్రూమన్ 1950 జూన్ 27 వ తేదీ ఏడవనావికాదళమునుపంపెను. అంతటితో ఫార్మోజాపై యుద్ధసన్నాహము లాగిపోయెను. వెంటనే దాడి దళములలోని కొన్నిభాగములు కీలకస్థావరములకు మార్చబడెను.

కమ్యూనిస్టులు "పి-పింగ్‌ను" తమరాజధానిగాప్రకటించి దానిపేరును తిరిగి "పి-కింగ్" గామార్చిరి. చైనాప్రజాస్వామిక ప్రభుత్వము మా-సి-టంగ్ అధిపతిగాను, చౌ-యన్-లే" (జ. 1898) ప్రధాని, విదేశవ్యవహారశాఖ మంత్రిగాను నేర్పడి 1949 సంవత్సరము అక్టోబరు 1 వ తేదీన స్థాపింపబడెను. ఈ ప్రభుత్వమును రష్యా, గ్రేట్‌బ్రిటన్, యిండియా మరికొన్ని యితరప్రభుత్వము లంగీకరించిరి. ఐక్యరాజ్యసమితిలోని చైనా జాతీయ ప్రతినిధిస్థానమును వారిప్రతినిధి ఆక్రమించలేదు. 1950 జూన్ 25 వ తేదీ కొరియాలో ప్రారంభమైన పోరాటములు తీవ్రతరసమస్యగా విజృంభించుట వలన చైనాప్రజాస్వామిక ప్రభుత్వమునకు ప్రతినిధిస్థానమును నిర్ణయించు విషయమప్పటికి నిలుపుదలచేయబడెను.

చైనాదేశములో యీ నూతనప్రభుత్వము అతిత్వరితముగా తమ అధికారమును వ్యాప్తిజేసిరి. మాధ్యమికపాఠశాలలోని, కళాశాలలోని వేలకువేలు యువకులకు ప్రభుత్వపదవులను నిర్వహించుటకువలయుశిక్షణ ఈయబడెను. లోగడపదవులలోనుండినవారిలో యెక్కువమంది నూతనమార్పులకు తలయొగ్గుటచే తిరిగి అధికారపదవులలో నియమితులైరి. అధికారులపై యిదివరలో సామాన్యముగా చేయబడుచుండిన అన్యాయము, బంధుప్రేమ మొదలగు ఫిర్యాదులు ఆగిపోయెను. అందరికంటె కృషీవలులపట్ల, కార్మికులపట్ల, శ్రద్ధచూపవలెననెడి ప్రభుత్వ నూతన తత్వము విజయవంతముగా యుద్యోగులలో నాటుకొనిపోయెను. న్యాయవిచారణ వెంటనే జరుపబడుచుండెను. జైలుసంస్కరణలు ప్రకటింపబడెను. వ్యవసాయముచేయని భూఖామందులయొద్దనుండు భూములను తీసుకొని పొలములేనివారికి పంచియివ్వబడెను. పన్నులుయెక్కువగా విధింపబడినను పరిశ్రమాధిపతులను తుడిచిపెట్టునంతటి అధికముగా లేవు. నాణ్యములు, ధరలు సాధ్యమైనంతవరకు స్థిరపరుపబడెను - జీవనాధారములగు సరుకులనుకొనుటకు ప్రభుత్వ ఆధ్వర్యముక్రింద వర్తకసంఘములు ప్రారంభింపబడెను. రాకపోకమార్గములు యథాస్థితికితేబడుటయేగాక కొంతవరకు అభివృద్ధి చేయబడెను. ఫార్మోజాదీవిరక్షణకు జాతీయప్రభుత్వవిమానములు (యుద్ధం) ఆయుధనావలును, సముద్రమార్గములలోపోవుటకు అంతరాయమును గలిగించుటచే సముద్రతీరవిషయము తీరనిసమస్యగా పరిగణింపబడెను. 1950 సంవత్సరపు వేసంగిలో గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్‌స్టేటు మధ్య కుదిరినఒడంబడిక 1950 సంవత్సరాంతమున వారిఒడంబడిక కనుగుణ్యముగా చేయబడిన నిషేధపుటుత్తరువులు యీ సమస్యను క్లిష్టతమము జేసెను. యుద్ధములలోనుపయోగింపబడుటకు వీలగుసరుకులను చైనా ప్రజాస్వామికప్రభుత్వమునకు సరఫరా చేయగూడదనునదియే యీ ఒడంబడికలోని నిర్ణయము. అంతర్జాతీయ వ్యాపారముపై ఆధారపడియుండిన చైనాకు యిది గొడ్డలిపెట్టుగా పరిణమించెను. రష్యాతోను, ఖండ్రప్రదేశములతోను కొంతవరకు వర్తకము సాగుచునేయుండెను. చైనా, రష్యాదేశములమధ్య

సఖ్యత, సౌభ్రాతృత్వము, పరస్పరసహాయము చేసుకొనుటకు యేర్పాటు చేసుకొనబడిన నిర్ణయములు కొంతవరకు సహాయకారిగానుండెను.

కమ్యూనిస్టేతరసభ్యులను కొంతమందిని కలుపుకొనుటచే నూతన ప్రభుత్వము మాస్కో సర్వాధికారమును అంగీకరింపకపోవచ్చునని యెడిఆశ ప్రబలియుండెను.

తూర్పుఐరోపాలోని ఆశ్రితరాజ్యముల ప్రజాప్రభుత్వము లనుగమించు చున్న పంథానుండి యిసుమంతయు విడిపోయెడుసూచనలు నేటివరకు వెలు వడలేదు. మావ్, తదితర చైనాప్రభుత్వాధినేతలు చైనాప్రజాస్వామికమును ప్రపంచ (కమ్యూనిజం) సామ్యవాదమార్గముననే ననుసరింపజేసిరి. మధ్య మధ్యవచ్చు అవసరదశల నధిగమించి ఆ గమ్యస్థానముునే గలుగజేయుదు మనివాగ్దానముజేసిరి. ఆ సిద్ధాంత నిర్వహణకే అన్నికళలు సమకూర్చబడెను. సాహిత్యము, సంగీతము, నాటకము, నృత్యము, చిత్రలేఖనము మొదలగు కళలన్నియు నా పద్ధతి నే సమర్థించును. వార్తాపత్రికలు, రేడియోలు కూడ నంతే. మతము నిషేధించబడలేదు. కాని అది నిర్వీర్యముగను, పురాతన మైనదిగా కనుపడునట్లుచేయబడెను. పాఠశాలలోని యువకులు, అనేకులు విద్వాంసులు, కొలదిమంది వర్తకుల ప్రోద్బలముతో చైనాప్రభుత్వము ఉన్నతస్థితినిపొందుచున్నది. దానితోపాటు వ్యాకులభావపు చిహ్నాములుకూడ పొడగట్టుచున్నవి.

మొత్తముమీద నూతన (వ్యత్యాసపు) రూపముతో చైనాదేశము వర్థిల్లుచున్నది. కాని విభేదములు అస్పష్టముగా గానబడుచునేయున్నవి. ఇవి, వీటివంటి తదితరవ్యవహారములు చైనాను ముందునడిపించువారిరాకకై యెదురుచూచుచున్నవి.